# సాహిత్య సంస్థలు



డాక్టర్ ద్వా. నా. శాస్త్రి.

# సాహిత్య సంస్థలు

(ఉభయగోదావరిజిల్లాలపై ప్రత్యేక పరిశోధన)



తెలుగు విశ్వవిద్యాలయంనుంచి ఉత్తమ సిద్ధాంత వ్యాసానికి

మేడపాటి అమ్మిరెడ్డి స్మారక స్వర్ణపతకం పొందిన

పి హెచ్. డి. సిద్ధాంత వ్యాసం



(సాహితీ రజతోత్సవం సందర్భంగా ప్రచురితం)




డాక్టర్ ద్వా. నా. శాస్త్రి

ఎం.ఎ., ఎం.ఫిల్., పిహెచ్.డి., డి.ఎల్.

రీడర్, తెలుగుశాఖ

ఎస్. కె. బి. ఆర్. కళాశాల, అమలాపురం-533 201

SAHITYA SAMSTHALU

(Ph.D. Thesis - Won Medapati Ammireddy Gold Medal for the best - thesis)

Copies : 500

Price : Rs. 80-00

ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
బ్యాంకు స్ట్రీట్, హైదరాబాద్

మరియు ఇతర బ్రాంచీలు

లేదా

డి. దుర్గ
చల్లావారివీధి_విద్యానగర్ కాలనీ
అ మ లా పు ర ం - 533201

తెలుగు విశ్వవిద్యాలయంవారి
ఆర్థికసహకారంతో ముద్రించబడింది

ముద్రణ :
ఆర్. కె. ప్రింటర్స్.
మాచిరాజువీధి_అమలాపురం-533 201
ప్రొ ! కాళ్ళకూరి రామం
ఫోన్ : 21419

## ముకుళిత హస్తాలతో....

సాహిత్య కార్యక్రమాలతో, పుస్తక ప్రచురణలతో, పత్రికల నిర్వహణతో సాహితీ చైతన్యం కలిగించిన సాహిత్య సంస్థలు రాష్ట్రంలో ఎన్నోఉన్నాయి ముందుగా రాష్ట్రంలోగల సాహిత్య సంస్థలపై పరిశోధన చేయదలిచాను కానీ అది నా ఒక్కడివల్ల కాదని గ్రహించాను. రాష్ట్ర సంస్థల్నిగురించి క్లుప్తంగా వివరిస్తూ తూర్పు, పశ్చిమగోదావరిజిల్లాలలోగల సాహిత్య సంస్థల్ని ప్రత్యేకంగా పరిశోధించాను. నాశక్తి మేరకు ఈ పరిశోధన సమగ్రంగా ఉండాలనే ప్రయత్నించాను. అయితే కొందరి సహకారం ఆశించినంత మేరకు లభించలేదు.

నన్ను నిత్యం వెన్నుతట్టి - ఆశీర్వదించే ప్రథమ గురువులు ఆచార్య తూమాటి దొణప్పగారికి —

నాకు పర్యవేక్షకులుగా ఉండి నాకు విలువైన సూచనలిచ్చి - మార్గ సూచనంచేసిన సాహితీమూర్తి, సహృదయ సార్వభౌములు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారికి —

హెచ్చరిస్తూ — బుజ్జగిస్తూ - ఆదుకుంటూ నన్ను తొందరపెట్టిన ఆప్తులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి —

నాకు విమర్శపై అభిమానం కలగజేసిన మంచిమేష్టారు "చేరా" గారికి—

కృతజ్ఞతా పూర్వక వందనాలు...

"ఇంకా సిద్ధాంతవ్యాసం సమర్పించలేదా'' అంటూ ప్రోత్సహించిన జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత ఆచార్య సినారె గారికి ధన్యవాదాలు !

నా సిద్ధాంత వ్యాసానికి పరీక్షకులుగా ఉండి డాక్టరేట్ డిగ్రీకి అనుమతినిచ్చిన సాహితీవేత్తలు ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారికి, ఆచార్య కె. మలయవాసినిగారికి నా నమస్సులు.

నా పరిశోధనకి అన్నివిధాలా సహకరించిన శ్రీ కోనసీమ భానోజీరామర్సు కళాశాల, అమలాపురం యాజమాన్యానికి, ప్రిన్సిపాల్‌గార్కి - ముఖ్యంగా తెలుగు శాఖలోని సహాధ్యాపకులకీ, ఆర్థికసహాయం అందించిన యు.జి.సి. వారికీ, గౌతమీ గ్రంథాలయం, ఆంధ్రవిశ్వవిద్యాలయం, గ్రంథాలయం శ్రీరామ పుస్తక భాండాగారం (రాజమండ్రి), జిల్లాకేంద్రగ్రంథాలయం (గుంటూరు), 'సమాచారం' పత్రికాకార్యాలయం (రాజమండ్రి) - అధికారులకి - శ్రీయుతులు మేడపాటి సీతారామిరెడ్డి (రాజమండి), వై. ఎస్. నరసింహారావు, కప్పగంతుల, పోతుకూచి, రసరాజు, మధునాపంతుల, సుశర్మ, చుక్కన గంగరాజు, రాజగోపాలాచార్యులు, కీ॥శే॥ డి. రామలింగం, శంకర శ్రీరామారావు, సామవేదం జానకిరామశర్మ, పుల్లాభొట్ల శ్రీరామమూర్తి, సన్నిధానం, కాశీభొట్ల సత్యనారాయణ, ఆకుండి సత్యనారాయణ శాస్త్రి, చక్కా సత్యనారాయణ, డా॥ ఆలూరి రాజకుమారి, జి. పి. ఎమ్. రెడ్డి మొదలైన సహృదయులందరికీ - కృతజ్ఞతలు !

తెలుగు విశ్వవిద్యాలయంలో మొట్టమొదటి సిద్ధాంత వ్యాసమైన ఈ గ్రంథ ప్రచురణకి ఆర్థిక సహాయంచేసిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథంగార్కి ప్రత్యేక ధన్యవాదాలు.

అనేకానేక కష్టనష్టాలకు ఓర్చి నామీదగల అభిమానంతో ఈ గ్రంథాన్ని ప్రచురించిన ఆర్. కె. ప్రింటర్స్ అధినేత - కొళ్ళకూరి రామంగార్కి నేనునిజంగా ఋణపడి ఉన్నాను.



అంకితం —

వదాన్యులు

సహృదయులు

శ్రీ మేడపాటి సీతారామరెడ్డిగారికి

(రాజమండ్రి)

# విషయ సూచిక

## మూడవ అధ్యాయం

*నాల్గవ* **అధ్యాయం:**

**ఆయిదవ అధ్యాయం:**

# మొదటి అధ్యాయం

## ఆ ము ఖ ం

"నిరాశ్రయా నశోభన్తే పండితా వనితా లతాః" అని ఆర్యోక్తి. రాజుల, సంస్థానాధీశ్వరుల ఆలంబనంతోనే సాహితీవృక్షం శాఖోపశాఖలుగా విస్తరించింది. పండితోత్తముల్ని పోషించని రాజులు రత్నాలు కనలేని జాత్యంధుల వంటివారని భర్తృహరి చెప్పనేచెప్పేడు. రాజులకీ సాహిత్య పోషణకీ అవినాభావ సంబంధం ఉన్నదని వివరించే ఈ క్రింది శ్లోకం సుపరిచితమే _

"మణినా వలయం వలయేన మణి
ర్మణినావలయేన విభాతి కరః
కవినాచ విభుర్విభునాచకవిః
కవినా విభునా ప్రతిభాతి సభా"

సమితి. సంస్థ, పరిషత్, సంసత్, సభా, సమాజం — ఇవి సమానార్థకాలు. "తెలుగు దేశంలో తెలుగు భాషతోనే సాహిత్య పరిషత్తులు పుట్టాయి ఆ సాహిత్య పరిషత్తులతోనే తెలుగు సారస్వతంపుట్టింది."♦ అన్న డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యగారి మాటలలో నిజంలేకపోలేదు. నన్నపార్యుడు రాజరాజనరేంద్రుడ్ని "రాజమహేంద్ర కవీంద్రసమాజసురక్ష్మాజ" అని సంబోధించడం గమనార్హం. జగద్ధితమైన, పంచమవేదమైన ఆంధ్ర మహాభారతాన్ని నన్నయమహాకవి —

"పరమవివేక సౌరభవిభాసిత సద్గుణ పుంజ వారిజో
త్కర రుచిరంబులై సకలగమ్య సుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్"

రచించినట్టు విదితమే. అప్పటినుంచి — అంటే చాళుక్య నృపాలురనుంచి— తెలుగుభాషకు సాహిత్య మర్యాద కల్పించబడి కవీంద్రసమాజాలు ఏర్పడటానికి అవకాశం ఏర్పడినట్లు తెలుస్తుంది. శ్రీకృష్ణదేవరాయలవారి "భువన విజయము", రఘునాథనాయకుని 'విజయభువనము'లు సాహితీ సభలుగా ప్రసిద్ధములే! మహారాజులు అంతరించిన తర్వాత సంస్థానాధీశ్వరులు వచ్చారు.

"సంస్కృతాంధ్ర భాషాకవులను పోషించుటయేకాక విద్యావ్యసనులును, వితరణగుణవిలసనులునగు నీ సంస్థానాధీశ్వరులు వేదశాస్త్ర పండితులను సంగీతాదేతర లలితకళా నిపుణులను సమ్మానించి జాతికి జీవగఱ్ఱలైన శాస్త్రాభ్యుదయమునకు, కళావిజ్ఞాన వికాసములకును దోహదమొనర్చిరి"♦♦ అని ఆచార్య దోణప్పగారు సిద్ధాంతీకరించారు. సంస్థానాధీశ్వరులు జమీందారులు అంతరించిన తర్వాత "సాహిత్య సంస్థలు" ఆవిర్భ

♦("అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు" వ్యాసం) కిన్నెర—నవంబరు 1953

♦♦"ఆంధ్ర సంస్థానములు — సాహిత్యపోషణము" (1987) — పుట 14

వించాయి. జమీందారుల సహకారంతో నిర్వహింపబడిన సంస్థలకన్న స్వతంత్రప్రతిపత్తితో వదాన్యుల సహకారంలో నిర్వహింపబడిన సాహిత్య సంస్థలే ఎక్కువ.

"ధనముండుట పరిపాటియె
ధనమే సర్వంబుగాదు ధనముండియు స
ద్వినియోగబుద్ధిఁ గలిగిన
మనుజుని భాగ్యంబె లోకమాన్యతఁ గాంచున్"

అనే 'కవికోకిల' దువ్వూరి రామిరెడ్డిగారి అభిప్రాయాన్ని పాటించిన వదాన్యులు ఈ సాహిత్య సంస్థలకు మూలస్తంభాలు ప్రజాస్వామ్య యుగంలో కవుల, రచయితల బాధ్యతలు పెరిగాయి. వైతాళిక పాత్రకు నిర్వహించవలసి వచ్చింది. ప్రభుత్వ యంత్రాగాన్ని నిర్దేశించే ప్రజలే సాహిత్యానికి పోషకులయ్యారు. ప్రభుత్వంకూడా అంతో ఇంతో చేయూత ఇవ్వకపోవటంలేదు. తెలుగు సాహిత్యసంస్థలను వివరించేముందు ఇతర భాషాసాహిత్యాలలో సాహిత్యసంస్థల తీరుతెన్నుల్ని రేఖామాత్రంగా వివరించే ప్రయత్నం చేస్తాను.

## ఇతర భాషా సాహిత్యాలలో సాహితీ సంస్థలు :

పాశ్చాత్యదేశాలలో "సొసైటీ", "అకాడమి" వంటి పేరతో మేధావుల, శాస్త్రవేత్తల సంస్థలున్నాయి. సాహిత్య సంస్థలకు కూడా 'సొసైటీ', 'అకాడమి' పేర్లు లేకపోలేదు. విదేశాలలో ఇంగ్లాండులోనే సాహిత్య సంస్థలకు ప్రముఖ స్థానం ఉన్నట్టు తెలుస్తుంది. సుమారు 17వ శతాబ్దినుంచే ఇగ్లాండులో సాహిత్య సంస్థలు కనిపిస్తాయి.♦ కవుల, రచయితల పేర్లు మీదుగా "Shakespearean Authorship Trust", "The Shaw Society", "Keats-Shelley Memcrial Assciation" వంటివే

---

♦ ది బ్రిటిష్ లైబ్రరీస్, హైదరాబాదువారు అందించిన సమాచారం ఆధారంగా

కాకుండా వివిధరకాల రచయితల పేర్లు మీదకూడా సంస్థలు నెలకొల్ప బడటం విశేషం. ఉదాహరణకు — "Crime writers Association", "Medical writers group", "The Critics Circle" మొదలైనవి.

ప్రపంచవ్యాప్తంగా ప్రసిద్ధిపొందిన "పెన్" (P.E.N. International — P stands for Poets. Play writers, E - Editors, Essayists, N-Novelists) సాహిత్య సంస్థ 1921 లో లండన్‌లో స్థాపించబడింది. 1983 లో "Blind Authors Association" స్థాపించబడటం గమనార్హం

హిందీ సాహిత్యంలో 18 వ శతాబ్ది మొదటి దశాబ్ది నుంచి సాహిత్య సంస్థలున్నట్టు చెప్పవచ్చు. ప్రముఖ నాటకరచయిత భారతేందు పేరున 1850-90 కాలాన్ని భారతేందుయుగంగా పరిగణిస్తారు. ఈయన 'భారతేందుమండలి' అనే సంస్థను స్థాపించి సంస్కృతం నుంచి అనువాదం చేసే రచనలకి ప్రాధాన్యం ఇచ్చారు. 1897 లో కాశీలో స్థాపించబడిన "సంస్కృతలిపి నాగరీ ప్రచారిణీసభ" హిందీలో విమర్శనా ప్రక్రియకు శ్రీకారం చుట్టింది. మహావీర్ ప్రసాద్ ద్వివేదికూడా 1903 లో "ద్వివేదిమండలి"ని స్థాపించి 1925 వరకు నిర్వహించారు. 1918 లో మహాత్మాగాంధీ మద్రాసులో తనకుమారుడైన దేవదాస్ గాంధీతో 'దక్షిణ భారత హిందీ ప్రచారసభ' స్థాపించారు. ఇది నేటికీ హిందీభాషాసాహిత్య ప్రచారానికి కృషి చేస్తోంది. ఈ ప్రచారసభ శాఖలు వివిధ రాష్ట్రాలలో నెలకొల్పబడ్డాయి. అలహాబాద్‌లోని "హిందీ సాహిత్య సమ్మేళన్", పాట్నాలోని "బిహార్ రాష్ట్ర భాషాపరిషత్", నాగపూరులోని "విదర్భ హిందీ సాహిత్య సమ్మేళన్", కేంద్రప్రభుత్వ ఆధ్వర్యంలో నిర్వహింప బడుతున్న "కేంద్రీయ హిందీ నిదేశాలయం" వంటి సంస్థలు హిందీభాషా సాహిత్యాల అభివృద్ధికి కృషి చేస్తున్నాయి.♦

♦హిందీ అధ్యాపకులు శ్రీ డి. వి. రామకృష్ణగారు (తణుకు) అందజేసిన సమాచారం ఆధారంగా

తెలుగుకు సోదరభాషయైన తమిళ సాహిత్యంలో సాహితీ సంస్థల చరిత్ర ప్రసిద్ధమైనది–ప్రాచీనమైనది♦. తమిళ సారస్వతానికి శ్రీకారం చుట్టిన సంగయుగంలోనే మూడు సంగాలు–తలైచ్చంగం, ఇడైచ్చంగం, కడైచ్చంగం వెలిశాయి. ఈ సంగకవుల ఆమోదముద్ర పొందినకావ్యాలే ప్రచారానికి నోచుకొనేవి. తొలిసంగంలో 549 మంది కవులు, మధ్య సంగంలో 59 మంది పండిత కవులు, కడ సంగంలో 49 మంది కవులు (నక్కీరుడు మొ॥) ఉండేవారట! జైనుల "అరుంగలాన్వయ సంఘం" క్రీ.శ. 10–11 శతాబ్దుల మధ్యకాలం నాటిది. సుమారు 150 సంవత్సరాల క్రితం పాండిత్తురై తేవర్ అనే జమీందారులు మధురలో స్థాపించిన "తమిళసంగం" నేటికీ పనిచేస్తోంది. శైవ, వీరశైవ, వైష్ణవమత సాహిత్యాల వ్యాప్తికి ప్రత్యేక సంస్థలున్నాయి. కంబరామాయణ ప్రాశస్త్యాన్ని ప్రచారం చెయ్యడానికి ప్రత్యేకంగా "కంబన్ కళగాలు" ఏర్పడ్డాయి. తమిళ భాషాభివృద్ధి పరమలక్ష్యంగా తిరుచిరాపల్లిలో "తమిళ్ పులవర్ కుళు" అనే సంస్థ నిర్వహింపబడుతోంది. ఆధునిక సాహిత్య ప్రచారానికి, మార్క్సిస్టు తత్త్వ ప్రచారానికి "కలైయిలక్కియ పెరుమండ్రం" వంటి సంస్థలు కూడా ఉన్నాయి. క్రైస్తవ తమిళ్ యిాలక్రియ సంగం, ఇస్లామియతమిళ్ యిాలక్రియ సంగం" వంటి సంస్థలుకూడా పనిచేస్తున్నాయి. తమిళ సాహిత్య సంస్థలను తమిళుల మాతృభాషాభిమానానికి సజీవ నిదర్శనాలుగా పేర్కొనవచ్చు.

## తెలుగులో సాహిత్యసంస్థలు :

తెలుగులో 1874–75 ప్రాంతంనుంచి సాహిత్యసంస్థలు ఉన్నట్టు తెలుస్తోంది. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు గొప్ప పండితులు, గ్రాంధికవాదులు. ఆయన "కృతివిమర్శినీ సమాజం" అనే పేరుతో తానే

♦ ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మగారు (మధురై) అందజేసిన సమాచారం ఆధారంగా.

ఒక సంస్థగా కందుకూరివారి గ్రంథాలను నిరసించేవారు. కందుకూరివారు కూడా "గుణాగుణప్రదర్శినీ సమాజము" పేరుతో ఎదురుదాడి చేసేవారు♦. 1872–1900 మధ్యగల ఈ సమాజాలు సాహిత్యసంస్థలుగా ప్రత్యేకతను సంతరించుకోలేకపోయాయి. అవి వ్యక్తిగతమైన సంస్థలుగా భావించవలసి వుంది. తెలుగులో మొట్టమొదటి సాహిత్యసంస్థగా "ఆంధ్ర భాషాభిరంజనీ సంఘం" ను చెప్పవచ్చు. ఇది 1886 లో స్థాపించబడింది. 'కవిగారు'గా పేరుపొందిన మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు విశాఖపట్టణంలో 1895-96 లో స్థాపించిన "శ్రీకలాభిలాషక సమాజము" ద్వితీయస్థానాన్ని సంపాదించుకుంటుంది. బరంపురంలో 1909 లో ప్రారంభించబడిన ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజంకూడా ప్రముఖమైన సాహితీసంస్థ. తర్వాత పేర్కొనదగిన ప్రసిద్ధమైన – సమగ్రమైన సాహిత్యసంస్థ – 1911 నాటి ఆంధ్ర సాహిత్య పరిషత్తు.

ఆనాటినుంచి నేటివరకు తెలుగులో కొన్నివందల సాహిత్యసంస్థలున్నాయి. నా పరిశీలనమేరకు–మూలబడినవి – పనిచేస్తున్నవి అన్నీకలిపి సుమారు మూడువందల సంస్థలున్నట్టు తెలుస్తోంది. తెలుగు సాహిత్య సంస్థలు రాష్ట్రంలోనే కాకుండా ఇతరరాష్ట్రాలలోనే కాకుండా విదేశాలలో కూడా ఉన్నాయి. లలితకళా సంస్థలుగా, సాంస్కృతిక సంస్థలుగా నిర్వహింపబడుతున్న సంస్థలు, విశ్వవిద్యాలయాలలో, కళాశాలల్లో విద్యార్థులచే నిర్వహింపబడుతున్న కళాసమితులు, సాంస్కృతిక సంఘాలు కూడా సాహితీసేవ చేస్తుండటం గమనించదగినది.

♦ డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) గారి ద్వారాలభించిన సమాచారం.

తెలుగులో సాహిత్యసంస్థలను ప్రధానంగా ఈ క్రిందివిధంగా వర్గీకరించవచ్చు :

1. ఉద్యమాలు నేపథ్యంగా ఏర్పడిన సంస్థలు
   ఉదా : ఆంధ్రసాహిత్యపరిషత్, నవ్యసాహిత్య పరిషత్, అభ్యుదయ రచయితల సంఘం మొ॥

2 కవులపేర్లతో ఏర్పడిన సంస్థలు
   ఉదా : నన్నయ భట్టారకపీఠం, శ్రీనాథపీఠం, రామరాజభూషణ సాహిత్య పరిషత్ మొ॥

3. ప్రాంతీయ సంస్థలు
   ఉదా : తెలంగాణా రచయితల సంఘం, విశాఖ రచయితల సంఘం, కడపజిల్లా రచయితల సంఘం మొ॥

4. ప్రక్రియాపరంగా ఏర్పడిన సంస్థలు
   ఉదా : ఫ్రీవర్స్ ఫ్రంట్, ప్రజానాట్యమండలి మొ॥

5. బాలసాహిత్యంకోసం ఏర్పడిన సంస్థలు
   ఉదా : బాలల అకాడమీ, ఆంధ్రబాలానంద సంఘం మొ॥

6. ప్రభుత్వ సహకారంతో ఏర్పడిన సంస్థలు
   ఉదా : సాహిత్య అకాడమి, తెలుగు భాషాసమితి మొ॥

7. ఏకవ్యక్తి నిష్ఠములైన సంస్థలు
   ఉదా : కళాకేళి (సోమసుందర్), కలాభివర్ధనీ పరిషత్ (శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి)

8. ప్రవాసాంధ్రుల సంస్థలు
   ఉదా : ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం (బరంపురం)
   ఆంధ్రవిజ్ఞాన సమితి (జెంషెడ్‌పూర్)

ఇవికాకుండా - సాహిత్యేతర వ్యక్తులు మరణించినప్పుడు వారి సంస్మరణార్థం స్థాపించబడిన సంస్థలూ ఉన్నాయి. ఈరకమైన సంస్థలలో "నరేంద్రనాథ్ సాహిత్యమండలి (తణుకు) ప్రసిద్ధమైనది. మహిళలు నిర్వహిస్తున్న సాహిత్య సంస్థలు రెండుమూడు కంటె మించి లేవు - ఉదాహరణగా శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి నిర్వహిస్తున్న "విద్యాధర ప్రభాస"ను పేర్కొనవచ్చు. జానపద సాహిత్య ప్రచారంకోసం, శైవమత ప్రచారంకోసం ఒకటో రెండో సంస్థలు లేకపోలేదు.

సాహిత్య సంస్థలకు సామాన్యంగా పేర్లుంటాయి. పేర్లులేని సాహిత్యసంస్థలూ లేకపోలేదు. ప్రత్యేకమైన పేరు లేకుండా "సాహితీ మిత్రులు", "స్టడీ సర్కిల్" వంటి సంస్థలున్నాయి. కార్యవర్గంలేకుండా, నియమాలూ ప్రణాళికలూ లేకుండా ఇంగ్లాండులో "డిబేటింగ్ సొసైటీ"ల మాదిరిగా కొంతమంది కలిసి గోష్ఠులు, సభలు ఏర్పాటు చేసుకోవటం కూడా కద్దు. రాజమండ్రిలో శ్రీ ఆండ్ర శేషగిరిరావుగారు, మరికొంత మంది కలిసి నిర్వహించిన "సారస్వత సమాజం" ఇటువంటిదే.

సాహిత్య సంస్థల పేర్లను పరిశీలించినప్పుడు మరికొన్ని అంశాలను గమనించవచ్చు. కళాభారతి, సాహిత్య భారతి, ఆంధ్రభారతి అనేవిధంగా చివరలో ఒకేపదం ఉండే సంస్థలు ఎక్కువ. చాలా సంస్థలపేర్ల చివర సంఘం, పరిషత్, సమాఖ్య, మండలి, వేదిక, సమాజం అనేవి సామాన్యంగా ఉంటాయి. "గ్రంథమాల" పేరుతో గ్రంథాలయంతోపాటు సాహిత్య కార్యక్రమాలు నిర్వహించే సంస్థలున్నాయి. ఉదాహరణకు హైదరాబాద్ లోని "అణా గ్రంథమాల"ను, అనంతపురంలోని "శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల"ను పేర్కొనవచ్చు. సాహితీ పరిమళంగల సాహితీమేఖల, వాగర్థ సమాఖ్య, సాహిత్య నందిని, శరన్మండలి, సాహితీ నికుంజమువంటి సమాసాలతో ఏర్పడిన సాహిత్యసంస్థలున్నాయి. నిర్వాహకుల ఆశయాన్ని ప్రతిబింబించేలా "నవ్యసాహితీ సమితి", "విప్లవరచయితలసంఘం", "జాషువా సాహితీ సమితి" వంటి పేర్లు కూడా సంస్థలలో కనబడతాయి.

"నెలనెలావెన్నెల", "ఎంకిపాటల పండుగ" వంటి విశేషంగల పేర్లు, "హ్యూమర్ క్లబ్", "సెవెన్‌స్టార్స్ సిండికేట్", "మెదక్ స్టడీసర్కిల్"వంటి ఆంగ్లపదాలతో ఏర్పడిన పేర్లు కూడా సాహిత్య సంస్థలలో కనపడతాయి.

## సాహిత్య సంస్థ - పరిశోధనా పరిధి :

అనేకుల కూటమి - సంస్థ అని సామాన్యార్థం. సాహిత్య సంస్థ అన్నప్పుడు సాహిత్యప్రచారం చేసే సంస్థ అని చెప్పవచ్చు. తన కార్య క్రమాలద్వారా సమాజంలో సాహితీ చైతన్యాన్ని కలిగించే సంస్థ "సాహిత్యసంస్థ" అవుతుంది. "సాహిత్యసంస్థ"కు విస్తృతమైన అర్థం లేకపోలేదు. నాటకసమాజాలుకూడా నాటక సాహిత్యానికి సేవచేస్తున్నాయి. అయితే వాటి ప్రధాన కార్యక్రమం - నాటక ప్రదర్శన కాబట్టి సాహిత్య సంస్థగా నేను పరిగణించటంలేదు. రామకృష్ణ సేవాసమితి వంటి సంస్థలు కేవలం ఆధ్యాత్మిక సాహిత్యవ్యాప్తి కోసం కృషి చేస్తున్నాయి కాబట్టి - అటువంటి ఆధ్యాత్మిక సంస్థలను నా పరిశోధనకు గ్రహించడంలేదు. "దేశోద్ధారక గ్రంథమాల", "విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి" వంటి సంస్థలు ప్రధానంగా ప్రచురణ సంస్థలుకాబట్టి నా పరిశోధనకు స్వీకరించ డంలేదు. అదేవిధంగా సాహిత్య కార్యక్రమాలను అప్పుడప్పుడు నిర్వ హించే గౌతమీ గ్రంథాలయం, కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం మొదలైనవి గ్రంథాలయాలుగా తప్ప, సాహిత్య సంస్థలుగా పరిగణించ టంలేదు.

సాహిత్య కార్యక్రమాలకు మాత్రమే అంకితమైన సంస్థలను "సాహిత్యసంస్థలు"గా పరిగణిస్తున్నాను. అన్నిరకాల సాహిత్య ప్రక్రియ లపై సభలు, గోష్ఠులు నిర్వహించడం, రచయితలను, కవులను సత్కా రిస్తూ - ప్రోత్సహించడం. సాహితీపరమైన పోటీలు నిర్వహిస్తూండటం, రచనలు ప్రచురించటం, సాహిత్య పత్రికలను నడపటం - సమాజంలో సాహిత్యాభిలాషను రేకెత్తించడం - ఇవి సాహిత్య సంస్థల ప్రధాన లక్ష

ణాలుగా భావిస్తున్నాను. సామాన్యంగా అధ్యక్షుడు, కార్యదర్శి మొదలైన కార్యవర్గంగల సంస్థలనే సాహిత్యసంస్థలుగా పేర్కొనటం జరుగుతుంది. సంస్థలు "రిజిష్టర్" అయి ఉండాలనే నియమాన్ని పాటించడంలేదు. ఇటువంటి సాహిత్య సంస్థల గురించిన పరిశీలన ఈ సిద్ధాంతవ్యాసంలో కనిపిస్తుంది. చిన్నవి–పెద్దవి అనే తారతమ్యంలేకుండా, మరుగునపడిన సంస్థలను చిన్నచూపు చూడకుండా వివరించడమే నా ధ్యేయంగా విన్నవించుకుంటున్నాను.

రాష్ట్రవ్యాప్తంగాగల సాహిత్య సంస్థలపై పరిశోధన చేయటం కష్టసాధ్యంగా భావించాను. ఆ పరిశోధన అసమగ్రరూపుదాల్చే పరిస్థితికి దారితీస్తుందని పెద్దలు సలహాలిచ్చారు. ఆంశకాలిక పరిశోధకునిగా కొన్ని పరిమితులకు లోబడి – "ఉభయగోదావరి జిల్లాలలోని సాహిత్య సంస్థలపై పరిశోధనకు నిర్ణయించుకున్నాను. తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాలలో తెలుగుభాషా సాహిత్యాలకు సేవచేసిన – సేవచేస్తున్న సాహిత్య సంస్థల చరిత్రను, వాటి తీరుతెన్నులను నిష్కర్షగా – నా పరిజ్ఞానం మేరకు–నా శక్తి మేరకు–వివరించే ప్రయత్నమే ఈ సిద్ధాంతవ్యాసం.

## సాహిత్యసంస్థల ప్రయోజనాలు :

సత్కావ్యనిషేవణం చతుర్విధ పురుషార్థాలకు మూలమనే భావన అనాదిగా వుంది. "కావ్యం యశసేఽర్థకృతే" అనే శ్లోకంలోని సాహిత్య ప్రయోజనాలు సాహితీవేత్తలకు సుపరిచితాలే. ప్రాచ్య పాశ్చాత్యలాక్షణికులు ఆనందోపదేశాలను సాహిత్యానికి ప్రధాన ప్రయోజనాలని సిద్ధాంతీకరించిన విషయంకూడా మనకు తెలిసిందే. సాహిత్యరచన, సాహిత్యపఠనం సాహిత్య ప్రవచనం మోక్షమార్గాలనికూడా కొందరి విశ్వాసం. కాబట్టి అటువంటి సత్సాహిత్యాన్ని సృష్టింపజేయటం, సాహిత్యానికి వ్యాప్తిని కలిగించటం, సాహిత్య పఠనంపై ఆసక్తిని కలిగించడం ఒక పవిత్ర కార్యంగా భావించడం జరుగుతోంది. ఆ భావనతోనే కొందరు సాహిత్య సంస్థలను స్థాపిస్తే, మరికొందరు పోషించారు.

"ప్రయోజన మనుద్దిశ్యనమందోఽపి ప్రవర్తతే" అనే ఆర్యోక్తి సుపరిచితమే. బహుప్రయోజనాలు చేకూరటానికి సాహితీవేత్తలు, విద్యావంతులు, వివేకవంతులు స్థాపించిన సంస్థలివి. ఒకరు చేయలేని పనిని నలుగురు కలిస్తే చేయగలరు. ఒకరి ఆలోచనకన్న నలుగురు కలిసిచేసిన ఆలోచనమిన్నగా వుంటుంది సహేతుకంగా సముచితంగా వుంటుంది. పదిమందితో ఆలోచన చేసినప్పుడు పురోగమనం సాధ్యమవుతుంది. అప్పుడే చైతన్యం మొలకెత్తుతుంది. భావాల వినిమయంలో మనిషి మనీషి అవుతాడు. కలియుగంలో ఏపనికైనా పదిమంది కూడిరావాలి – సంఘేశక్తిః కలౌయుగే – అనేనానుడి అందుకే ఏర్పడింది. అందుకు సాహిత్యసంస్థల అవసరంభాలావుంది.

యువకులను లోకజ్ఞానం లేనివారిగా, అనుభవ శూన్యులుగా – చులకన భావంతోచూసే అలవాటు మనలోవుంది. యువకుల్ని ఆవిధంగా చిన్నచూపుతో చూసేపద్ధతికి సాహిత్యసంస్థలు స్వస్తివాక్యం పలుకుతాయి. యువకులు కూపస్థమండూకాలు కాదని – వారూ ప్రతిభావంతులేననీ సాహిత్యసంస్థలు లోకానికి చాటిచెప్తాయి. "అల్పానామపి వస్తూనాం సంహతిః కార్యసాధకా" అని నిరూపించేవి సాహిత్యసంస్థలే. లోకంలో ఎవ్వరూ సర్వజ్ఞులుకారు. "నహి సర్వవిదః సర్వే"! ఇతరుల అభిప్రాయాలను తెలుసుకొని మననం చేయటం, తన అభిప్రాయాలను ఇతరులకు తెలపటం బుద్ధిజీవుల సహజగుణం. ఆ గుణం సాధుసమాగమంవల్ల సిద్ధిస్తుంది. అటువంటి సాధుసమాగమానికి సాహిత్యసంస్థలు బాటలువేస్తాయి. రచనలపై, పద్యపఠనాలపై పోటీలు నిర్వహించి "స్పర్ధయావర్ధతేవిద్యా" అని నిరూపిస్తూ ప్రతిభగల రచయితలను వెలుగులోకి తెచ్చేవి కూడా సాహిత్య సంస్థలే.

జీవితయాత్రలో సగభాగం నిద్రలో గడిచిపోతుంది. మిగిలిన భాగంలో ఎక్కువకాలం కలహాలకు వ్యసనాలకు వినియోగింపబడుతుంది. మిగిలిన ఆ స్వల్పకాలాన్నయినా సద్వినియోగపరచుకోవటం మానవుని పరమావధి కావాలి. నిత్యసమస్యలతోకూడుకొన్న మానవుడ్ని 'చింత'

కృంగదీస్తుంది. మానసిక అశాంతి నిరాశానిస్పృహలకు దారితీస్తుంది. జీవితం నరకప్రాయమవుతుంది. మానవుని మానసిక రుగ్మతలనుపోగొట్టి వెన్నుతట్టిలేపి - మానసిక వికాసాన్ని కలిగించే - భవిష్యత్తుపై ఆశ కలిగించే సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తున్న సాహిత్య సంస్థలు ఎంతటి ప్రయోజనకరమైనవి!

సమాజ పరిస్థితులు పరిణామం చెందుతూంటాయి. వివిధ సిద్ధాంతాలు, ఉద్యమాలు తలెత్తుతాయి. మారుతున్న సమాజంతోపాటు మానవుని జీవిత విధానాలు కూడా మారుతుంటాయి. "జీవితమథనంలోనుంచి పుట్టిన ఆత్మ వేదనామృతమే కళ" అన్నట్టుగా సాహిత్యకళపై గల విభిన్న ఆశయాలను, సిద్ధాంతాలను, సూచనలను ప్రచారంచేసే సంస్థలున్నాయి. ఏసంస్థఅయినా సాహిత్యాన్ని సమాజపరం చేయటానికే కృషి చేస్తుంది. ప్రయోజనం అదే – మార్గాలు వేరుకావచ్చు. సంకుచిత తత్వాన్ని పారద్రోలి జ్ఞాన గవాక్షాన్ని తెరచి అన్ని భావాల పవనాలను ఆహ్వానించే సదవకాశాన్ని సాహిత్యసంస్థలు కల్పిస్తాయి.

ఎంత విద్వాంసుడైనా, ఎంతటీ సాహితీవేత్త అయినా "సభాపిరికితనం' (స్టేజిఫియర్) ఉండటం కద్దు. సాహిత్య సంస్థల కార్యక్రమాలలో పాల్గొనడంద్వారా – ఉన్యాసకునిగాగానీ, నిర్వాహకునిగాగానీ – మనసులో కలిగే ఆ 'బెరుకుతనం' (పిరికితనం) పోతుంది. సభలలో మాట్లాడే అలవాటు కలిగించి వక్తలను తయారుచేసిన సాహిత్య సంస్థలు ఉన్నాయి. ప్రముఖుల ఉపన్యాసాలను వినడంవల్ల విభిన్నశైలీ విన్యాసాలను గమనించవచ్చు. వక్తృత్వలక్షణాన్ని అలవరచుకొనే అవకాశం లేదా పెంపొందించుకొనే అవకాశం చేకూరుతుంది. సాహిత్యసంస్థలతో అనుబంధం ఏర్పడినప్పుడు, కార్యక్రమాలలో పాలుపంచుకొన్నప్పుడు లోకజ్ఞత అలవడుతుంది. ఆత్మపరిశీలనాశక్తి అలవడుతుంది. సంస్కారం అబ్బుతుంది. తన లోపాలు తెలుసుకోవటం, ఇతరుల లోపాలను గ్రహించి

వాటికి దూరంగా ఉండటం _ అనే గుణాలు అలవడతాయి. విభిన్న రచనా ప్రక్రియలను - వివిధ గ్రంథాలను చదివే ఓపిక, తీరిక లేకపోయినా సాహిత్య సంస్థల కార్యక్రమాలద్వారా బహుముఖీనమైన సాహిత్య స్వరూపాన్ని కొంతైనా దర్శించవచ్చు.

సాహిత్యసంస్థలు నిర్వహించే సభలవల్ల, గోష్ఠులవల్ల సాహిత్య స్వరూపాన్ని గమనించే వీలు ఏర్పడుతుంది. సాహితీగమనాన్ని అంచనా వేయవచ్చు. మార్పుల్ని పరిశీలించి రచయిత లేదా కవి మరింత విజ్ఞానవంతుడు కావచ్చు. ప్రాచీన నవీన సాహిత్యాలను అవకళింపు చేసుకొని భవిష్యత్తుకు బాటవేసుకొనే వీలు సాహిత్య సంస్థలవల్ల ఏర్పడుతుంది. సభలలో పాల్గొనే విద్వాంసుల శక్తియుక్తులను తెలుసుకోవచ్చు. కొందరు వ్రాయలేరు. చక్కగా ఉపన్యసిస్తారు. కాబట్టి సాహిత్య కార్యక్రమాల ద్వారా మంచి వక్తల మహోపన్యాసాలు వినే అదృష్టం లభిస్తుంది. వక్తలలో కూడా ప్రేక్షకులనుబట్టి, ఆయాసంస్థల స్పందననుబట్టి ఆత్మపరిశీలన చేసుకొనే అవకాశం కలుగుతుంది. సాహిత్య కార్యక్రమాలలో పాల్గొనే వారు నిర్వాహకులైనా, అధికారులైనా, సంపన్నులైనా, పండితులైనా - వయోవృద్ధులైనా _ యువకులైనా _ తరతమ భేదం లేకుండా "అంతా ఒక్కటే" అనే సమిష్టి భావనతో ఉండటం కంటె పరమ ప్రయోజనం వేరొకటి ఏముంటుంది?

సాహిత్యసృష్టి ఒకఎత్తు. సాహిత్య ప్రచారం మరొకఎత్తు. ఇవి ఒకే నాణానికిగల బొమ్మ బొరుసుల వంటివి. సాహిత్య సృష్టికి ప్రచారం ఉన్నప్పుడే ప్రయోజనం చేకూరుతుంది. సాహిత్య సంస్థలవల్ల సాహిత్య ప్రచారం జరుగుతుంది. ఇందుకు ఆవిష్కరణలూ, అంకితాలూ, సన్మానాలూ దోహదం చేస్తాయి. కొన్ని సంస్థలు తాము నిర్వహించే పత్రికలవల్ల, ప్రచురించే గ్రంథాలవల్ల సాహిత్యవ్యాప్తికి, సాహితీ చైతన్యానికి కృషి చేస్తాయి. సాహిత్య సంస్థల ప్రధాన ప్రయోజనం ఒక్కటే. అది_

"సర్వే భద్రాణి పశ్యంతు
మాకశ్చి ద్దుఃఖ భాగ్భవేత్"

# సాహిత్య సంస్థల సూక్ష్మ వర్గీకరణ

సాహిత్య సంస్థలు

- (1) ప్రాంతాన్నిబట్టి
  - పట్టణ రచయితలసంఘాలు
  - తాలూకా రచయితల సంఘాలు
  - జిల్లా రచయితలసంఘాలు
  - ప్రవాసాంధ్ర సంఘాలు
- (2) నిర్వాహకులనుబట్టి
  - ప్రభుత్వ సంస్థలు
  - వ్యక్తిగతసంస్థలు
  - సమిష్టి సంస్థలు
  - మహిళలసంస్థలు
- (3) ప్రక్రియలనుబట్టి
  - సంప్రదాయసాహిత్యసంస్థలు
  - ఆధునిక సాహిత్యసంస్థలు
  - బాలసాహిత్యసంస్థలు
- (4) ఆశయాలనుబట్టి
  - అభ్యుదయసంస్థలు
  - విప్లవ సంస్థలు
  - జాతీయసాహిత్యసంస్థలు
- (5) వ్యక్తులనుబట్టి
  - కవుల పేర్లతోసంస్థలు
  - స్మృత్యర్థం ఏర్పడినసంస్థ

# రెండవ అధ్యాయం

## రాష్ట్రంలోని ప్రసిద్ధ సాహిత్య సంస్థలు

రాష్ట్రవ్యాప్తంగాగల కొన్ని వందల సాహిత్య సంస్థలలో చారిత్రకంగా, ఉద్యమపరంగా, ప్రక్రియాపరంగా ప్రాధాన్యంగల సంస్థలు ఇరవై వరకు ఉన్నాయి. అవి :

1. ఆంధ్ర సాహిత్య పరిషత్, కాకినాడ
2. ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం, బరంపురం
3. చెన్నపురి ఆంధ్రమహాసభ, మద్రాసు
4. సాహితీ సమితి, తెనాలి
5. వర్ధమాన సమాజం, నెల్లూరు
6. నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు
7. ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు
8. కవితా సమితి, విశాఖపట్నం
9. శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల, హిందుపురం
10. ఆంధ్ర బాలానంద సంఘం, హైదరాబాదు
11. అభ్యుదయ రచయితల సంఘం, హైదరాబాదు
12. తెలంగాణా రచయితల సంఘం
13. తెలుగు భాషాసమితి, హైదరాబాదు
14. ఫ్రీవర్స్ ఫ్రంట్, హైదరాబాదు
15. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు
16. విశాఖ రచయితల సంఘం, విశాఖపట్నము
17. విప్లవ రచయితల సంఘం
18. యువభారతి, హైదరాబాదు
19. జాతీయ సాహిత్య పరిషత్
20. శ్రీనాథ పీఠం, గుంటూరు

ఈ ఇరవై సంస్థల గురించి సంక్షిప్తంగా వివరించే ప్రయత్నం చేస్తాను –

## 1. ఆంధ్ర సాహిత్యపరిషత్ :

1911 లో ప్రారంభించబడిన ఆంధ్ర సాహిత్య పరిషత్ గురించి "తూర్పుగోదావరిజిల్లాలో సాహిత్య సంస్థలు" అనే అధ్యాయంలో వివరంగా చర్చించబడుతుంది.

## 2. ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం :♦

ప్రవాసాంధ్ర సంస్థలకు తలమానికమై, తెలుగు సాహితీ సంస్కృతులకు కాణాచియై, పదునారేండ్ల పసిడిజవ్వనిలా నిత్యకల్యాణియై, రసవత్తర గోష్ఠి సదస్సులతో సాహితీసేవ చేస్తున్న ప్రాచీనసంస్థ – ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం.

మాతృభాషాభిమానం, సంఘసేవానిరతి, అభ్యుదయ వాంఛల ప్రాతిపదికగా "బ్రహ్మపురం" అనే నామాంతరంగల బరంపురంలో (ఒరిస్సా) 1909 జనవరి 1 న ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం స్థాపించబడింది. ఆదిభట్ల తరణయ్యసిద్ధాంతి, ఆదిభట్ల వెంకన్న, కోరుకొండ జగజ్జనరావు, బచ్చు జగన్నాధదాసు, ఊటుకూరి గోపాలరావు, పూడిపెద్ది సూర్యనారాయణ మొదలైన త్యాగధనుల సహకారంతో స్థాపించబడిన ఈ సంస్థ కార్యకర్తలలో భోగరాజు నారాయణమూర్తి, తాపీ ధర్మారావు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి వంటి ప్రముఖులుండటం గమనార్హం. తిరుపతి వెంకటకవులు, గురజాడ, కందుకూరి, కట్టమంచి, పానుగంటి, గిడుగు వంటి సాహితీ వేత్తల ప్రశంసలు పొందిన ఈ సమాజం నేటికీ చైతన్యంతో పనిచేస్తోంది.

---

♦"ఆంధ్రభాషాభివర్ధనిసమాజం" అమృతోత్సవసంచిక (1984) ఆధారంగా

## 3. చెన్నపురి ఆంధ్రమహాసభ: ♦

1916 - ఏప్రిల్ 17న శ్రీ పిట్టి త్యాగరాజచెట్టి అధ్యక్షతన శ్రీయుతులు మునగాల రాజాగారు, కడప వేణుగోపాలనాయుడు, హోతా సూర్యనారాయణగారు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, ఉన్నవ లక్ష్మీ నారాయణ, బుర్రా శేషగిరిరావు, కోటంరాజు పున్నయ్య మొదలైన ఆంధ్ర ప్రముఖుల సహకారంతో "చెన్నపురి ఆంధ్రసభ" స్థాపించబడింది. 1929 లో ఆంధ్రనాటకసభ, చెన్నపురి ఆంధ్రసభలో లీనమవటంవల్ల "చెన్నపురి ఆంధ్రమహాసభ"గా పేరు మార్చబడింది. సామాజిక కళారంగాలతో పాటు సాహితీసేవకూడా చేసి మద్రాసులో ఆంధ్ర పతాకన ఎగురవేసిన సంస్థ ఇది. నీలంరాజు వెంకటశేషయ్య వేదం వెంకటాద్రియశాస్త్రి, కాశీ నాధుని నాగేశ్వరరావు పంతులుగార్లు సాహిత్యశాఖను చేపట్టారు. వ్యాస రచనలో, పద్యరచనలో పోటీలు నిర్వహించారు. శ్రీయుతులు విస్సా అప్పారావు, వేదాల తిరువెంగళాచార్యులు, కాటూరి, మల్లంపల్లి సోమ శేఖరశర్మ, పూతలపట్టు శ్రీరాములురెడ్డి, దీపాల పిచ్చయ్యశాస్త్రి, విశ్వనాధ సత్యనారాయణ, సి. నారాయణరెడ్డి వంటి హేమాహేమీలు చెన్నపురి ఆంధ్రమహాసభ కార్యక్రమాలలో పాల్గొని మద్రాసులోని ఆంధ్రులకు సాహిత్యంపై మక్కువ కలిగించారు. నేటికీ చైతన్యవంత మైన కార్యక్రమాలతో సజీవంగా వృద్ధిపొందుతున్న సంస్థ ఇది.

## 4. సాహితీ సమితి :

"బహుకాల పరిచయము, అన్యోన్యఆదరానురాగములు, మనస్సుల కలయిక, భారతీయ సంస్కృతీ సంప్రదాయ విద్యలపై లక్ష్యము, శాంత చిత్తముతో వినయముతో పనిచేయు స్వభావము, కళ, భాష, విద్యా శాస్త్రా దులలో దేనియందైన ప్రావీణ్యము, అమంగళకరములు, జుగుప్సాకర

♦'చెన్నపురి ఆంధ్రమహాసభ' 68వ వార్షికోత్సవ సంచిక ఆధారంగా (1984)

ము లైనవానిని పరిహరించి,ఉదాత్తములు, ఉల్లాసప్రదములు, విజ్ఞానదాయక ములైన కృషులు నెరవేర్పగలవారితో ఈసోదరవర్గము సాహితీసమితిగా వర్ధిల్లుతున్నది♦ అని తల్లావజ్ఝుల శివశంకరశాస్త్రిగారు సాహితీసమితిలోని సభ్యుల యోగ్యతలను వివరించారు. నవ్యసాహిత్యవ్యాప్తికి మూలస్తంభ మైన సాహితీ సమితి తెనాలిలో 1919 లో స్థాపించబడింది.

సాహితీసమితిలో మహాకవులున్నారు. కథానికా స్రష్టలున్నారు. నవలా రచయితలు, గేయ కావ్యకర్తలు ఉన్నారు. నాటక రచయితలు, నాటికారచయితలు, విమర్శకులు ఉన్నారు. లాక్షణికులున్నారు. చరిత్రలో పారంముట్టినవారున్నారు. ఉద్దండ పండితులైన పెద్దలతోపాటు ప్రజ్ఞా వంతులైన యువరచయితలు, కవులుకూడా సాహితీ సమితిలో సభ్యులే. ప్రతిభావంతమైన, వ్యుత్పన్నతా శక్తియుతమైన 'సాహితీ సమితి' కి సభా పతిగా తల్లావజ్ఝుల శివశంకరశాస్త్రిగారుండేవారు. కార్యవర్గసభ్యులలో, సాధారణసభ్యులలో ప్రసిద్ధులు చాలామంది ఉన్నారు. గిడుగు రామ మూర్తి పంతులుగారు సాహితీసమితికి గౌరవ సభ్యులుగా ఉన్నారు. సాహితీసమితితో అనుబంధం పెంచుకొన్నవారిలో కొందరు —

| | |
|---|---|
| దేవులపల్లి కృష్ణశాస్త్రి | వేదుల సత్యనారాయణశాస్త్రి |
| రాయప్రోలు సుబ్బారావు | కాటూరి వెంకటేశ్వరరావు |
| పుట్టపర్తి నారాయణాచార్యులు | నోరి నరసింహశాస్త్రి |
| పిలకా గణపతిశాస్త్రి | అడివి బాపిరాజు |
| చింతా దీక్షితులు | మల్లాది రామకృష్ణశాస్త్రి |
| జమ్మలమడక మాధవరామశర్మ | సంజీవదేవ్ |
| మునిమాణిక్యం నరసింహరావు | శ్రీనివాసశిరోమణి |
| కొమాండూరి కృష్ణమాచార్యులు | వావిలాల సోమయాజులు |
| నండూరి వెంకటసుబ్బారావు | మొక్కపాటి నరసింహశాస్త్రి |

♦ నవ్యాంధ్ర సాహిత్యవీధులు — ద్వితీయ భాగం — పుట 296

గ్రాంధిక భాషాపరిరక్షణకు, ప్రాచీనసంప్రదాయ సాహిత్యరక్షణకు కంకణం కట్టుకొన్న ఆంధ్రసాహిత్యపరిషత్‌కు వ్యతిరేకంగా వాడుకభాషా ప్రాచుర్యంకోసం, నవ్యసాహిత్య వ్యాప్తికోసం సాహితీ సమితి ఏర్పడింది కథా సాహిత్యానికి చలువపందిళ్ళు వేసింది సమితిసభ్యులే. ఏకాంక నాటికా రచనకు బీజం వేసింది సమితి సభ్యులే. పద్యనాటికలు కూడా ప్రదర్శన యోగ్యములే అని శివశంకరశాస్త్రిగారు నిరూపించిన కాలమది. నారాయణ రావు, నారాయణభట్టు, బారిష్టరు పార్వతీశంవంటి నవలలు, నాయకురాలు, వసంతసేనవంటి నాటకాలు, జాతక కథలు, నవరసగంగాధరం మొదలైన ఉత్తమ సాహిత్యసృష్టికి సాహితీసమితి బాటలు వేసింది. దేవులపల్లి, రాయప్రోలు, నండూరి, కరుణశ్రీ ప్రభృతులు కవితా చైత్రయాత్రలు సాగించారు. భారతి, శారద వంటి పత్రికలకన్న ముందుగానే "సాహితి" పత్రికను నడిపిన ఘనత సాహితీ సమితికే దక్కుతుంది. 'సాహితి' నడిపిన కొంతకాలం తర్వాత – ఆ పత్రిక ఆగిపోవటంతో – మళ్ళీ "సఖి" అనే పత్రికను నడపవలసి వచ్చింది.

"కవిత్వమూ లలిత కళలూ అంటే విశేషము అభిమానమున్న అనేక యువకులు కూడదము తటస్థించినది. వారంతా మిత్రులైనారు. అంతా ఇంగ్లీషు వాఙ్మయాన్ని అభినివేశముతో చదివి అవగాహన చేసుకున్నవారు. బెంగాలీ, హిందీ, మరాఠీ మొదలైన భాషల్ని అభ్యసించి, ఆభాషలలోని కావ్యాల్ని చదవసాగినారు. నిరంతరము సాహిత్యగోష్ఠితోనూ, చమత్కార భాషణలతోనూ కాలముగడిపిన జిజ్ఞాసువులు వారంతా. కీర్తికామమూ, స్వార్థమూ, అహంకారమూ వాళ్ళ మనసుల్ని కలుషితము చేయలేదు. ఒక్కచోట్ల తారసిలిన ఆనాటి మధురప్రకృతుల సమావేశమే క్రమముగా సంస్థయై సాహితీలోకాన్ని ఏలుతున్నదంటే ఎంత చిత్రం!♦" అని కురుగంటి సీతారామాచార్యులుగారు, పిల్లలమఱ్ఱి వెంకట హనుమంత రావుగారు పేర్కొనటంవల్ల సాహితీసమితి ఔన్నత్యం తెలుస్తుంది.

♦నవ్యాంధ్ర సాహిత్య వీధులు – ద్వితీయభాగం – పుట 297

కేవలం రచయితలతో మాత్రమే స్థాపించబడిన సంస్థగా సాహితీసమితి విశిష్టమైనది.

## 5. వర్ధమాన సమాజం :

1906 లో నెల్లూరులో కొంతమంది యువకులతో – "The Nellore Progressive Union" గా స్థాపించబడి "వర్ధమాన సమాజం" గా రూపుదిద్దుకొని నెల్లూరుకు కీర్తికిరీటమైంది. సమాజ శ్రేయస్సుకు సాహిత్యమొక సాధనంగా భావిస్తున్న సంస్థ ఇది.

"డెబ్బదియైదు వర్షములు తీవిదలిర్పగ నీ యమూల్యమౌ
కబ్బములిచ్చి పాఠకనికాయ హృదంతరసీమలన్ వెలుం
గబ్బగ జేసినట్టి మహితాత్మవు, తారలు సూర్యచంద్రులున్
బ్రబ్బెడు నంతదాక ధరపై విలసిల్లుము జ్ఞానదాతవై"

అని మోచర్ల రామకృష్ణకవిగారు ప్రశంసించిన వర్ధమాన సమాజం అభివృద్ధికి శ్రీయుతులు టి. వి. వెంకటరామ అయ్యర్ అవర్ గళ్, శ్రీ రేబాల పట్టాభిరామరెడ్డి, శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి, రావుబహదూర్ ఎమ్. చెంగయ్యపంతులు, శ్రీ ఎ. ఎన్. కృష్ణారావుపంతులు, మాడభూషి నరసింహాచార్యులు, తిక్కవరపు రామిరెడ్డి మొదలైన మహాపురుషులు కృషి చేశారు. సాహిత్యసమారాధనోత్సవాలు, కవుల జయంత్యుత్సవాలతోపాటు ప్రచురణలు కూడా చేపట్టడం విశిష్టంగా చెప్పుకోవాలి. పతాభి "ఫిడేలు రాగాల డజను", "కయితనాదయిత" కావ్యాలను, మటుపూరు కోదండ రామిరెడ్డిగారి "వేమన–పాశ్చాత్యులు" గ్రంథాన్ని, "కవితా వైజయంతి" విమర్శనా గ్రంథాన్ని ప్రచురించడమే కాదు– "బయోగ్రాఫికల్ స్కెచెస్ ఆఫ్ ది దక్కన్ పొయెట్స్" వంటి ఆంగ్ల గ్రంథాలను కూడా ప్రచురించటం ప్రశంసనీయం.♦

♦'వర్ధమానసమాజం' – ప్లాటినంజూబిలీ సంచిక ఆధారంగా (1982)

## 6. ♦ నవ్య సాహిత్య పరిషత్తు :

గ్రామ్యభాషావాదం అనర్థదాయకమనీ, గ్రాంథికభాషే శరణ్యమనీ ఆంధ్ర సాహిత్య పరిషత్తు నొక్కి వక్కాణించడంతో అందులో వున్న ఆధునిక భావవాదులు తిరుగుబాటు చేసారు. తణుకులో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు 13వ వార్షిక సభలో "గ్రామ్యముకాని వ్యావహారికాంధ్రభాషలో పూర్వ సాంప్రదాయము ననుసరించి గ్రంథములు రచింపవచ్చును" అనే తీర్మానం చేస్తే, తర్వాత జయంతి రామయ్య పంతులు గారు ఆ తీర్మానాన్ని రద్దుచేశారు. ఈ సంఘటనతో సంస్థలోఉండి వ్యావహారిక భాషావాదం అంగీకరింపజేయలేక-పోట్లాడుకోలేక-పెద్దమనిషి తరహాగా వేరేసంస్థ పెట్టుకోవాలని నిర్ణయించారు. "వ్యావహారిక భాషావాదులు మర్యాదస్తులకు యోగ్యమైన పనిచేసి నవ్యసాహిత్యపరిషత్తు స్థాపించినారు" అని నోరి నరసింహమూర్తిగారు పేర్కొన్నారు. (సారస్వత వ్యాసములు)

1933లో స్థాపించబడిన నవ్య సాహిత్య పరిషత్తు సంస్థకు 1836 వరకు నియమ నిబంధనలు ఏర్పడలేదు. పరిషత్తు సభ్యులు పద్యకావ్యాలు వచనకావ్యాలు వ్రాయవచ్చు. కథ, నాటకం, వ్యాసం – ఏదో ఒకటి రచించేవారే నవ్య సాహిత్య పరిషత్తులో సభ్యులయే అర్హతను కలిగి ఉంటారని నిర్దేశించారు. వ్యావహారిక భాషావ్యతిరేకులకు ఈ సంస్థలో స్థానం ఉండదని నిర్ద్వంద్వంగా ప్రకటించారు. నవ్య సాహిత్య పరిషత్తు నిర్వహించిన వార్షిక సభలకు శ్రీయుతులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, గిడుగు, చిలుకూరి నారాయణరావు, రాయప్రోలు, తల్లావఝుల దేవులపల్లి, అడవి బాపిరాజు, కాటూరి, బుర్రా శేషగిరిరావువంటి సాహితీ ప్రముఖులు అధ్యక్షత వహించి తమ ఉపన్యాసాలతో ఉత్తేజం కలిగించారు.

---

♦ సారస్వత వ్యాసములు: 5వ సంపుటం, ఆం. ప్ర. సా. అకాడమి, పుటలు – 120, 130.

నవ్య సాహిత్య పరిషత్తుకు గౌరవాధ్యక్షులుగా చెళ్ళపిళ్ళవారు, చల్లపల్లి రాజావారు, ముక్త్యాల రాజావారు ఉండేవారు. మల్లంపల్లి సోమ శేఖర శర్మగారు, గడియారం వెంకట శేషశాస్త్రిగారు, చిరుమామిళ్ళ శివ రామకృష్ణ ప్రసాద్‌గారు, ఆచంట జానకిరామ్‌గారు, అనిశెట్టి, జమ్మల మడక, విశ్వనాథ, చింతా దీక్షితులు, బేతుమళ్ళ కామేశ్వరరావు ప్రభృ తులు సభ్యులుగా ఉండేవారు. భావకవిత్వం, పద్యకవిత్వం, ఆధ్యాత్మిక సాహిత్యం, నాటక సాహిత్యం, విమర్శ – అన్ని ప్రక్రియలను సమాద రించిన నవ్య సాహిత్య పరిషత్తు కార్యస్థానం గుంటూరులో ఉన్నా–బందరు బరంపురం, రాజమండ్రి, అనంతపురం, చెన్నపట్నం, కాకినాడ, విజయ వాడలలో సభలు జరిపేవారు. "నవ్య కవులందరి ప్రతిభ ఏకముఖంగా ప్రదర్శించవలెనను" ఆశయంతో తెలికిచర్ల వెంకటరత్నంగారి సంపాద కత్వంలో "ప్రతిభ" సాహిత్య పత్రికను నడిపి అమూల్యమైన సేవ చేసింది నవ్య సాహిత్య పరిషత్తు.

## 7. ♦ ఆంధ్ర సారస్వత పరిషత్తు:

హైదరాబాదు నగరంలో సారస్వతాన్ని, సంస్కృతిని ప్రజా సము దాయానికి అందజేసే సంస్థ ఆవశ్యకత గోచరించింది. ఆనాడు తెలుగు భాషకు విద్యావ్యవస్థలోగాని, పరిపాలనా వ్యవస్థలోగాని ఎటువంటి స్థానము లేకుండెను. అంతేకాదు – తెలంగాణలో తెలుగు భాషాదీపము పూర్తిగా ఆర్పివేయడమే అప్పటి ప్రభుత్వ విధానమై యుండెను. అక్కడక్కడ ప్రమిదలలో మినుకు మినుకుమను చమురు దీపాలవలె తెలుగు సాహితీ సంస్కృతులు పల్లెపట్టులలో ప్రకాశించినప్పటికిని యీ కాంతిని మరింత అతిశయింపజేసి, ఏకోన్ముఖము గావించడానికి ఒక సంస్థ అవసరమై వుండెను" అని ఆంధ్ర సారస్వత పరిషత్ నిర్వాహకులైన దేవులపల్లి

---

♦ ఆంధ్ర సారస్వత పరిషత్తు – రజతోత్సవ సంచిక (1976) ఆధారంగా

రామానుజరావుగారు సంస్థ స్థాపించబడిననాటి పరిస్థితులను తెలిపారు. హైదరాబాదులో 1943లో ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపించబడినది.

రెడ్డి హాస్టలులో బూర్గుల రంగనాథరావు, భాస్కరభట్ల కృష్ణారావు సమావేశకర్తలుగ లోకనంది శంకర నారాయణరావు అధ్యక్షతన తొలి సమావేశం జరిగింది. పరిషత్తు నియమావళిని మాడపాటి హనుమంత రావు, సురవరం ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, ఆదిరాజు వీర భద్రరావు ప్రభృతులు రూపొందించారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆశయాలివి –

1 రాష్ట్రాంధ్రులలో మాతృభాషాభిమానం పెంపొందించి తద్వ్యాప్తికై పాటుపడుట.

2 వివిధ ప్రదేశములందు వాఙ్మయము యొక్క వివిధశాఖలతో కూడిన సమావేశములు జరిపి ప్రబోధమును కలిగించుట.

3 పాఠ్య ప్రణాళికను సిద్ధపరచి పరీక్షలు జరుపుట.

4 సారస్వత సంస్థలను. సారస్వతోపాసకులను ప్రోత్సహించుట.

5 సాహిత్యము, ప్రకృతి విజ్ఞానము మున్నగు విషయములపై గ్రంథ ములు వ్రాయించి ప్రకటించుట.

6 ఉత్తమ గ్రంథములకు పారితోషికములిచ్చియు, సమావేశములలో రచయితలను సన్మానించి ప్రోత్సహించుట.

29-9-1994 నుంచి 6-10-1994 వరకు జరిపిన ఆంధ్ర మహా కవి జయంతి సప్తాహం– ఆంధ్ర సారస్వతపరిషత్తుకు ఖ్యాతి సంపాదించి పెట్టింది. పరిషత్తు పండిత సారస్వతము, ప్రజాసారస్వతము, బాల సార స్వతము అని మూడు విధాలుగా సాహిత్య గ్రంథాలను ప్రకటించింది. సుర వరం వారి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర", సన్నిధానంవారి "కావ్యాలంకార

సంగ్రహము", వంటి సాహితి విలువలుగల పుస్తకాలు నూరువరకు ప్రచురించి సాహితీ సేవచేసిన సంస్థ ఇది. ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ప్రాచ్యకళాశాల, గ్రంథాలయ పఠనాలయాలు, పుస్తక విక్రయశాలలు నిర్వహింపబడటం విశేషం. వివిధ జిల్లాలలో పరిషత్తుశాఖలుకూడా వెలువడ్డాయి. గడియారం రామకృష్ణశర్మ, దేవులపల్లి రామానుజరావుగార్ల కృషి వల్ల ఈ పరిషత్తు ఈనాటికీ సారస్వత కృషి జరుపుతోంది. జంట నగరాలతో సాహిత్య కేంద్రంగా విరాజిల్లుతోంది.

## 8. ♦ కవితా సమితి:

జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లో ఉత్సాహవంతులైన ముగ్గురు యువకులు విశాఖపట్నంలో స్థాపించిన సంస్థ ఇది. 6-5-1926న కవితాసమితిని స్థాపించిన యువకులు - పురిపండా అప్పలస్వామి, శ్రీరంగం శ్రీనివాసరావు, వడ్డాది సీతారామాంజనేయులు.

తనుగుతల్లిని గద్దెనెక్కించాలనీ, తెలుగుపలుకు నుడిని తీర్చిదిద్దాలనీ తపనపడే "కవిగారు" (మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు) కవితా సమితికి శాశ్వత అధ్యక్షులు. కవిగారి నివాసస్థలం "ధర్మాశ్రమం"లో మొదటి సమావేశం 20-11-1926న మధ్యాహ్నం జరిగింది. భమిడిపాటి చినయజ్ఞనారాయణ శర్మగారు ఉపాధ్యక్షులుగా, పురిపండా కార్యదర్శిగా సబ్నివీసు సత్యకేశవరావుగారిని కోశాధిపతిగా ఎన్నుకొన్నారు. పద్య, గద్య, గేయాలలో రచన చేయగలిగినవారు సభ్యులుగాఉండవచ్చు. సభ్యులు రచించిన గ్రంథాలను కార్యనిర్వాహకవర్గం అమోదిస్తే కవితా సమితి గ్రంథావళిగా ముద్రించవచ్చు. సంవత్సరానికి కనీసం మూడుసార్లయినా సమితి సమావేశంకావాలి అని నిర్ణయించుకొన్నారు.

♦ చరిత్రాత్మకమైన సాహితీసంస్థ (వ్యాసం) - 27-5-1984 నాటి ఆంధ్రజ్యోతి దినపత్రిక.

కవితాసమితిలో ఆచంట సాంఖ్యాయనశర్మ, కేతవరపు వేంకట శాస్త్రి, తాపీ ధర్మారావు, సెట్టి లక్ష్మీనరసింహం, గొబ్బూరి వేంకటానంద రాఘవరావు, తెన్నేటి విశ్వనాథం, స్థానాపతి సత్యనారాయణశాస్త్రి, స్థానాపతి రుక్మిణమ్మ, శ్రీశ్రీ, ఆరుద్ర మొదలైన సాహితీ వ్రతులు ఏభై మంది సభ్యులుగా ఉండేవారు. ప్రామాణికమైన రచనలతో 'వైశాఖి' గా రెండు సంచికలను, 'కవితాసమితి వార్షికోత్సవ సంచిక' ను ప్రచురించింది. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగార్కి జరిగిన కనకాభిషేకం, కవి గారికి జరిగిన షష్టిపూర్తి ఉత్సవం కవితాసమితికి ప్రచారం తెచ్చాయి. 1993లో గిడుగు రామమూర్తిగారి అధ్యక్షతన – మల్లంపల్లి సోమశేఖర శర్మగారి సమక్షంలో "ఆంధ్ర కవుల ఛాయాచిత్ర ప్రదర్శన" జరిగింది. 10–12–1933న విశ్వకవి రవీంద్రనాథఠాగూరు విశాఖ వచ్చినప్పుడు కవితాసమితి ఏర్పాటుచేసిన సత్కారసభ పురజనులప్రశంసలు అందుకొంది అనకాపల్లి, మద్రాసునలో కవితాసమితి శాఖలు ఏర్పడినాయి. 1928లో శ్రీశ్రీ పద్య కవితాసంపుటి "ప్రభవ" ను కవితాసమితి ప్రచురించింది. పురిపండా వ్యావహారికాంధ్ర మహాభారత సంపుటాలు, కవిగారి "తెలుగు తోబుట్టువులు", "నన్నయ్య నుడులు" వంటి ముప్పయి గ్రంథాలను కవితా సమితి ప్రచురించింది. కవిగారు శ్రమపడి తయారుచేసిన "నుడికడలి" ని ప్రచురించాలనే సమితి సంకల్పం విజయవంతం కాకపోవటం ఆంధ్రుల దురదృష్టం. ఇటీవల వజ్రోత్సవం జరుపుకొన్న 'కవితాసమితి' కూడా మూలపడింది.

## 9. ♦శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల :

'గ్రంథమాల' పేరుతో సాహితీసేవ చేస్తున్న సంస్థలలో ప్రాచీనమైనది, ప్రముఖమైనది శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల. "రాయలసీమలో

♦ ఈ సంస్థ ప్రచురించిన స్వర్ణోత్సవ ప్రత్యేక సంచిక (1983) ఆధారంగా.

నిక్షిప్తమైన ప్రతిభాసంపదను, కళాసాహిత్య సాంస్కృతిక జీవన సర్వస్వ మాధురులను వెలుగులోకి తీసుకురావాలనే" ధ్యేయంతో కల్లూరు అహోబలరావుగారు సారథిగా, ఘాళీ కృష్ణమూర్తిగారు, విద్వాన్ హెచ్. దేవదానముగారు సహకరించగా – ఈ ముగ్గురూ కలిసి 1931లో బళ్ళారిలో శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాలను స్థాపించారు. ప్రధానంగా గ్రంథప్రచురణ – గ్రంథ సేకరణ, కవిపండితుల ప్రోత్సాహం, ఆశయాలుగా సాహితీసేవచేసి సాహిత్య అకాడమిచే గుర్తింపు పొందిన సంస్థఇది.

బళ్ళారినుంచి అనంతపురానికి మారినతర్వాత 1956 నుంచి 'హిందుపురం కేంద్రంగా సంస్థమరింతఅభివృద్ధిచెందుతోంది. ఈ సంస్థ ప్రచురించిన 'రాయలసీమ రచయితల చరిత్ర' పండితుల ప్రశంసలుపొంది రాయలసీమ విశిష్టతను చాటిచెప్పింది. మధురకవి బెళ్ళూరి శ్రీనివాసమూర్తి, కవిత్వవేది కల్లూరు వెంకట నారాయణరావు. రాయలసీమ కేసరి అహోబలరావుగార్ల రచనలతోపాటు మొత్తం యాభై గ్రంథాలను ప్రచురించింది. 'రాయలసీమ సాహితీసీమ' అని చాటిచెప్పిన ఘనత శ్రీ కృష్ణదేవరాయల గ్రంథమాలకే దక్కుతుంది.

## 10 ♦ ఆంధ్ర బాలానంద సంఘం :

బాల సాహిత్యాన్ని, బాల సాహిత్య రచయితల్ని ప్రోత్సహించి, భావిభారత పౌరుల్ని తీర్చిదిద్దటానికి బాల సాహిత్య సంస్థల అవసరం వుందని న్యాయపతి రాఘవరావు (రేడియో అన్నయ్య), న్యాయపతి కామేశ్వరి (రేడియో అక్కయ్య) దంపతులు 1940 లోనేగుర్తించారు. మొదటిసారిగా "ఆంధ్ర బాలానంద సంఘం" ప్రారంభించారు మొదట ఈ సంఘపు కార్యాలయం మద్రాసులో ఉండేది. ప్రస్తుతం హైదరాబాదులో

♦ 'బాలానందం' (వ్యాసం) – ఎమ్. శివప్రసాద్ – 11-3-1990 ఆంధ్రపత్రిక. బాలల అకాడమీ 1976 లో ప్రారంభించబడి, ప్రస్తుతం నిర్వీర్యం కావటంవల్ల పేర్కొనటంలేదు.

ఈ సంస్థ కార్యకలాపాలను కొనసాగిస్తోంది. శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ మాడపాటి హనుమంతరావు ప్రభృతుల సహకారంతో సొంత భవనం కూడా దక్కింది. 1952 లో తొలిసారి "చిల్డ్రన్స్ కాన్ఫరెన్సు" మద్రాసులో నిర్వహించడం, "చిల్డ్రన్స్ మొబైల్ లైబ్రరీ" నడపటం, "చిల్డ్రన్స్ థియేటర్ ఫెస్టివల్" నిర్వహించడం, బాలబాలికలకు సాంస్కృతిక పోటీలు నిర్వహించటం, 'బాల' మాసపత్రికను ప్రచురించటం ఆంధ్ర బాలానంద సంఘం సాధించిన ఘన విజయాలలో కొన్ని. బాలల భవితవ్యంకోసం, బాలలలో మేధావికసన కోసం – బాల సాహిత్యాభివృద్ధికోసం – బాల సాహిత్య రచయితల ప్రోత్సాహంకోసం ఆజన్మాంతం పాటుపడిన న్యాయపతి రాఘవరావు, కామేశ్వరి దంపతులు చిరస్మరణీయులు.

## 11. అభ్యుదయ రచయితల సంఘం :

ఒక సిద్ధాంతం, ఉద్యమం – ప్రాతిపదికగా ఏర్పడిన సంస్థలలో అభ్యుదయ రచయితల సంఘం మొదటిది. ఈ సంస్థ ప్రధాన ఆశయాలు యివి– ♦

1 మన సమాజంలో జరుగుతున్న మార్పుల్ని గుర్తించి వాటినీ, అభివృద్ధిని ప్రతిబింబింపజేసే సాహిత్యాన్ని సృష్టించడం భారతీయ రచయితల విధి.

2 సారస్వతంలో శాస్త్రీయమైన హేతువాదాన్ని చొప్పించి దేశంలో వున్న అభివృద్ధికర శక్తుల్కు చేయూతనివ్వాలి.

3 కులమత కక్షలు, జాతి విద్వేషం, వర్గదోపిడి – వీటిని పురిగొల్పే వ్రాతల్ని ప్రతిఘటించాలి.

4 సారస్వతం, తదితర కళలు ఛాందసవర్గాల చేతుల్లో నలిగి మలినమవుతున్నవి. వాటిని వారి ఆధిపత్యంనుంచి తప్పించడం

---

♦ సంఘ ప్రణాళిక – 'అభ్యుదయ' యాభై ఏళ్ళ ప్రత్యేక సంచిక (1988) పుటలు 24, 25.

ప్రజాసముదాయానికి సన్నిహితపరచడం, జీవితయాథార్థ్యాన్ని ఉన్నదున్నట్లుగా కనబరిచేశక్తివంతమైన సాధనాలుగాచెయ్యాలి

5 ఆచారాల్ని, వ్యవస్థల్ని, హేతువాదంతో పరిశీలించడానికిన్ని కార్యాచరణకు ప్రోత్సహించి సంఘటనాశక్తిని అలవరచి, మార్పులు తేవడానికిన్ని తోడ్పడే విమర్శనాభావాన్ని మనలో ఉత్తేజింపజేసే ప్రతి వ్రాతా అభివృద్ధికరమైనదే.

6 ఆలోచనా స్వాతంత్రం, అభిప్రాయాల స్వాతంత్ర్యాల స్వేచ్ఛ, ప్రచారహక్కును రక్షించడానికి పోరాడాలి.

ఈ ఉద్దేశాలతో 1996 – ఏప్రిల్‌లో – లక్నోలో మున్షీప్రేమ్ చంద్ అధ్యక్షతన భారత అభ్యుదయ రచయితల సంఘం (Indian Progressive Writer's Association) స్థాపించబడిది. సజ్జాద్ జహీర్, ముల్కురాజ్ ఆనంద్, కైఫీఆజ్మీ, కె. ఎస్. అబ్బాస్ మొదలైన ప్రసిద్ధ రచయితలు సభ్యులుగా ఉండేవారు. చదలవాడ పిచ్చయ్యగారి కృషివల్ల 1943, ఫిబ్రవరి 14, 14 తేదీలలో ప్రథమాంధ్ర అభ్యుదయ రచయితల సంఘ సమావేశం తెనాలిలో తాపీ ధర్మారావు అధ్యక్షతన జరిగింది. "పీడింపబడేవాళ్ళూ, పీడించేవాళ్ళూ వున్న యీ వర్గసమాజం ఉండాలని ఎవరూ కోరరు. రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటించేవారు ఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ఈ ధనిక సమాజం పోవాలనుకోవటమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన." అని దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారు తృతీయ అభ్యుదయ రచయితల మహాసభలో (1956) చేసిన అధ్యక్షోపన్యాసంలో పేర్కొన్నారు. ♦

♦ తెలుగు కవితావికాసం (2982)–రామమోహన్‌రాయ్ కె. పుట–231

1965, జులై 30న విజయవాడలో జరిగిన అరసం అయిదవ మహాసభలకు శ్రీశ్రీ అధ్యక్షత వహించి – "మనది నూటికి నూరుపాళ్ళు సాహిత్య సంస్థ. ఇందులో ఏ రాజకీయపక్షానికీ పెత్తనం ఉండబోదని మన ప్రణాళిక నిష్కర్షగా స్పష్టంచేసింది. కొన్ని ప్రధాన సూత్రాలకు కట్టుబడి కొన్ని ప్రత్యేక లక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని మనం పని చేస్తాం." ♦ అని ఉపన్యాసంలో పేర్కొనటం జరిగినా, తర్వాత రాజకీయాల ప్రభావం ఎక్కువై చివరకు అరసం చీలిపోవటం సంభవించింది. ఈ సందర్భంలో "తెలుగు సాహిత్యంలో కల్లోలక్షీణ దశాబ్దాలు" గ్రంథంలో రచయిత 'అనంతం' విమర్శను ఉదాహరించటం సముచితంగా వుంటుంది.

"1955 నాటికి ఉద్యమం ఉత్సాహంగా నిర్వహించే రచయితలు చెల్లాచెదురయ్యారు. కొందరు యువ రచయితలు అభ్యుదయోద్యమానికి నిర్మాణరూపం యిచ్చారు. కాని అది ఆదిలో వున్నంత పటిష్ఠంగా లేకపోయింది. చాలామంది రచయితలు రేడియోలకు, సినిమాలకు అమ్ముడుపోయారు. అభ్యుదయ రచయితల సంఘం ఇంచుమించు అవసానదశకు చేరుకుంది. 1955 నుంచి కమ్యూనిస్టు పార్టీ చీలికలతో క్షీణిస్తోంది. దాని ఫలితంగా అరసం నిర్జీవమైపోయింది. అరసం నిర్జీవంగావున్నా అభ్యుదయ భావాలు సాహిత్యంలో విరివిగా వ్యాపించాయి." (పుట 11)

అభ్యుదయ కవిత్వం రెండు దశాబ్దాలపాటు (1935–55) తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది. ప్రథమదశకంలో అభ్యుదయకవిత్వం ఉద్యమ వేగాన్ని అందుకొని సాహిత్యాన్ని సమాజానికి దగ్గరగా తీసుకెళ్ళింది. సామాన్యజీవితపు స్థితిగతుల్ని బాగుపరచే యత్నంలో ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసింది. పండితులుకూడా అభ్యుదయ దృక్పథంతో

♦ అభ్యుదయ సాహిత్యం (వ్యాసం) – ఆరుద్ర – ఆంధ్రజ్యోతి రజతోత్సవ సంచిక (1985) – పుట 50.

రచనలు చేసేవారు. 'అభ్యుదయవాది' అనిపించుకోవటం గొప్పగా భావించే వారు. అభ్యుదయరచయితలు ఛందస్సును సర్పపరిష్వంగంగా భావించారు. ఆధునికభావాల వ్యక్తీకరణకు పద్యం పనికిరాదనుకొని వచన కవిత్వాన్ని స్వీకరించారు. తుమ్మల వెంకట్రామయ్య, అనిసెట్టి, అరుద్ర, దాశరథి, కాళోజీ, కుందుర్తి, సోమసుందర్, నార్ల చిరంజీవి, కొడవటిగంటి కుటుంబరావు, చాసో, గజ్జెల మల్లారెడ్డి, కె. వి. రమణారెడ్డి ప్రభృతుల నిర్వహణలో ఆంధ్ర సాహిత్య చరిత్రలో విప్లవం తీసుకొచ్చిన అభ్యుదయ రచయితల సంఘం నీరసించిపోయి _ విప్లవ రచయితల సంఘానికి దారి యిచ్చి తప్పుకొంది. అయితే అరసం ప్రచురించిన సాహిత్య గ్రంథావళి, అరసం నడిపిన అభ్యుదయ, తెలుగుతల్లి పత్రికలు అభ్యుదయ సాహిత్యానికి పుష్టిని చేకూర్చాయి. ప్రతిభగల కవుల్ని, కథారచయితల్ని, లోకానికి పరిచయం చేసిన ఘనత, సాహిత్య గమనాన్ని మరో మలుపు తిప్పిన ఖ్యాతి అభ్యుదయ రచయితల సంఘానికే దక్కుతుంది.

## 12. తెలంగాణా రచయితల సంఘం :

"తెలంగాణాలో సాహిత్యోద్యమాన్ని విస్తృత ప్రాతిపదికమీద నడిపించడానికి, యువ రచయితలలో సృజనాత్మక శక్తిని పెంపొందించడానికి 1951 సెప్టెంబరు 6న హైదరాబాదు నగరంలో తెలంగాణా రచయితల సంఘం స్థాపించబడింది." ♦ 1952లో ఈ సంఘానికి జరిగిన ఎన్నికలలో దాశరధి అధ్యక్షులయ్యారు. భాగి నారాయణమూర్తి ఉపాధ్యక్షులుగా, సి. నారాయణరెడ్డి ప్రధాన కార్యదర్శిగా, డి. రామలింగం సహాయ కార్యదర్శిగా ఎన్నికయ్యారు. కాళోజీ, బి. రామరాజు, దేవులపల్లి రామానుజరావు, వెల్దుర్తి మాణిక్యరావు, వట్టికోట ఆళ్వారుస్వామి గార్లు కార్యవర్గ సభ్యులయ్యారు.

♦ 'మంజీర' సాహిత్యపత్రిక (1954) లో వార్షికనివేదిక ఆధారంగా.

"తెలంగాణా రచయితల సంఘం కొందరు రచయితల కూటమికాదు అది ఒక ఉద్యమం. సాహిత్య మహోద్యమం. దాశరథి దానికి నాయకుడు నారాయణరెడ్డి అనుచరుడు, ఉపనాయకుడు. అయితే ఇది ప్రాంతీయ తత్త్వాన్ని ప్రోత్సహించిన సంస్థకాదు. తెలుగుభాషకు పట్టంకట్టాలని పూను కొన్న పూనిక అది." ♦ అనటం వాస్తవంగా చెప్పవచ్చు.

తెలంగాణా రచయితల సంఘానికి కరీంనగర్, సిరిసిల్ల, సిద్ధిపేట, ఖమ్మం మొదలైన పట్టణాలలో శాఖలు ఏర్పడినాయి. సాహిత్య కార్యక్ర మాలు పెద్దఎత్తున చేపట్టి, ప్రజలలో సాహిత్యాభిలాషను రేకెత్తించిన సాహిత్య సంస్థ ఇది. "ఉర్దూ ముషాయిరా" మాదిరిగా తెలుగులో కవి సమ్మేళనం నిర్వహించి ఆదరణ పొందిన సంస్థగా, తెలంగాణా విఖ్యాత కథకుల సమ్మేళనోత్సవాన్ని ఘనంగా నిర్వహించిన సంస్థగా తెలంగాణా రచయితల సంఘానికి ప్రముఖ స్థానం ఉంది. తెలంగాణాలో ఈ సంఘం ప్రప్రథమంగా 1953లో "ప్రబంధ పఠన గోష్ఠు"లను నిర్వహించింది. ప్రాంతీయభేదం లేకుండా 65 మంది అఖిలాంధ్ర కవులతో ప్రచురించిన "ఉదయఘంటలు" కవితాసంపుటి ఆనాడు ప్రాచుర్యం పొందింది.

"ఉర్దూలో చదివిన మావంటి వారికి ఈ సంస్థలవల్లనే సాహిత్యం పట్ల ఆకర్షితులయ్యే అవకాశం లభించింది. ఈనాటి రాజకీయ సంస్థలు ఎంతపని చేస్తున్నాయో ఆనాడు సాహితీ సంస్థలు అంతగా పనిచేశాయి. Multi Dimentional గా అవి పనిచేశాయి. తెలంగాణాలో ఆంధ్ర సాహిత్యం వ్యాప్తిచెందడానికి ఈ సంస్థలే ప్రాణస్వాయువులు" ♦♦ అని పలికిన ఆచార్య బి. రామరాజుగారి మాటలలో అతిశయోక్తి లేదు. ఆ చారిత్రక అవసరంకోసమే తె. ర. సం. ఆవిర్భవించింది.

---

♦ అశ్రుతర్పణం (వ్యాసం) – వి. పి. రాఘవాచార్యులు. స్రవంతి – ఏప్రిల్ 1988.

♦♦ ముఖాముఖిగా పలికిన మాటలు.

## 13. తెలుగు భాషాసమితి :

"భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సూత్రమునను సరించి కొలది కాలములో ఆంధ్ర రాష్ట్రమేర్పడక తప్పదు. అప్పుడు మన రాష్ట్రమందలి రాజకీయభాష – అనగా ప్రభుత్వమువారి భాష తెలుగుభాషే కాకతప్పదు. తెలుగుభాషా ప్రయోజనము ఎక్కువగానున్న ఈ సమయములో జన సామాన్యమునకు సకల విషయములందలి విజ్ఞానమున్ను కలుగజేసే రచనలు తెలుగుభాషలో విరివిగా సాగించవలసి యున్నది." ♦ అనే ధ్యేయంతో అక్టోబరు 10 – 1947 న 'తెలుగు భాషాసమితి' మద్రాసులో ఏర్పడింది. అప్పటి మద్రాసురాష్ట్ర ఆర్థికశాఖామాత్యులు బెజవాడ గోపాల రెడ్డిగారు వ్యవస్థాపక అధ్యక్షులుకాగా, ఆర్. బి. రామకృష్ణంరాజుగారు, విజయనగర మహారాజు విక్రమదేవ వర్మగారు ఉపాధ్యక్షులు, కోశాధ్యక్షులుగా పర్వతనేని బ్రహ్మయ్యగారు, మోటూరి సత్యనారాయణగారు కార్యదర్శి కాగా – పి. వి. రాజమన్నారు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు ప్రభృతుల సహకారంతో సంస్థ చురుకుగా కొనసాగింది. తెలుగు విజ్ఞాన సర్వస్వ నిర్మాణమే సమితి ప్రధాన లక్ష్యం. అయితే వివిధ సాహిత్యాంశాల పై పోటీలు నిర్వహించి, ప్రామాణికమైన గ్రంథరచనకు ప్రోత్సాహమిచ్చింది 1951 – 52 లో సమితి నిర్వహించిన పోటీలో కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ రచించిన "ఆంధ్ర కవయిత్రులు" కు బహుమతి లభించింది. సాహిత్య సభలనుకూడా నిర్వహించిన ఈ సమితి హైదరాబాదుకు మారిన తరువాత విజ్ఞాన సర్వస్వ ప్రచురణకే పరిమితమైంది.

♦ తెలుగు విజ్ఞాన సర్వస్వంలో – 'సంస్థ ఆశయాలు' నుంచి ఉదాహృతం

## 14. ♦ ఫ్రీవర్స్ ఫ్రంట్ :

కుందుర్తి ఆంజనేయులు గారికి మరో పేరు "ఫ్రీవర్స్ ఫ్రంట్" (Freeverse Front) అనవచ్చు. వచన కవితావ్యాప్తికి ఏదైనా చేయాలనే సంకల్పం 1958 లో కుందుర్తి గారికి కలిగింది. అది 1966లో కార్యరూపందాల్చి 'ఫ్రీవర్స్ ఫ్రంట్' గా అవతరించింది. అధ్యక్ష, కార్యదర్శ్యాది కార్యవర్గాలకూ, ఎన్నికలకూ చోటులేని ఈ సంస్థ ప్రధాన ఆశయం - "యువకులలో, యువ కవులలో ఈ వచన కవితాప్రక్రియను విరివిగా వ్యాపింపచేయటం - ప్రోత్సహించటం."

ఆ ఆశయంతోనే ఏటా సంస్థ తరపున ఒక ఉత్తమ రచన కవితా సంపుటికి బహుమతి ఈయబడుతుంది. ఈ బహుమతి పేరు ప్రఖ్యాతులున్న పెద్దలకుకాదు. ప్రతిభగల యువకులకోసం ఉద్దేశించినది. అయితే ఈ సంస్థనుంచి బహుమతి పొందిన యువకవులే పేరు ప్రఖ్యాతులు సంపాదించి కవితా ప్రపంచంలో స్థిరపడటం గర్వించదగ్గ విషయం.

ఫ్రీవర్స్ ఫ్రంట్ కవితాసమావేశాలను నిర్వహించేది. కుందుర్తి గారి 'నగరంలోవాన', 'నాలోని నాదాలు', సి. వి. కృష్ణారావుగారి 'వైతరణి', 'నయాగరా' వంటి కవితా సంపుటులు కూడా ఈ సంస్థ ప్రచురించింది. ఫ్రీవర్స్ ఫ్రంట్‌నుంచి ఉత్తమ కవితాసంపుటి బహుమతి పొందినవారిలో చెరబండ రాజు, వరవరరావు, వేగుంట, శీలా వీర్రాజు, నగ్నముని, శివారెడ్డి, అను రాజేంద్ర, సౌభాగ్య మొదలైన కవులున్నారు. ఈ సంస్థ ట్రస్టీలుగా సి. నారాయణరెడ్డి, శీలావి, జి. వి. సుబ్రహ్మణ్యం, నాయని కృష్ణకుమారి, ఎమ్. సుబ్బారావులు వ్యవహరిస్తున్నారు. కుందుర్తి మరణానంతరం వారి కుమారుడు సత్యమూర్తి, శీలావి దేవీప్రియ మొదలైనవారు ఫ్రీవర్స్‌ఫ్రంట్‌ను కొనసాగిస్తూనే వున్నారు.

♦ కుందుర్తి సత్యమూర్తి (హైదరాబాదు) గారు అందజేసిన సమాచారం ఆధారంగా.

## 15. ♦ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి :

సాహిత్యంపట్ల ప్రజలలో ఆదరణ, అభిమానాలను కలుగచేయటానికి సాహిత్యాభివృద్ధికి కృషి చేయటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్ర సాహిత్య అకాడమి మాదిరిగా 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి' ని 1957 లో స్థాపించటం జరిగింది. స్వయం పరిపాలనా ప్రతిపత్తిగల ఈ సంస్థను 7-8-1957న అప్పటి భారతదేశ రాష్ట్రపతి డా॥ బాబూ రాజేంద్ర ప్రసాద్ అకాడమీకి ప్రారంభోత్సవం చేశారు మొదటినుంచి సంస్థకు అధ్యక్షులుగా బెజవాడ గోపాలరెడ్డిగారు, కార్యదర్శిగా దేవులపల్లి రామానుజరావుగారు పనిచేస్తూ చాలాకాలం వారిద్దరే సంస్థను నడిపారు. తర్వాత పురిపండా అప్పలస్వామిగారు, ఇరివెంటి కృష్ణమూర్తిగారు, పేర్వారం జగన్నాథంగారు ప్రభృతులు కార్యవర్గంలో చేరారు. ఈ సంస్థ ఆశయాలలో ముఖ్యమైనవి -

1 తెలుగుభాషా, సారస్వతాలలో అనుశీలనా కృషిని పెంపొందించుట.

2 గ్రంథసూచికలను, విజ్ఞాన సర్వస్వాలను నిఘంటువులను ప్రదర్శించుట.

3 బహుమాన, సాహాయ్య పురస్కారముల మూలంగా రచయితలను ప్రోత్సహించుట.

4 సాహిత్య పఠనాశక్తిని కలిగించుట.

5 గ్రంథ ప్రచురణ.

♦ మన సాహిత్యానికి మనమేం చేశాం - వ్యాసం - దేవులపల్లి రామానుజరావు. ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సంచిక (1976)

రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాల ఆంధ్ర శాఖాధిపతులు అకాడమి గుర్తించిన సంస్థల ప్రతినిధులు, విశిష్టసభ్యులు మొదలైనవారు మొత్తం 65 మంది సభ్యులు. వీరు 14 మంది కార్యవర్గాన్ని ఎన్నుకుంటారు – ఇదే సంస్థ నియమావళి.

సాహిత్య అకాడమి విలువైన, మూలపడిన ఎన్నో సాహిత్య గ్రంథాలను ప్రచురించడమేకాదు – తక్కువ వెలకు విక్రయించటం ప్రశంసించదగినది. తెలుగు గ్రంథాలనే కాకుండా హిందీ, ఉర్దూ, సంస్కృత ఆంగ్ల భాషలలో కూడా గ్రంథాలను ప్రచురించింది. ప్రామాణికమైన విమర్శలను వెలువరించింది. ఒకనాటి మేటి వ్యాసాలు పాత పత్రికలలో శిథిలావస్థలో ఉంటే – వాటిని ప్రచురించి "సారస్వత వ్యాసాలు" గా వెలుగులోకి తీసుకువచ్చింది. అన్ని సాహిత్య ప్రక్రియలను సమాదరించే లక్ష్యంతో పద్యకవిత, నవల, కథానిక, విమర్శ, నాటక – నాటికలలో ఉత్తమమైన రచనకు ప్రతి సంవత్సరం బహుమతి నివ్వటం జరిగింది. ఒక సాహిత్యాంశంపై పోటీ నిర్వహించి ఉత్తమరచనకు బహుమతి ప్రవేశపెట్టిన సంస్థ మాత్రమేకాదు – రచయితలు తమ రచనలను ప్రచురించుకోడానికి ఆర్థిక సహాయంకూడా అందించినసంస్థఇది. ప్రముఖ సాహితీ వేత్తలను విశిష్ట సభ్యులుగా సన్మానించడం, కవుల. రచయితల శతజయంత్యుత్సవాలను నిర్వహించడం. సాహితీవేత్తల సంస్మరణ సభలను నిర్వహించడం, తెలుగు రచయిత్రుల మహాసభలు నిర్వహించడం, ఉత్తమ రచయిత్రికి బహుమతి ఇవ్వడం వంటి గొప్ప కార్యక్రమాలన్నీ ఒకవత్తు ఏ ఇతర అకాడమీలు చేపట్టని నన్నయాదికవుల పదప్రయోగ కోశాలను మాండలిక వృత్తి పదకోశాలనూ నిర్మించబూనటం మరొక ఎత్తు.

ఈ విధంగా (కొన్ని లోటుపాట్లున్నా) – కొన్ని పరిమితులకు లోబడి తన లక్ష్య సాధనకై సాహిత్య అకాడమి గణనీయమైన కృషి చేసిందని చెప్పక తప్పదు.

## 16 ♦ విశాఖ రచయితల సంఘం :

అంగర సూర్యారావు, మసూనా, బలివాడ కాంతారావు, ఎం. జి. కె. మూర్తి మొదలైనవారు 1949 లో విశాఖ రచయితల సంఘం స్థాపించారు. పేరునుబట్టి ప్రాంతీయ సంస్థగా అనిపించవచ్చుగాని – దేశ విదేశాల్లో ఉన్న చాలామంది రచయితలు ఇందులో సభ్యులుగా వున్నారు. 1953లో రాచకొండ విశ్వనాధశాస్త్రిగారు ఈ సంఘంలో సభ్యులయ్యారు. తర్వాత పురిపండా, అనంతం, కాశీపట్నం రామారావు, ద్రోణప్ప, ప్రసాద్ ప్రభృతులు సభ్యులుగా చేరారు. రోడ్లమీద సాహిత్య సభలు జరిపి సంచలనం తీసుకువచ్చిన విశాఖ రచయితల సంఘం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వాడుక భాషాప్రవేశానికి ఉద్యమస్థాయిలో కృషిచేసింది. 1972లో వేమనపై తపాలాబిళ్ళ ప్రచురించటానికి పాటుపడింది. 1963లో విశాఖ రచయితల సంఘం ఏర్పాటుచేసిన రచయితల సదస్సులో "నేనెందుకు రాస్తున్నాను" అనే అంశంపై చర్చ జరిగింది. ఆ చర్చల సారాంశమే 'నేనెందుకు రాస్తున్నాను?' గా పుస్తకరూపంలో ముద్రితమైంది. రచయితలు మొదటిసారిగా ఆత్మవిమర్శ చేసుకొనే అవకాశాన్ని ఈ సంఘం కల్పించింది. రావి శాస్త్రిగారి సంపాదకత్వంలో "విశాఖ" ద్వైమాసపత్రిక వెలువడేది. తర్వాత సమాచార పత్రికగా, కవితా పత్రికగా – నేటికీ అప్పుడప్పుడు బులెటిన్‌గా వెలువడుతూనే వుంది. 1970 లో విశాఖ పట్నంలో పెద్దఎత్తున శ్రీశ్రీ షష్టిపూర్తి మహోత్సవాన్ని నిర్వహించింది.

## 17. విప్లవ రచయితల సంఘం :

దిగంబర కవుల ఆశయాల నేపథ్యంలో "రైట్ టు ది ఓట్ కాదు ఫైట్ టు ది లాస్ట్" అన్న తిరగబడు కవుల మార్గదర్శకత్వంలో విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది.

---

♦ తెలుగు సాహిత్యంలో కల్లోల క్షీణదశాబ్దాలు – అనంతం (1988) పుట 11, 12.

"పీడితజన పిడికిళ్ళం
నవభారత దూతల
ప్రజల ముద్దు బిడ్డలం
ఎర్రసేన యోధులం
సమరంలో సింహాలం
మా లక్ష్యం జనలక్ష్యం
మా యుద్ధం జనయుద్ధం" (జన నాట్యమండలి పాటలు)

అని భావిస్తూ దిగంబర కవులు, తిరగబడు కవులు, రా.వి. శాస్త్రి, కాళీ పట్నం రామారావు, కె. వి. రమణారెడ్డి, శ్రీశ్రీలు కలిసి 4-7-1970న అల్లూరి సీతారామరాజు జన్మదినోత్సవంనాడు — రాత్రివేళ విప్లవ రచయితల సంఘం స్థాపించారు. 1970లో విశాఖ రచయితల సంఘం జరిపిన శ్రీశ్రీ షష్టిపూర్తి మహోత్సవం ఒక విధంగా విరసం ఆవిర్భావానికి నాంది పలికింది ఆ నాడు కొందరు విశ్వవిద్యాలయ విద్యార్థులు వేసిన "రచయితలకు సవాల్" కరపత్రం రచయితలకు కర్తవ్యాన్ని ప్రబోధించింది. ఇదే విధంగా హైదరాబాదులో 'విప్లవాభిలాషులు' వెలువరించిన కరపత్రంకూడా విరసం ఆవిర్భావానికి తోడ్పడింది. నక్సల్‌బరీ రైతాంగ పోరాటం విరసానికి కొత్త ఊపునిచ్చింది. 'ఝంఝం', 'మార్చ్', 'లే', 'మరోప్రస్థానం' వంటి కవితా సంపుటులు, 'ఇప్పుడు వీస్తున్న గాలి', 'భాగ్గుపొరల్లో' వంటి కథాసంకలనాలు. 'ప్రస్థానం', 'కొమరంభీం', 'నల్లవజ్రం' వంటి నవలలూ. 'అడవి దివిటీలు', 'తూర్పురేఖలు' వంటి నాటకాలు విప్లవ సాహిత్యానికి పుష్టిని చేకూర్చాయి. చెరబండ రాజు, శివసాగర్, వంగపండు, గద్దర్, వరవర రావు, నమ్ముః, విమల వంటి కవులవల్ల రా. వి. శాస్త్రి, కాళీపట్నం రామారావు, అల్లం రాజయ్య. కొడవటిగంటి కుటుంబరావు వంటి కథా, నవలా రచయితలవల్ల, కె. వి. రమణారెడ్డి (విమర్శకులు), చలసాని ప్రసాద్, వి. చెంచయ్యల సారథ్యంవల్ల విప్లవ రచయితల సంఘం పలువురిని ఆకర్షింప జేయకలిగింది, విరసంలో లేకున్నా విప్లవసాహిత్యాన్ని సృష్టించేలా చేసింది.

"సాహిత్యం ఒక ఆయుధ విశేషం. సమగ్రమైన మానవ స్వాతంత్ర్యం వైపు విప్లవ సాహిత్యం జరిపే మహాప్రస్థానమే విప్లవ కవిత్వం. విశ్వ మానవతావాదాన్ని మార్క్సిజం, లెనినిజం, క్రాంతి మార్గంలో ఎలుగెత్తి చాటడం ప్రధాన ధ్యేయం" (విరసం మానిఫెస్టో) అనే ఆశయంతో సాయుధ పోరాటానికి మద్దతుగా సాగుతున్న విప్లవరచ రచయితల సంఘంలో కూడా భేదాభిప్రాయాలు ఏర్పడి చీలికలు ప్రారంభ మయ్యాయి. విరసంకూడా నీరసించిపోయే సూచనలు కనిపిస్తున్నాయి. ♦ అరుణతార, సృజన పత్రికలద్వారా విప్లవ సాహిత్యాభివృద్ధికి కృషిచేస్తున్న విరసానికి జన నాట్యమండలి, ప్రజా నాట్యమండలులు కొండంత అండగా నిలుస్తున్నాయి. జనంలోకి విప్లవ భావాలు ప్రవేశపెట్టే ప్రయత్నంలో విరసం కొంతైనా విజయవంతమైందని చెప్పాల్సి వుంటుంది.

## 18. యువభారతి :

"ప్రాచీనాధునిక సాహిత్యాలను సభలద్వారా ఉపన్యాసాలద్వారా, పుస్తకాలద్వారా ప్రచారంచేసి అందరికీ అందుబాటులోకి తీసుకురావటంలో యువభారతి సంస్థ చేసిన కృషి ప్రజలు ఇంకా మరచిపోలేదు. ప్రాచీన సాహిత్యంమీద ఉపన్యాసాలకి హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్తు వైపు జనం తండోపతండాలుగా తిరణాలకు వెళ్ళినట్లు వెళ్ళటం కళ్ళలో ఇంకా మెదులుతూనే వుంది." ♦ అని చేకూరి రామారావుగారు పలికిన మాటలతో అందరూ ఏకీభవించవలసిందే.

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది" అనే సూక్తి ఊపిరిగా 1964లో యువభారతి వెలిసింది. "మా ప్రయత్నం

♦ 'చేరాతలు' – ఆంధ్రజ్యోతి దినపత్రిక – 19–2–1990.

ఉడుతాభక్తి. ఒడ్డున ఉండి సముద్రాన్ని దాటలేమని అనుకుంటూ ఊరికే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవడంకన్న మనస్సును దిటవుపరచుకొని మేధను పదునుపెట్టి ఉద్యమించడం మేలు. అదే మా ధ్యేయం"♦ అని చెప్పటం కాదు – ఆచరణలో చూపించిన సంస్థ యువభారతి. ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథం, జి. వి. సుబ్రహ్మణ్యం మొదలైన కార్యవర్గంతో యువభారతి రాష్ట్ర, రాష్ట్రేతర సాహితీ ప్రియుల్ని సభ్యులుగా చేసుకోకలిగింది. కావ్యలహరి, కవితాలహరి, నవోదయలహరి వంటి సాహిత్యోపన్యాసాలను ఏర్పాటుచేసి, ఆ ఉపన్యాసాలను పుస్తక రూపంలో ప్రచురించి వాటిని తక్కువధరకు అందించిన యువభారతి సాహితీసేవ ప్రశంసనీయం. కొన్నాళ్ళు "నందిని" సాహిత్య పత్రికను బాగానడిపింది పుస్తక చర్చలతో, గోష్ఠులతో, వనితావిభాగం ఏర్పాటుతో, వారం వారం సమావేశాలతో – క్రమశిక్షణగల సాహితీసంస్థగా సమర్థవంతంగా పని చేసింది యువభారతి.

యువకులలో, వృద్ధులలో, సాహిత్యేతర జీవులలో సాహితీ చైతన్యాన్ని కలిగించి, తెలుగు సాహిత్య ఉపన్యాసాలనుకూడా గంటల తరబడి వినే అలవాటును ఆంధ్రులకు మళ్ళీకల్పించి, సాహిత్యపట్ల గౌరవభావాన్ని కలిగించిన 'యువభారతి'.

## 19. జాతీయ సాహిత్య పరిషత్ :

"నన్ను చూడకు – నా మాట విను, నా పాట పాడు, నా కవిత చదువు" అనేవాడు ఆత్మ ఘాతుకానికి పూనుకున్నవాడే కాగలడు. నేడు మన జీవనరి, మన ఆదర్శానికి మూర్తిమంతమైన ప్రతీకకావాలి. ప్రజల

---

♦ యువభారతి అష్టమ వార్షిక సంచిక (1971) లో "మా గురించి" ఆధారంగా.

నిత్య జీవితంలో నేడు కనిపిస్తున్న దారిద్ర్యం, అసహనం, అజ్ఞానం, అనైక్యం, పరస్పర విద్వేషం, చీలికలు. అహంకారం ఇవన్నీ మానవుని లోని నిమ్నస్థాయికి చెందిన గుణాలు. వీటిని తొలగించి మానవుని సంపూర్ణమానవునిగా రూపొందించడానికి ఈ దేశంలో ఈ జనంలో ఆత్మ విశ్వాసం నింపడానికి ఈ చిరంతన సంస్కృతి ధారలోంచి కర్మమయ జీవనసాఫల్యాన్ని సాధించడానికీ, సాహిత్య క్షేత్రంలో ఉత్తమ భావనా వ్యవసాయం చేయడానికీ, కలం హలంగా ధరించిన అక్షర కృషీవలులు కంకణధారణ చేయాలి. జాతీయ సమష్టిమూర్తి సాక్షాత్కరించాలి. జుగుప్సను, రోతను, క్రోధాన్ని, ద్వేషాన్ని, పరస్పర కలహాలనూ, రక్తపాతాన్ని ప్రజలలో రెచ్చగొట్టేవారు ప్రజలకు స్నేహితులుకారు. ప్రజల మేలు కోరినవారు కారు." అని 8-3-1975లో జాతీయ సాహిత్య పరిషత్ ప్రథమ మహాసభలో అధ్యక్షులు ఆచార్య బి. రామరాజుగారు సంస్థ లక్ష్యాలను, ఆశయాలను సుదీర్ఘంగా వివరించారు. ♦ పరిషత్ చిహ్నంపై "విశ్వశ్రేయః కావ్యమ్" అనే సూక్తి ఉంటుంది. "జాతీయ వైభవమే సాహిత్య ప్రయోజనము" అన్నది ఈ సంస్థ నినాదం. భండారు సదాశివ రావు, కె. వెంకట్రామరాజు, కె, ఘనశ్యామలప్రసాదరావు, కె. సుప్రసన్నాచార్య, ప్రసాదరాయ కులపతి, మన్నవ గిరిధరరావు, జానకీజాని, ముదిగొండ శివప్రసాద్, కందర్ప రామచంద్రరావు, ఎల్దెండ రఘుమా రెడ్డి ప్రభృతులు ప్రధాన కార్యవర్గం.

1947లో ఈ సంస్థ స్థాపింపబడి "సాధన" సాహిత్య పత్రికను నడిపింది. జాతీయాత్మ, జాతీయైక్యత భావాలతో ఏకీభవించే కవుల కవితలతో "అగ్నిగర్భ", "అమృతవృష్టి", "సవిత" మొదలైన సంకలనాలు వెలువరించింది. వివిధ పట్టణాలలో జాతీయ సాహిత్య పరిషత్ శాఖలు ప్రారంభించబడి భారతీయమైన సాహిత్యవ్యాప్తికి తీవ్రమైన కృషిచేస్తు

♦ ఉద్యమ దర్శనం - ముదిగొండ శివప్రసాద్ (1990) పుటలు 448 - 452.

న్నాయి. సాహిత్యంలో హింస, అవినీతి, రావలంబనము, పిడివాదం, సంస్కార విరోధము, వ్యాపారధోరణి – ప్రజలకు హానికలిగించే దుర్వృత్తులని భావిస్తూ ఆ బాటలో సాహితీసేవ చేయడానికి 1985 వరకూ ఉధృతంగా ఉద్యమించింది. మిగిలిన సంస్థల మాదిరి జాతీయ సాహిత్య పరిషత్ కూడా ఈనాడు నామమాత్రంగా ఉంది. ఇప్పుడిది భారతీయ సాహిత్య పరిషత్‌గా మారింది.

## 20. ♦ శ్రీనాధపీఠం :

"కవిసార్వభౌముడైన శ్రీనాధమహాకవి తెలుగు కవిత్వానికి వెలుగులు ప్రసాదించిన మహనీయుడని సాహితీ హృదయుల్నదరూ ఎరుగుదురు. ఆ కవిరాజుపేర ప్రాచీన మహాకవుల సాహిత్య పీఠములను వివిధ ప్రదేశాలలో స్థాపించే రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక ప్రణాళికక్రింద శ్రీనాధ పీఠము గుంటూరులో జిల్లా కలెక్టరు అధ్యక్షతన 1981లో స్థాపించబడింది. శ్రీయుతులు ఎ. చెంగప్ప, ప్రసన్న కుమార్ మహంతి, ఆర్. గోనెల మొదలైన అధికారులు తోడ్పాటుతో డాక్టర్ ప్రసాదరాయకులపతి గారు ఈ సంస్థను విజయవంతంగా నడిపించారు.

సాహిత్య మహారధుల వాణి విలసిల్లగా సారస్వతోపన్యాసాలు సాగాయి. నెలనెలా కవిపండితుల గోష్ఠులు జరిగాయి. భువనవిజయం, ఇంద్రసభ, మయసభ, ఇందిరావిజయమువంటి సాహిత్య రూపకాలు ప్రదర్శించటంలో శ్రీనాధ పీఠానికి సాటిరాగల సంస్థ లేదనిపించుకొన్నది, రాష్ట్రేతర ప్రాంతాలలో కూడా సాహిత్య కార్యక్రమాలను, సాహిత్య రూపక ప్రదర్శనలను నిర్వహించి సాహిత్య కౌముదులను దశదశలా ప్రదర్శింపజేసిన సంస్థ శ్రీనాధపీఠం. 1985 జనవరిలో మూడురోజులు తెలుగు తిరునాళ్ళను వైభవంగానిర్వహించి రసజ్ఞుల ప్రశంసలనందుకొంది ఆ సందర్భంగా మధునాపంతుల, వెంపరాల, కరుణశ్రీ, కొర్లపాటి యస్వీ జోగారావు, స్ఫూర్తిశ్రీ వంటి పండితుల రచనలతో "శ్రీనాధభారతి" గ్రంధాన్ని ప్రచురించింది. దాదాపుగా ప్రాచీన సాహిత్యవ్యాప్తికి అంకితమైన సంస్థ అని చెప్పవచ్చును.

---

♦ శ్రీనాధభారతి ప్రత్యేక సంచిక (1985)లో ప్రసాదరాయ కులపతి గారి – 'శ్రీపీఠిక' ఆధారంగా.

## మరికొన్ని ప్రసిద్ధ సంస్థలు :

కవిసేన : "ఇది కవులపార్టీ. కవి — కవిశిల్పం, కవికీ సమాజానికీ వుండే సంబంధాలు — ఈ రెంటిపై ఈ సంస్థ రూపొందించబడింది. కవిబాధ్యత రాజకీయపర బాధ్యతకంటె గురుతరమైనది. రాజకీయవాది నాయకత్వాన్ని కవిసేన తిరస్కరిస్తుంది" (కవిసేన కరపత్రం-1) అనే ధ్యేయంతో గుంటూరు శేషేంద్రశర్మ పెన్నేముకగా 1975లో 'కవిసేన' ఉదయించింది. అవధాని, దిలావర్, శ్రీరాములు, సువర్ణ, ఎమ్. ఎల్- నరసింహంలతో ప్రారంభమైన 'కవిసేన' ఉద్యమంపట్ల రామాచంద్రమౌళి, మాధవీ సనారా, వనమాలి ప్రభృతులు ఆకర్షితులయ్యారు. కవిసేన మానిఫెస్టో వెలువడి సాహితీలోకంలో సంచలనం కలిగింది. వివిధ నగరాలలో కవిసేన శాఖలు ప్రారంభించబడ్డాయి. "పోస్టర్ కవితలు" అనే ప్రక్రియ ద్వారా యువకవులకి ప్రోత్సాహం ఈయబడింది. ఒక నూతన దృక్పథానికి నాంది పలికినా శేషేంద్ర 'జేబుసంస్థ' కావటంవల్ల నిలబడలేకపోయింది.

## ♦ జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య :

విరసంలోని వ్యక్తిగత హింసావాద సమర్థనను. మార్క్సిజం — లెనినిజం—మావో ఆలోచనావిధానాన్ని తప్పక విశ్వసించాలనే నిబంధననూ వ్యతిరేకిస్తూ దాదాపు 25 మంది విరసంనుంచి విడిపోయి 1978లో తెనాలి వద్దగల నగరం కేంద్రస్థానంగా "జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య"ను స్థాపించారు. కొత్తపల్లి రవిబాబు, రంగనాయకమ్మ, ఓల్గా, నిఖిలేశ్వర్, వాసిరెడ్డి నవీన్ మొదలైనవారి సారథ్యంలో నడిచిన ఈ సంస్థ 25 పుస్త

♦ సమాఖ్య ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు పంపిన 'ప్రణాళిక' ఆధారంగా.

కాలను ప్రచురించటమేకాదు – "ప్రజాసాహితి" పత్రికనుకూడా నడుపు తోంది. ఈ సమాఖ్యలో మళ్ళీ చీలికలు ఏర్పడినా – నేటికీ సామాజిక విప్లవానికి తనవంతు కృషి చేస్తూనే వుంది.

## ప్రజారచయితల సమాఖ్య :

"సాంస్కృతిక రంగంలో విప్లవశక్తులనన్నింటినీ ఐక్యంచేసి బల మైన సాంస్కృతికోద్యమంకోసం కృషి చేస్తుంది. ఈ కృషిలో తమ ప్రాణాలనర్పించి దారిని ఎరుపెక్కించిన కా॥ సుబ్బారావు పాణిగ్రాహి అయన వారసత్వాన్ని ముందుకు తీసుకెళ్ళిన అనేకమంది అమరుల సంస్మ రణలో వారి ఆశయాల్ని ముందుకు తీసుకుపోయేందుకు పునరంకితమవు తుంది. నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేసేందుకు ప్రజా రచయితల సమాఖ్య మున్ముందుకే సాగుతుంది." ♦ అనేలక్ష్యంతో విరసం లోని మితవాద, అతివాద, అవకాశవాదాలకు నిరసనగా ప్రజారచయితల సమాఖ్య 1985లో స్థాపించబడింది. నమ్మి, కానూరు వెంకటేశ్వరరావు, ఎ. నారాయణ, ఎన్. తిర్మల్, తోటా మహదేవ్‌లు ఈ సంస్థ సారధులు. కొన్ని కవితా సంపుటులు ప్రచురించి, సాహిత్యసభలు ఏర్పరచి, 'ప్రగతి' పత్రికను నిర్వహించి ప్రజాకళల అభివృద్ధికి పాటుపడిన ఈ సంస్థ నేడు కుంటుపడింది.

## స్పందన సాహితీ సమాఖ్య :

గుత్తికొండ సుబ్బారావు, జి. వి. పూర్ణచంద్ ప్రభృతులు బంద రులో స్థాపించిన సంస్థ ఇది. 1969లో ఆవిర్భవించిన ఈ సంస్థ బందరులో ఒక దశాబ్దంపాటు సాహిత్య కార్యక్రమాలను ముమ్మరంగా నిర్వహిం చింది. సాహిత్య సంస్థల సమన్వయ సమాఖ్య ఆవిర్భావానికి దోహదం

♦ ప్రజా ర. స. బులెటిన్ – 1 (1985)

చేసింది. సాహిత్య అకాడమీకి అనుబంధ సంస్థగా గుర్తింపబడి అకాడమీని చక్కదిద్దే ప్రయత్నం కొనసాగించింది. రాష్ట్రవ్యాప్తంగా రచయిత్రుల మహాసభలను నిర్వహించింది. 1969 నుంచి నేటివరకు డబ్బాయి పుస్తకాలను ప్రచురించిన ఘనత ఈ సంస్థకే దక్కుతుంది. ఇటీవల ఈ సంస్థ కూడా మూతపడింది.

## ఎఱ్ఱన పీఠం :

1983లో ఎఱ్ఱన కవితాసౌరభం వాడవాడలా గుబాళింపజేయాలనే ఆశయంతో ఆకొండి విశ్వనాథం, ధారా రామనాథశాస్త్రి, కె. వెంకటశివయ్య యస్. భలేరావు మొదలైనవారు ఒంగోలులో "ఎఱ్ఱనపీఠం" నిర్వహించారు. రెండు సంవత్సరాలు మహోత్సాహంగా కొనసాగింది. 'ఎఱ్ఱన సాహిత్యలహరి' రెండు తరంగాలను ప్రామాణికంగా వెలువరించింది. ఎఱ్ఱన సాహిత్యంపై వివిధ అంశాలను ప్రకటించి పోటీలు నిర్వహించి బహుమతులు ప్రకటించి ఎఱ్ఱన సాహిత్యవ్యాప్తికి కృషిచేసింది. ఈ సంస్థ కార్యకలాపాలు నేడు నామమాత్రంగానే జరుగుతున్నాయి.

పైన పేర్కొన్న సంస్థలతోపాటు వరంగల్‌లో "శ్రీలేఖసాహితి". సిద్ధిపేటలో "సాహితీ వికాసమండలి", కడపలో "కడపజిల్లా రచయితల సంఘం", విజయనగరంలో "విజయభావన", నంద్యాలలో "సూరన సారస్వత సంఘం". నెల్లూరులో "వర్ధమాన సమాజం", హైదరాబాదులో ఏ. జి. ఆఫీసువారి "రంజని", "కవి కౌస్తుభ కళాకేంద్రం" మొదలైనవి పేర్కొనదగినవి. 1977లో డా॥ టి. శ్రీరంగస్వామి, ఎన్. శ్రీనివాసస్వామి, బండారు విజయ మొదలైనవాళ్ళు స్థాపించిన 'శ్రీలేఖసాహితి' ఇరవై పుస్తకాలను ప్రచురించింది. అవధానాల నిర్వహణతో, ప్రత్యేక సభల నిర్వహణతో. ప్రత్యేక సంచికల ప్రచురణతో, శిక్షణాశిబిరాలతో. రాయలసీమను సాహితీపరంగా చైతన్యం చేస్తున్న సంస్థ "కడపజిల్లా రచయితల సంఘం." విజయనగరంలో "విజయభావన" సంస్థ క్రమం తప్ప

కుండా నెలనెలా కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉగాదికి విశేష కార్యక్రమాలు నిర్వహించడం విశేషం. కథల పోటీలు, కవితా పోటీలు నిర్వహిస్తూ, బహుమతులు పొందిన కథల్ని, కవితల్ని, ఒక సంపుటిగా ప్రచురించి, వెలుగులోకి తెస్తున్న ఎ. జి. ఆఫీసువారి "రంజని"ని ప్రశంసించాలి. వంశీ రామరాజు హైదరాబాద్‌లో ఒక్కచేతిమీదుగా సాహిత్య కార్యక్రమాలు నిర్వహిస్తూ స్ఫూర్తిని కలిగిస్తున్నారు.

## మరుగునపడిన ప్రసిద్ధ సంస్థలు :

కౌముదీ పరిషత్తు : విజయనగరంలో 1935 అక్టోబరు 4న శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారిచే "కౌముదీ పరిషత్తు" స్థాపించబడింది. మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారి "ఉపనిషద్విహారము"లో సభలు నిర్వహింపబడేవి 'ఘంటసాల గురువుగారైన పట్రాయని సీతారామశాస్త్రిగారు ఈ సంస్థకు తొలి అధ్యక్షులు, తర్వాత శ్రీయుతులు వసంత వెంకటరావు, క్రొవ్విడి రామం, చింతల సన్యాసిరావు ప్రభృతులు ఈ సంస్థని నిర్వహించారు. కౌముదీ పరిషత్తు రజతోత్సవ సంచిక విలువైనదిగా ఎందరో పేర్కొన్నారు. కావ్యాలు ప్రచురించటమే కాకుండా విజయనగరం మహారాజావారి కోటలో రెండు శతావధానాలను నిర్వహించిన సంస్థగా కౌముదీ పరిషత్తు పేరుపొందింది.

సాధనసమితి : హైదరాబాదు సంస్థానంలో తెలుగుభాషా సాహిత్యాల అభివృద్ధికోసం 1939లో ఏర్పడిన సాధనసమితి అభివృద్ధికి నెల్లూరి కేశవస్వామి, భాగి నారాయణమూర్తి, బూర్గుల రంగనాథరావు, వెల్దుర్తి మాణిక్యరావు, జె సూర్యప్రకాశరావు, పిల్లలమర్రి హనుమంతరావు, ప్రభృతులు కృషిచేశారు. సమావేశాలూ, సభలూ, ఆవిష్కరణోత్సవాలే కాకుండా లిఖిత పత్రికనుకూడా నిర్వహించింది. 1955లో నవలా రచనాపోటీ, 1964లో తొలిసారిగా అఖిలాంధ్ర కథానిక పోటీలను నిర్వహించింది. ఇరవై పుస్తకాలను కూడా ప్రచురించింది.

రాయల కళాపరిషత్తు: శ్రీ రావు సాహెబు రొద్దం రాజారావుగారి అధ్యక్షతన 1929లో స్థాపించబడిన "రాయల కళాపరిషత్తు" రాయలసీమలో సాహిత్యోత్సవాలను నిర్వహించి సాహితీచైతన్యాన్ని తీసుకొచ్చింది. గడియారం, రాళ్ళపల్లి, చిలుకూరి నారాయణరావు వంటి వక్తలు పాల్గొన్న ఈ సంస్థ కార్యకలాపాలు ఏలూరు, హిందుపురం, లేపాక్షివంటి ఇతర ప్రదేశాలలోకూడా నిర్వహించబడ్డాయి.

స్నేహలత కవితాసంఘం: తెలంగాణాలో జటప్రోలులో 1928 – 30 ప్రాంతంనాటి ఈసంస్థ శ్రీవాజపేయాజుల శ్రీరామ సుబ్బారాయుడు అధ్వర్యంలో నడిచేది. శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి ఉపాధ్యక్షురాలు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, చెళ్ళపిళ్ళవంటివారి ఉపన్యాసాలను ఏర్పాటు చేయడం ద్వారా. "వైజయంతి" పత్రికా నిర్వహణ,ద్వారా, ముప్పయి గ్రంథాలను ప్రచురించడం ద్వారా ఆనాడు ప్రసిద్ధికెక్కింది.

తెలుగు రచయితల సంఘం (మద్రాసు). చిత్తూరుజిల్లా రచయితల సంఘం (చిత్తూరు), ఆంధ్ర కళాపరిషత్ (తెనాలి), గుంటూరు సాహితి (గుంటూరు), నవ్య కళాసమితి (నరసరావుపేట), సా హి తీ మే ఖ ల (చుండూరు), జ్యోత్స్నా సమితి (గుంటూరు) వంటి సంస్థలెన్నో కొంతకాలం అమితోత్సాహంతో సాహిత్య కార్యక్రమాలు చేపట్టి – ప్రాచుర్యం పొంది – తర్వాత విభిన్న కారణాలవల్ల నశించిపోయాయి. ఇంకా కృష్ణాజిల్లా పామర్రులో "భారతీసమితి", విశాఖపట్నంలో "లలితకళాసమితి", మద్రాసులో "భాషాసేవక సమితి" మొదలైనవి మరుగునపడిన ఒకనాటి ప్రసిద్ధ సంస్థలే,

మూడవ అధ్యాయం

# తూర్పుగోదావరి జిల్లాలో సాహిత్య సంస్థలు

ప్రాచీనమైన ప్రశస్తమైన చరిత్రగల తూర్పుగోదావరి జిల్లా ఆర్ష సంస్కృతికి ఆటపట్టు. వేదవిద్యలకు కాణాచి. సంఘ సంస్కరణ ఉద్యమాలకు పట్టుగొమ్మ. ఆదికవి నన్నయనుండి – ఈనాటి యువకవి అను రాజేంద్రవరకు సాహితీ సరస్సులో వికసించిన కమలాలు ఎన్నెన్నో! ప్రచురణ సంస్థలు అసదంపూర్వమైన సాహితీ సేవచేసాయి.

తూర్పుగోదావరి జిల్లాలో సాహితిపరమైన కార్యక్రమాల ఉధృతి రాజమండ్రి, కాకినాడలలో కనిపిస్తుంది. ఇటీవల అమలాపురం, రాజోలు లలో కూడా సాహితీకార్యక్రమాలు ఎక్కువగా జరుగుతున్నాయి. తూర్పు గోదావరి జిల్లాలో ప్రాచీనమైనవి నవీనమైనవి, మరుగునపడినవి – పడు తున్నవి అన్నీ కలిపి మొత్తం 59 సంస్థలు "రికార్డు" చేయబడ్డాయి. వీటిలో

చాల సంస్థల పుట్టు పూర్వోత్తరాలేకాదు - అనవాళ్ళుకూడాలేవు. వివిధ పత్రికలనుంచి, పెద్దలనుంచి, స్వీయచరిత్రలనుంచి సేకరించిన ఈ 59 సంస్థల పేర్లు ఇవి -

## రాజమండ్రి :

1 సాహిత్య గౌతమి
2 సాహితీ వేదిక
3 జీవనసాహితి
4 వీరేశలింగ పురమందిరం
5 సాహిత్య నందిని
6 హుషార్ క్లబ్
7 శరన్మండలి
8 ఆంధ్ర కేసరి యువజనసమితి
9 ప్రదీప్తి
10 చైతన్య సమితి
11 కళాదర్బార్
12 వాగర్థ సమాఖ్య
13 కళాభారతి
14 విజ్ఞాన గోష్ఠి
15 సారస్వత సమితి
16 భారత సంస్కృతీ మహాసభ
17 నవ్య సాహితీ సమితి
18 జాతీయ సాహిత్య పరిషత్
19 సాహిత్య భారతి
20 ఆంధ్రీకుటీరం (పల్లెపాలెం)
21 కళాభివర్దన్ పరిషత్
22 విద్యాభివర్ధన్ పరిషత్
23 బాలల విజ్ఞానసమితి
24 కవితాసమితి
25 ఆనంద వర్ధని
26 బాలల రచయితల సమితి
27 యోగి వేమన ఫోరమ్
28 స్టడీ సర్కిల్
29 సాహితీ సదనం
30 కళాజ్యోతి
31 సాహిత్య విద్యాభవన్
32 సారస్వత సమాజం

## కాకినాడ :

33 ఆంధ్ర సాహిత్యపరిషత్
34 విశ్వనాథ సాహిత్యపీఠం
35 ఆంధ్ర కళాపరిషత్
36 సాహితీ సమాఖ్య
37 జాతీయ సాహిత్యపరిషత్
38 సాహిత్య కళాపీఠము

39 జాషువాకవి సాహిత్యపీఠము 40 కవితా స్రవంతి

41 తూ॥ గో॥ జిల్లా రచయితల సంఘం _ సాహిత్యలహరి

## అమలాపురం :

42 సాహిత్యసమితి 43 నవశంఖఫలకం

44 సమతారచయితల సంఘం 45 సాహితీ మిత్రమండలి

46 జాతీయసాహిత్యపరిషత్ 47 త్రివేణి

48 దీపిక 49 సాహితీ స్రవంతి (రాజోలు)

50 తరుణ సాహితీ సమితి (ఆలమూరు)

51 కళాకేళి (పిఠాపురం) 52 పిఠాపుర సాహితీ సమ్మేళనం

53 ప్రగతి సాహితీ కళాసమాఖ్య (పెద్దాపురం)

54 విజ్ఞాన సమితి 55 లలితకళాపీఠం (సామర్లకోట)

56 స్నేహసాహితి (రామచంద్రపురం)

57 అభ్యుదయ రచయితల సమాఖ్య (అనపర్తి)

58 స్నేహలత (ఆత్రేయపురం)

59 సాంస్కృతీ సమాఖ్య (కాకినాడ)

ఈ 59 సంస్థలలో దాదాపు సగం రాజమండ్రి నగరానికి చెందినవే. పది సంస్థలతో కాకినాడ ద్వితీయస్థానాన్ని, ఆరు సంస్థలతో అమలాపురం తృతీయస్థానాన్ని సంపాదించుకున్నాయి. మొత్తం 59 సంస్థలలో పేరున్నవి _ ప్రసిద్ధమైనవి దాదాపు 25 సంస్థలుంటాయి. చాలా సంస్థలు మఖలోపుట్టి పుబ్బలో అంతరించిపోయినవే. ఈ సాహిత్యసంస్థల పరిశోధనాసౌలభ్యంకోసం తూర్పుగోదావరి జిల్లాను మూడు "సాహిత్యమండలాలు"గా విభజించటం జరిగింది. **అవి :**

1. రాజమండ్రి మండలం : రాజమండ్రి, ఆలమూరు, ఆత్రేయపురం.
2. కాకినాడ మండలం : కాకినాడ, రామచంద్రపురం, పెద్దాపురం, పిఠాపురం, అనపర్తి
3. కోనసీమ మండలం : అమలాపురం, రాజోలు

ముందుగా రాజమండ్రి సాహిత్యమండలంలోని సాహిత్య సంస్థలను వివరించే ప్రయత్నం చేస్తాను. రాజమండ్రిలోని సాహిత్య సంస్థలను గురించి మున్ముందుగా వివరిస్తాను.

## రాజమండ్రి ప్రాంతంలోని సాహిత్య సంస్థలు

### రాజమండ్రిలోని సంస్థలు :

"కమలాచలాగ్ర మార్కండేయ శివ శిర
శ్శశి చంద్రికాధౌత సౌధవీధి
గోదావరీ పుణ్య కూలంకషాజల
స్ఫారిత శ్రీరుద్ర పాదయుగళి
బలవదభ్యున్నత ప్రాకార పరివేష
గండూషిత బ్రహ్మాండ మండలంబు
గంధ దంతావళ గ్రైవేయ ఘంటికా
ఝంకార ముఖర ఘంటాపథంబు

రాజ బింబాననా నూత్నరత్న పేటి
వీర రాహుత్త సుభట కంఠీరవాద్రి
వేమ భూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్ర విభవంబు రాజమహేంద్రవరము" ♦

♦ శ్రీ భీమేశ్వరపురాణం – శ్రీనాథుడు (1958) 1-43.

అని శ్రీనాథుని నుంచి ఆరుద్రవరకు ఎందరో కవులు ప్రస్తుతించిన రాజమహేంద్రవరం చారిత్రకంగా, సాహితీపరంగా విఖ్యాతికెక్కిన నగరం. ఈ నగరంలోని సాహిత్య సంస్థలను వివరిస్తాను.

## ఆంధ్రకేసరి యువజన సమితి :

'హాస్యబ్రహ్మ' భమిడిపాటి కామేశ్వరరావుగారి జయంతినాడు, ఆయన శిష్యుడు శ్రీ యాతగిరి శ్రీరామనరసింహరావుగారి సంకల్పంతో 30-4-1962 న - కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారిచే "ఆంధ్రకేసరి యువజన సమితి" ప్రారంభించబడింది ♦ ఈ సంస్థ ఆశయాలలో ప్రధానమైనవి -

1. యువకులలో దేశభక్తిని, కళాసాహిత్యాభిలాషలను, సేవా సహకార భావాలనూ పెంపొందించి సంఘశ్రేయస్సుకు పాటుపడునట్లు యువకులను రూపొందించుట.

2. ఆంధ్రకేసరి స్వార్థత్యాగం, కార్యదీక్ష, దేశాభిమానం ఆదర్శంగా కార్యక్రమాలను నిర్వహించుట

3. సాహితీవేత్తల, జాతీయనాయకుల, సంఘసంస్కర్తల జయంత్యుత్సవాలను నిర్వహించుట.

4. వక్తృత్వ వ్యాసరచన, నాటకాదులందు పోటీలు నిర్వహించుట

5. పత్రికలు, గ్రంథములు ప్రచురించుట

---

♦ సంస్థ దశమ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక (1972) ఆధారంగా.

శ్రీ వై. ఎస్. నరసింహారావు, శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ, శ్రీ కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, సన్నిధానం నరసింహశర్మ, అరిపిరాల నారాయణరావు, మైలవరపు సాంబశివరావు, రౌతు సూర్య ప్రకాశరావు, శ్రీమతి టి. నాగమణి మొదలైనవారి సారథ్యంలో ఆంధ్ర కేసరి యువజనసమితి నిర్వహించిన ముఖ్యమైన సాహిత్య కార్యక్రమాలు:

1. రాష్ట్రంలో ప్రప్రథమంగా శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు, ఛార్లెస్ డికెన్సు, కారల్‌మార్క్సుల శత జయంత్యుత్సవాలు నిర్వహించారు, "వేమన త్రిశతి జయంతి" నిర్వహించి పురజనుల మెప్పు పొందారు.

2. శ్రీ పున్నమరాజు నాగేశ్వరరావుగారికి కలిగిన ఆలోచనా ఫలితంగా తొలిసారిగా 1975లో "కవనవిజయం" (నాగభైరవ కోటేశ్వరరావు గారి కవనవిజయంకాదు) అనే కవుల కొలువు ఏర్పాటుచేసింది.

3. 1967, ఏప్రిల్ 16న విక్రమహాలులో జరిగిన శ్రీ కందుకూరి వీరేశ లింగంపంతులు జయంత్యుత్సవం సందర్భంగా ప్రముఖ గాంధేయ వాది శ్రీ వావిళ్ళాల గోపాలకృష్ణయ్య గారిచే "వివేకవర్ధని" త్రైమాస సాహిత్య లిఖిత పత్రికను ఆవిష్కరింపజేశారు.

4. నన్నయ సహస్రాబ్ది ఉత్సవాన్ని వైభవంగా నిర్వహించి ఆ సందర్భంగా "సారమతి" గ్రంథాన్ని ప్రచురించింది.

5. ప్రాచీనగ్రంథమైన సామినేని ముద్దు నరసింహం రచించిన "హిత సూచిని"ని ఆరుద్ర పీఠికతో 132 సంవత్సరాల తర్వాత పునర్ముద్రించారు.

6. రజతోత్సవాల సందర్భంగా "ప్రభవ" సంచికను వెలువరించడమే కాదు – రాజమండ్రిలో దాదాపు అర్థశతాబ్దం తరువాత 'అవధానిచూడా మణి' శ్రీ కడిమిళ్ళ వరప్రసాదు శతావధానయజ్ఞం నిర్వహించింది.

7. విసూత్నమైన హాస్యరచయితల మహాసభలు నిర్వహించింది.

ఆంధ్రకేసరి యువజనసమితి సాహిత్య కార్యక్రమాలతో తృప్తి చెందలేదు. వదాన్యుల సహకారంతో కార్యకర్తల ఉత్సాహంతో పుస్తక ప్రచురణ కూడా చేపట్టింది. సారమతి, 'హితసూచిని', 'ప్రభవ' గ్రంథాలను ప్రచురించడం ఒకఎత్తు. 'వివేకవర్ధని' లిఖిత సాహిత్య పత్రికను నడపటం మరొకఎత్తు. ముందుగా వివేకవర్ధని గురించి తెలుసుకుందాం.

## వివేకవర్ధని :

1874 లో కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ భావాల ప్రచారానికి, సంఘ దురాచారాల నిర్మూలనకు, అభ్యుదయ సాహిత్య వ్యాప్తికి సాధనంగా 'వివేకవర్ధని' పత్రికను ప్రచురించారు. ఆంధ్రకేసరి యువజనసమితి కూడా కందుకూరి జయంతినాడే 16-4-67వ 'వివేకవర్ధని' పేరుతో సాహిత్యలిఖితపత్రిక ప్రారంభించింది. ముందుగా త్రైమాస పత్రికగా నిర్వహించబడింది. వార్షికసంచికలుగా తర్వాత ప్రత్యేక సంచికలుగా, నేటికీ అప్పుడప్పుడు వెలువడుతూనే ఉండటం గమనార్హం. 16-1-69 నుంచి కొంతకాలం ఆంగ్లంలోనూ, హిందీలోనూకూడా ఈపత్రిక వెలువడటం విశేషం. మొట్టమొదటి 'వివేకవర్ధని' సంచికను బహుభాషావేత్తలు శ్రీ ఆర్. ఎమ్. చల్లాగారు ఆవిష్కరించారు. తాడూరి కృష్ణారావు, సింగులూరి బాపిరాజు, చేబోలు శేషగిరిరావు, పున్నమరాజు నాగేశ్వరరావు, డాక్టర్ పి. ఆర్. కృపాసాగర్, సన్నిధానం నరసింహశర్మ మొదలైనవారి సంపాదకత్వంలో ఇప్పటివరకు 'అరవై సంచికలు' వెలువడినాయి.

వివేకవర్ధనిలో అన్నిరకాల సాహితీ రచనలకు స్థానం కల్పించారు. లిఖిత పత్రికయైనా పాతసంచికలలో ప్రామాణికమైన సాహిత్యవ్యాసాలు, మంచికవితలు, బుర్రకథలు, వ్యంగ్యరచనలు, సాంఘిక ప్రయోజనంగల శాస్త్రవ్యాసాలు, చర్చలు చోటుచేసుకొన్నాయి. సంచికలను విశిష్టంగా తీసుకురావటానికి వర్ణచిత్రాలను కూడా పొందుపరిచారు. రచయితల

స్వదస్తూరీతో వ్రాయబడిన కథలు, కవితలు కూడా ఈ పత్రికలో భద్రపరచబడ్డాయి. సాహిత్య సాంఘిక విశేషాలను తెలియజేస్తూ "విశేష వార్తలు" శీర్షిక నిర్వహించారు. ఇతర పత్రికలలో ప్రచురింపబడిన వ్యాసాలతో, కవితలతో ఉత్తమమైన వాటిని ఎన్నికచేసి "వివేకవర్ధని"లో లిఖించేవారు. తిలక్ జయంతి (జూన్ 30), కందుకూరి జయంతి (ఏప్రిల్ 17), రఘుపతి వెంకటరత్నంనాయుడు జయంతి (అక్టోబరు 1), ఆంధ్రకేసరి జయంత్యుత్సవాల సందర్భంగా విశిష్ట సంచికలు వెలువరించడం ముదావహం. ఒక సంచికలో మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారిపై కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన అపురూప పద్యం కనిపిస్తుంది. ఆపద్యం –

"ఒక్కటియున్న నింకొకటి యుండదు నేటి కవీంద్రులందు నీ
టృక్కపులందు సర్వమమరించును దైవము, పాండితీ పరి
స్ఫుక్కమనీయ ధారయు వరిష్టముగా లలిత్వమున్ గడున్
పెక్కవగాఁగనుండిన కవిప్రభు వీయనయంచుఁ జెప్పెదన్"

## సారమతి : (1983)

ఆదికవి నన్నయ్యకు నివాళులర్పించటానికి ఆంధ్రకేసరి యువజన సమితి నన్నయ సహస్రాబ్ది ఉత్సవం నిర్వహించింది. ఆ ఉత్సవం రాజమండ్రిలో కాకుండా రాష్ట్రరాజధాని–హైదరాబాదులో 9–4–1983 న జరుపబడింది. ఆ ఉత్సవంలో సమితి గురజాడ కళాసమితి (ధవళేశ్వరం) వారిచే "నన్నయ భారత రచన" అనే విశిష్ట సాహిత్య రూపకాన్ని ప్రదర్శింపజేసి రసజ్ఞుల ప్రశంసలు పొందింది. అంతేకాదు – ఆసందర్భంగానే "సారమతి" అనే విశిష్ట సంచికను వెలువరించింది.

'సారమతి'లో శ్రీమతి వేదుల మీనాక్షీదేవి, శ్రీ చిట్టావూరి శ్రీరామ శర్మ, శాంతిశ్రీ బొత్సకవి, మధునాపంతుల, కరుటూరి సత్యనారాయణ,

చల్లా రాధాకృష్ణశర్మ, రమణశ్రీల కవితలున్నాయి. నన్నయ గురించి తిక్కననుండి నేటివరకు కొల్చిన 19 మంది ప్రాచీన కవుల పద్యాలు, ఇరవై ఆరుమంది ఆధునికుల పద్యాలు చోటుచేసుకున్నాయి. దోర్బల ప్రభాకరశర్మగారి సంస్కృత కవిత కూడా ఉంది.

జమ్ములమడక మాధవరామశర్మగారి 'నన్నయ్య దర్శనము', డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారి, 'నన్నయ ఆచార్యకము' వంటి సంప్రదాయ సాహిత్య వ్యాసాలతోపాటు 'భారతాన్ని' ఆర్కియా లాజికల్ కళ్ళతోనో, ఆధునిక కళ్ళతోనో చూసేవాళ్ళు సాహిత్య జోహారులు" అంటూ ఈనాటి విశ్లేషణతో కొత్తగా వివరించే వాడ్రేవు చినవీరభద్రుడుగారి "ఎఱుక కలిగించే కవి" వ్యాసంకూడా 'సారమతి' కి విలువనిచ్చింది.

## హితసూచని :

సామినేని ముద్దు నరసింహం రచించిన "హితసూచని" 1862 లో తొలిసారిగా ముద్రించబడింది. వ్యావహారిక భాషాప్రయోగాన్ని-ప్రయోజనాన్ని గిడుగు రామమూర్తి కంటె ముందుగానే గుర్తించి, ఆ వాదాన్ని ప్రారంభించినవాడు సామినేని ముద్దునరసింహం. విద్యా విషయంగా వెనుకబడిన ఆనాటి సమాజంలోగల దురాచారాలను మూఢనమ్మకాలను బట్టబయలు చేసిన గ్రంథం "హితసూచని". అటువంటి చారిత్రికావసరమైన విశిష్ట గ్రంథాన్ని పునర్ముద్రించడానికి ఎందరో ప్రయత్నించారు. అయితే ఆ ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఆ బాధ్యతను ఆంధ్రకేసరి యువజనసమితి చేపట్టి 1986 లో హితసూచనిని పునర్ముద్రించింది. "ఇటువంటి హేతువాద రచనలు సృజనాత్మకరంగంలోకూడా ఇవాళచాలా అవసరం" అని ఆరుద్ర దీనికి ప్రవేశిక రచిస్తూ ఈ గ్రంథం ఆవశ్యకతను వివరించారు.

## ప్రభవ :

5-4-1987 నుంచి 30-4-1987 వరకు ఆంధ్రకేసరి యువజన సమితి రజతోత్సవాలు జరిగాయి. ఆ సందర్భంగా ప్రచురించిన ప్రత్యేక సంచిక "ప్రభవ". మూడువందల పుటలతో సమితి నిర్వహించిన కార్య కలాపాల వివరాలతో, ఆంధ్రకేసరి ప్రకాశంగారిపై వ్యాసాలతోపాటు ఈ క్రింది విలువైన సాహిత్యవ్యాసాలు కూడా ఈ సంచికలో ప్రచురింపబడ్డాయి

"అనుకరణం-రసోపకరణం" – డా॥ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ
"రాజమంద్రి - పరిసరాలు" – అంద్ర శేషగిరిరావు
"భారతము – కావ్యన్యాయము" – డా॥ నందుల గోపాలకృష్ణమూర్తి
"భాగవతము – వాత్సల్యభక్తి" – డా॥ ధూళిపాళ ప్రభాకరకృష్ణమూర్తి
"వివేక చింతామణి – ఒక సమీక్ష" – ఆచార్య జోశ్యుల సూర్యప్రకాశరావు
"వీరేశలింగం వ్యక్తిత్వ పరిశీలన" – మంజుశ్రీ

సర్వశ్రీ మధునాపంతుల, కరుణశ్రీ, ద్వివేది సత్యకవి శతావధానులు, ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ, విశ్వనాథ, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, వంటి కవుల పద్యాలతోపాటు పడాల రామకృష్ణారెడ్డి, పల్లెం పుల్లారెడ్డి, రజనీల ఆధునిక కవితలు కూడా ఉన్నాయి.

'ఆంధ్రకేసరి' టంగుటూరి ప్రకాశంపంతులుగారి 111వ జయంతి సందర్భంగా ప్రచురించిన "కేసరి" సంచిక ప్రకాశంగారి జీవిత వ్యక్తిత్వాలకు సంబంధించినది. ఆరుద్ర, మధునాపంతుల, శ్రీశ్రీల కవితలు మనోహరంగా ఉన్నాయి. ఇది 1983 లో ప్రచురితం.

## జీవన సాహితి:

రాజమహేంద్రవరంలో బహుముఖ ప్రజ్ఞావంతులు శ్రీ ఆర్. ఎం. చల్లా "జీవనసాహితి" సంస్థను ప్రారంభించారు. విభిన్న సిద్ధాంతాలు, దృక్పథాలు, కలిగినవాళ్ళని ఆహ్వానించి ప్రసంగాలు ఏర్పాటు చేయడం' ఉత్తమ సాహిత్య ప్రచారం మొదలైన ఆశయాలతో పురాణపండ శ్రీనివాస్, మోచర్ల సురేష్ అనే ఇద్దరు యువకులు ఈ సంస్థను స్థాపించారు. అనేక సాహిత్య కార్యక్రమాలతోపాటు వీరేశలింగంగారి స్వగృహంలోనే పంతులుగారి 139వ జయంతి సభను నిర్వహించింది.

ఈ సంస్థ 1988లో "జీవనసాహితి" అనే ప్రత్యేక సాహిత్య సంచికను వెలువరించింది. ఓ కవితలో—

"శిశువును మనిషిగా / మనిషిని వ్యక్తిగా
వ్యక్తిని వ్యవస్థగా / తీర్చిదిద్దడం
కవిత్వం చేసేపని" అంటారు. (నగ్నముని)

సోమసుందర్, భైరవయ్య, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, అద్దేపల్లి రామమోహనరావు, మిరియాల రామకృష్ణ, సాధనాల వెంకట స్వామినాయుడు, సతీష్ చందర్, యర్రాప్రగడ రామకృష్ణల కవితలు వైవిధ్యంతో కూడుకొని ఆలోచన రేకెత్తించేలా వున్నాయి. పాలగుమ్మి పద్మరాజుగారి 'నా పాట' కవితను ప్రచురించడం ఒక విశేషం. అలాగే ప్రాచీన సాహిత్య పత్రిక 'ప్రతిభ' నుంచి విశ్వనాథ సత్యనారాయణగారి 'కృత్యాదవస్థ' అనే వ్యాసాన్ని ఈ సంచికలో ప్రచురించడం మరో విశేషం

## సాహిత్య గౌతమి:

1955 – 56 ప్రాంతంలో శ్రీయుతులు పోతుకూచి సూర్యనారాయణమూర్తి, ఉషశ్రీ, కనక్ ప్రవాసి, (చామర్తి కనకయ్య) స్థాపించిన

సంస్థ 'సాహిత్య గౌతమి'. స్థానికులైన మధునాపంతుల, మల్లంపల్లి శర భయ్య వంటివారేకాక స్థానికేతరులైన వేలూరి సుబ్బారావు, మానా ప్రగడ శేషసాయి వంటివారుకూడా ఈ సంస్థలో సభ్యులుగా చేరారు. "సాహిత్య గౌతమి ఏ ఇజాలకు కట్టుబడలేదు. సభ్యత్వ రుసుము లేదు. కార్యక్రమం వుంటే అనాటి ఖర్చులు ఎవరో ఒకరు భరించేవారు. ఎక్కు వగా నేనే భరించేవాడ్ని" అని వ్యవస్థాపకులలో ఒకరైన సూర్యనారాయణ మూర్తిగారు (25-4-88 నాటి ముఖాముఖిలో) తెలిపారు.

ఒక కవిచేత, రచయితచేత స్వీయకవితాపఠనం, స్వీయ రచనల ప్రసంగం ఏర్పాటు చేసిన ఘనత ఈ సంస్థకిపుంది. 1960 లో విశ్వనాథ వారిచే రామాయణ కల్పవృక్షంపై ఉపన్యాసాలను ఏర్పాటుచేశారు. చివరి రోజున విశ్వనాథవారి సన్మానసభలో మధునాపంతుల రచించి కమనియంగా పఠించిన పద్యాలలో ఒకటి-

"ఓయి మహాసరస్వతీ! జయోదయవన్మతి దైవతాంధ్ర భా
షాయుగ బాహువిక్రమ దశాగతియై నెదురీతకొట్టుచున్
బోయెది త్రోవలో నిలువఁబోలదువే? యెవరన్న? సత్యనా
రాయణ! నీవఁటే! శివజటాంత సధాగ్రస నైకధారణా"

ప్రాచీన సాహిత్యంపై మధునాపంతుల, అభ్యుదయ సాహిత్యంపై సోమసుందర్. విప్లవ సాహిత్యంపై జ్వాలాముఖి - వరసగా మూడురోజులు సాహిత్యగౌతమి సభలలో ప్రసంగించడం చెప్పుకోదగిన విషయం. సభ్యుల, రచయితల, గ్రంథాలను ముద్రించడంలో కూడా 'సాహిత్య గౌతమి' ప్రత్యేకతను నిలబెట్టుకుంది. 'కనక్ ప్రవాసి కథలు' 'జమదగ్ని కథలు', 'ఆంధ్ర పురాణం' (రెండవభాగం), కరుటూరి సత్యనారాయణ 'రామాయణకావ్యం' మొదలైన పదిహేను గ్రంథాల్ని ప్రచురించటం ప్రశంసనీయం.

## వీరేశలింగ పురమందిరం: (Veeresalingam Town Hall)

"This Town Hall is Verily the pride of your City, in as much as it is associated with the name of one of the greatest persons of this century. Andhras are proud to claim the great Veeresalingam as one of their own .... .... ...." ♦ అని శ్రీశ్రీ పురమందిరం దర్శించి ఉప్పొంగిపోయారు.

మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారుకూడా "ఈ మహానగర మందలి వీరేశలింగపురమందిరం. ఒకనాడు సారస్వతజ్యోతిని జాజ్వల్యమానమొనరించినది. పురమందిరము పురావైభవమును కొంత స్మృతికిం దెచ్చునటుల కవిజయంతి సదస్సులు వెలార్చుచున్నది" అని ప్రశంసించారు.

ఇంతటి ఉజ్వల చరిత్రగల వీరేశలింగం పురమందిరం రాష్ట్రంలో మొదటి పురమందిరం (TownHall) గా పేర్కొంటారు. 1886 నుంచే వీరేశలింగం పంతులుగారు పురమందిర నిర్మాణానికి ప్రయత్నాలుచేశారు. సొంతడబ్బుతో 1710 చ. గ. స్థలం కొన్నారు. 1890లో సొంతఖర్చుతో ఒకహాలు నిర్మించి 3-12-1897లో రిజిష్టరుచేసి ధర్మకర్తృత్వ సమితి (Trust Board) కి నిర్వహణ బాధ్యతలను అప్పగించిన నిస్వార్థజీవి ఆయన. ♦♦ పంతులుగారు ధర్మకర్తృత్వ సంఘంలో సభ్యులుగా ఉండటానికి అంగీకరించలేదు. ధర్మకర్తృత్వ సంఘంలో తప్పనిసరిగా ఒక న్యాయవాది, ఒక ముస్లిం, ఒక క్రిస్టియన్, ఒక వైశ్యుడు, ఒక అబ్రాహ్మణుడు ఉండాలని నిబంధనలు విధించారు. 'ఆంధ్ర భీష్మ' న్యాపతి సుబ్బారావు పంతులుగారు, చిత్రపు వెంకటాచలం పంతులుగారు, మద్దూరి శివ

---

♦ "Visitor's Book" లో వ్రాసిన అభిప్రాయంనుంచి

♦♦ సంస్థ ప్రచురించిన "Good Friend........" (1982)ఆధారంగా

రామకృష్ణయ్యగారు మొదలైనవారు సమితి అధ్యక్షులుగా ఉన్నారు. 1975 నుంచి శ్రీ యాతగిరి శ్రీరామనరసింహారావుగారు కార్యదర్శిగా వుంటూ పూర్వపు వైభవం పునరుద్ధరించాలని తపన పడుతున్నారు. పోతుల వీరభద్రరావు. బిషప్ కె. విజయరత్నం, జనాబ్ మీర్ ఇక్బాల్ అలీ, కందుల సంజీవరావు మొదలైనవారు సభ్యులుగా సహకరిస్తున్నారు.

వీరేశలింగం పంతులుగారి వర్ధంతినాడు మే 27 న ప్రతి సంవత్సరం పురమందిరంలో కవిసమ్మేళనం నిర్వహించడం ఒక సంప్రదాయం. ఈ సంస్థ తరపున ఒక గ్రంథాలయం, ఒక ఉచితపఠనాలయం నిర్వహింపబడుతున్నాయి, ఈ పురమందిరంలో మధునాపంతుల, దాశరధి, ఆరుద్ర, ఎన్. జి. రంగా, వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీశ్రీ మొదలైన ప్రముఖులు వీరేశలింగంగారి జీవిత సాహిత్యాలపై స్మారకోపన్యాసాలు చేశారు

1982 నుంచి ఈ ప్రాంతం ప్రజలలో సాహిత్యపఠనంపట్ల, పుస్తకాలుకొని చదవటంపట్ల అలవాటు ఏర్పరచడానికి అయిదురోజులపాటు "పుస్తక ప్రదర్శన" ఏర్పాటు చేయడంవల్ల పురమందిరానికి ఖ్యాతి లభించింది. తెలుగు పుస్తకాలతోపాటు వివిధ భాషాసాహిత్య గ్రంథాలుకూడా ఈ ప్రదర్శనలో లభ్యమయ్యే ఏర్పాట్లుచేశారు. పుస్తకప్రదర్శన జరుగుతున్న రోజులలో ప్రతిసాయంత్రం సాంస్కృతిక కార్యక్రమాలతోపాటు సాహిత్య కార్యక్రమాలుకూడా జరుగుతాయి. కవుల జయంతి సభలు, సంస్మరణ సభలు, కవితాపఠనాలు మాత్రమేకాకుండా వ్యాసరచనలోనూ, కవితా రచనలోనూ పోటీలనుకూడా నిర్వహించటం ఆనవాయితీ. అంతే కాదు- ప్రతి సంవత్సరం పుస్తక ప్రదర్శన సమయంలో ఒక ప్రత్యేక సంచిక (Souvenir) ను ప్రచురించటం గమనించదగింది. సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలకు పురమందిరం ఒక వేదికగా నిలుస్తుంది.

## ప్రచురణలు :

వీరేశలింగ పురమందిరం అప్పుడప్పుడు గ్రంథ ప్రచురణకూడా చేపడుతోంది. మొత్తంమీద ప్రత్యేక సంచికలు కలిపి మొత్తం పది ప్రచురణలు చేపట్టింది.

పుస్తకప్రదర్శన సందర్భంగా ప్రచురితమైన ప్రత్యేక సంచికలలో సాహితీవిలువలుగల వ్యాసాలు, కవితలు కూడాలేకపోలేదు. కొన్నిటిని ఉదాహరిస్తాను.

హాస్య తరంగిణి – పానుగంటి సాక్షి : మధునాపంతుల
బళ్ళారి రాఘవ : మిక్కిలినేని
నన్నయశైలి : దేవులపల్లి రామానుజరావు
జానపదకళలు : పడాల రామకృష్ణారెడ్డి
వీరవరుడు (కవిత) : తల్లాప్రగడ విశ్వసుందరమ్మ
పుస్తకములు–రక్తపుంజ
ములు (కవిత) : నాళం కృష్ణారావు

Sri Sri (Essay) : Mallapragada Rama Rao

పురమందిరం నిర్వహించే పుస్తక ప్రదర్శనోత్సవాన్ని ఎనిమిది సంవత్సరాలుగా తిలకిస్తున్న మధునాపంతులవారి-మదిలో కలిగిన సహజ సుందర భావమిది –

"కనుగనుగొమ్మ నన్నుగ టరనంజొనరింపుము లోన లోనన్
మననము చేసికొమ్మని సమస్తవిధంబులం బుస్తకప్రద
ర్శన మొనరించు నీ నగరి రాజమహేంద్రి మహాంధ్ర నందనం
దను సిగవన్నె మీఱుచుం దనర్చు మనోజ్ఞ మయూరపింఛమో"

1990 ప్రత్యేక సంచికలో వెలుగులు : ఈ వ్యాస సంకలనం 1986 లో ప్రచురితమైంది. ప్రసిద్ధ సాహితీవేత్తలు రచించిన ఎనిమిది విశేషవ్యాసాల వివరాలు:

| | | |
|---|---|---|
| కందుకూరి_చిలకమర్తి | : | మధునాపంతుల |
| వీరేశలింగంగారి ప్రహసనాలు | : | సోమసుందర్ |
| యుగకర్త వీరేశలింగంపంతులు | : | అక్కిరాజు రమాపతిరావు |
| వీరేశలింగంగారి నవలలు | | ఆర్. ఎస్. సుదర్శనం |
| కందుకూరి_పానుగంటి | | వరదా బ్రహ్మానందం |
| కందుకూరి నాటకాలపరిశీలన | | సహదేవ సూర్యప్రకాశరావు |
| మహాపురుషుడు_మహాకవి | | ఆరిపిరాల నారాయణరావు |
| వీరేశలింగం సంస్మృతి | | మల్లంపల్లి శరభయ్య |

"ఈ చిన్ని పుస్తకము అష్టదళపద్మము. అందు ప్రతి దళము సాహిత్య సంస్కార సురభిళము. ఆజవ రాజమహేంద్రి పుస్తక ప్రదర్శన సందర్భములో పురమందిర ధర్మకర్తృత్వ సమితి యీ పుస్తకమును వెలువరించుట ముదావహము" అని సమాచారం ప్రాంతీయ పత్రికలో శ్రీ గంధం సీతారామాంజనేయులు సమీక్షించారు.

"ఎంతో ప్రఖ్యాతి వహించిన ఈ పురమందిరంలో ఇన్నాళ్ళకు అడుగుపెట్టకలిగాను. కందుకూరివారు నిర్మించిన మందిరం దర్శించడం కన్న అదృష్టం మరేమంటుంది? నన్నయనుండి నేటిదాకా యెందరో **మహాకవులు, రచయితలు ఉద్భవించిన గౌతమీ తీరంలోని ఈపురం ధన్యం.** ఈ పురమందిరం ధన్యం ♦ అని ప్రశంసించిన డాక్టర్ దాశరధిగారి మాటలు సత్యసన్నిహితాలు.

---

♦ "Visitors Boog" లోంచి

ఆంధ్రీకుటీరం : ♦

"ఆంధ్ర భాషాభివృద్ధియు, నాంధ్రదేశ
భాగ్యవృద్ధియు, నేనాఁడు వడయనగునొ
యప్పుడే యాంధ్రశబ్దమన్వర్థ మగును"

అనే ఆశయంతో కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు 1938లో "ఆంధ్రీకుటీరం" సంస్థను స్థాపించారు.

తూర్పుగోదావరిజిల్లా – కాకినాడ తాలూకాలోగల 'పల్లెపాలెం' గ్రామంలో స్థాపించబడిన ఆంధ్రకుటీరంలో శ్రీయుతులు మధునాపంతుల పేరయ్యశాస్త్రి, మధుమూర్తి, విద్వాన్ పాలెపు వెంకటరత్నం సభ్యులుగా ఉండేవారు. తర్వాత శ్రీ రేమెళ్ళ చిన్నారావు, శ్రీ ఆకొండి సత్యనారాయణశాస్త్రి, శ్రీ పాలంకి వరప్రసాదరావు, శ్రీ పేదుల లక్ష్మణమూర్తి సభ్యులుగా చేరారు. సర్వశ్రీ భూపతిరాజు సూరపరాజు, శ్రీ కొజులూరి అబ్బిరెడ్డిగార్లు "కృపాళసమితి"గా వ్యవహరించేవారు. గ్రామప్రాంతంలో సాహిత్య కార్యక్రమాలకు అంకితమైన విశేష సంస్థ 'ఆంధ్రీకుటీరం'.

1948 జనవరి 13న జరిగిన దశమ వార్షిక సమావేశం తీరుతెన్నులను "దశమవార్షిక ప్రత్యేకసంచిక" ద్వారా తెలుసుకోవచ్చు —

"సభాసమయము మధ్యాహ్నము మూడు గంటలకు సభారంభమునకు ముందే అల్పాహారపు విందు. బోధకునకొక పీఠము — ఎట్టయెదుట వ్యాసపీఠి అమర్పఁబడినవి. వ్యాసపీఠిపై కార్యక్రమానుసారము చదువఁ బోవు రచనలు వరుసగా ఉఞ్చఁబడెను. ఆరంభమునందు అయిదు నిమిషములు నీరవధ్యానము. క్రమశిక్షణకయి బోధకులకు కాలపరిమితి, క్రమాంకములుగల చీటులు ముందే యందింపఁబడెను"

---

♦ మధునాపంతులవారితో 24-4-88 న జరిపిన ముఖాముఖి ఆధారంగా

'సమయపాలన' పాటించుట తెలియని నేటి సంస్థలకు క్రమశిక్షణ గల ఆనాటి సంస్థలకు గల భేదం పై వాక్యాలవల్ల తెలుస్తుంది. సాహిత్య సమావేశాన్ని ఎంత సమర్ధవంతంగా నిర్వహించాలో అవగతమవుతుంది. ఈ విధంగా కార్యక్రమాలు నిర్వహించలేక సాహిత్యసభలు నిర్వహించటం కష్టమనీ, శ్రోతలు రారనీ భావించటం సముచితం కాదుగదా !

ఆంధ్రీకుటీరం 1938 లో మధునాపంతులవారి "తోరణము" అనే లఘుఖండకావ్యం ప్రచురించింది. "ఈ గ్రంథకర్త యువకులు. వీరి రచనలో కుంటినడక యుండదు. చక్కని శయ్య గలదు" అని పీఠికలో విశ్వనాధవారు పేర్కొన్నారు. మధునాపంతులవారి కవితారీతికి ఒకపద్యం—

"నడువఁజాలని యిడుములఁ గుడిచి ఒడలి
చిక్కి జీర్ణించి నిజదేశసేవఁ జేసి
తుదకు స్మరణీయులైన యాంధ్రుల దలంప
గాజుకన్నైన నొక యశ్రుకణము రాల్చు"

1948 లో ఆంధ్రీకుటీరం దశమ వార్షికోత్సవం సందర్భంగా ఒక ప్రత్యేక సంచికను ప్రచురించింది. ఈ దశమ వార్షిక సంచికలో విలక్షణమైన, విలువైన వ్యాసాలు కవితలు ఉన్నాయి. విశ్వనాధవారి రామాయణంలోని పద్యాలు "సుయజ్ఞుడు" శీర్షికన ప్రచురింపబడ్డాయి శ్రీరాముడిలాగా శ్రీనాధుడు ఏకపత్నీవ్రతుడు కాడనీ, దక్షిణనాయకుడనీ చెళ్ళపిళ్ళవారు "శ్రీనాథుడు శ్రీరాముఁడు కాఁడు" అనే వ్యాసంలో వివరించారు. ఇంకా ఇందులో విద్వాన్ పాలెపు వెంకటరత్నం, చిన్నారావు, అల్లంరాజు విశ్వనాధం, ఆకొండి సత్యనారాయణశాస్త్రి మొదలైనవారి రచనలు కనిపిసాయి.

ఆంధ్రశ్రీ కుటీరం పదేళ్ళపాటు మాత్రమే నడిచినా ఉత్తమమైన ప్రామాణికమైన సాహిత్య పత్రిక "ఆంధ్రి"♦ని నిర్వహించటం ప్రశంసాపాత్రం. 1939 ప్రాంతంలో ప్రారంభమైన ఈ పత్రికకి మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు, విద్వాన్ పాలెపు వెంకటరత్నంగారు సంపాదకులుగా ఉండేవారు. అనాడు ప్రసిద్ధులైన పండితుల, కవుల రచనలు ఇందులో కనబడతాయి. వ్యావహారికంలోకూడా రచనలు ప్రచురించటం ఈ పత్రిక విశేషాంశాలు. మధునాపంతులవారు 'ఉభయభారతి', 'తెలుగుబిడ్డడు' అనే కలంపేర్లతో రచనలు చేసేవారు. మధునాపంతులవారి గొప్పగ్రంథం "ఆంధ్ర రచయితలు" ముందుగా ఆంధ్ర పత్రికలో ప్రచురితమైన వ్యాసాలే.

## సాహితీవేదిక :

సాహితీవేదిక 1980లో డిశంబరు 25 – క్రిస్టమస్ పర్వదినాన ప్రారంభమైంది.♦♦ మొదట్లో సి. వి. ఎస్. మహేష్, వాడ్రేవు చినవీరభద్రుడు, గంధం నాగసుబ్రహ్మణ్యం, కపులూరి గోపీచంద్, చాగంటి శరత్‌బాబులు "Young Writers Association" గా స్థాపించారు. తర్వాత సాహితీవేదికగా మార్చారు. అప్పుడు శ్రీ ఆర్. యస్. సుదర్శనం మల్లంపల్లి శరభయ్య, క్రొవ్విడి లింగరాజు, ఆర్. ఎస్. వసుంధరాదేవి, పోతుకూచి సూర్యనారాయణమూర్తిగార్లు సంస్థ నిర్వహణలో భాగస్వాములయ్యారు. సాహితీవేదికలో దాదాపు నలభై మంది సభ్యులుండేవారు. చాలా మంది రచయితలు, కవులు, మల్లాప్రగడ రామారావు, కల్లూరి భాస్కర్,

♦ ద్వా. నా. శాస్త్రి రచించిన "వాఙ్మయ లహరి" వ్యాస సంపుటిలో 'ఆంధ్రి' గురించి విపులంగా వుంది.

♦♦ ఈ వివరాలు అందించినవారు – శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తిగారు

పున్నమరాజు నాగేశ్వరరావు, కొప్పర్తి, యర్రాప్రెగడ రామకృష్ణ, సాధనాల వెంకటస్వామినాయుడు వంటి యువకులతోపాటు మధిర భానుమూర్తి ఎం. వి. నారాయణాచార్య వంటి పెద్దవారుకూడా సంస్థలో సభ్యులుగా ఉండేవారు.

ఈ సాహితీవేదిక ఆశయాలు ఇవి— ♦

1 సాహిత్యం జీవితంలాంటిది. జీవితంపట్ల ఉన్నట్టే సాహిత్యం పట్లకూడా భిన్నదృక్పథాలున్నవి. వివిధ దృక్పథాలకు, ధోరణులకు వేదిక "సాహితీవేదిక".

2 జీవితంనుంచి పొందిన ప్రేరణను రచనగా మలచడంలో రచయితకు ప్రోత్సాహాన్ని, సహకారాన్ని అందివ్వడం "సాహితీవేదిక" ఉద్దేశం. ఇందుకుగాను ప్రతినెలా సభ్యుల స్వీయ రచనా పఠనాన్ని నిర్వహిస్తోంది.

3 ప్రసిద్ధ రచనలను పాతవైనా క్రొత్తవైనా ప్రత్యేకఅభిమాన దురభిమానాలు లేకుండా వాటిని పరిశీలించి, విమర్శించి ఒకరి అభిప్రాయం మరొకరు తెలుసుకోవడం 'సాహితీవేదిక' చేస్తున్న మరోపని.

4 ప్రస్తుత సాహిత్య స్వరూపాన్ని అర్థంచేసుకోవడానికీ, సాహితీ సృష్టికీకూడా పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలతో పరిచయం అవసరమన్న ఉద్దేశంతో ఆయా విషయాలలో నిష్ణాతులచే ప్రసంగాలు ఏర్పాటు చేస్తుంది.

5 సభ్యుల రచనల్ని ప్రచురిస్తుంది

♦ 'కథాగౌతమి' (1982) ముందుమాటలో

సాహితీవేదిక 1 కథావేదిక (1981), 2 కథాసాలమి (1982) 3 కవితావేదిక (1983), 4 ఆర్కెస్ట్రా (1985) అనే గ్రంథాలు ప్రచురించింది. కథా సంపుటాలలోని కథలన్నీ వాస్తవ జీవిత చిత్రీకరణలే. వ్యాపారధోరణిగల కథ ఒక్కటికూడా లేకపోవడం ప్రచురణ కర్తల చిత్తశుద్ధికి నిదర్శనం జీవితాన్ని అర్థంచేసుకొనేందుకు దోహదపడే కథలు ఇవి – అనటం స్వభావోక్త అవుతుంది. 'కవితావేదిక' లో ప్రాచీన, ఆధునిక కవులు ముప్పయి ఆరుమంది పద్య, వచనకవితను రాశారు. ఈనాడు గుర్తింపు పొందిన కొప్పర్తి, వాడ్రేవు చినవీరభద్రుడు వంటి కవులు ఈ సంపుటిలో కనిపిస్తారు. 'ఆర్కెస్ట్రా' అనే కవితా సంపుటిలో సాహితీవేదిక సభ్యులతోపాటు సభ్యులుకానివారి కవితలుకూడా చోటుచేసుకున్నాయి. ఎమ్. ఎస్. సూర్యనారాయణ, వసేరా వంటి మంచి కవుల కవితలు ఇందులో వున్నాయి.

''పాఠం ఒప్పచెప్పకపోతే పెళ్ళిచేస్తానని
పంతులుగారన్నప్పుడే భయమేసింది
ఆఫీసులో నామొగుడున్నాడు
అవసరమొచ్చినా సెలవివ్వడని
అన్నయ్య అన్నప్పుడే అనుమానమేసింది.

అనే 'సావిత్రి' కవిత ఈనాడు గొప్ప స్త్రీవాదకవితగా సుపరిచితమే. ఈ కవితను తొలిసారిగా 'ఆర్కెస్ట్రా' లో ప్రచురించిన కీర్తి ''సాహితీవేదిక''కి దక్కుతుంది.

''నియతిని కురిసిన హిమ సమూహములు'' శీర్షికతో పూర్వప్రచురణలను చదివించే మంచి కార్యక్రమాన్ని కొన్నాళ్ళు కొనసాగించడం విశేషంగా చెప్పుకోవాలి. ఇటువంటి మంచి సంస్థ నేడు నామమాత్రంగాఉండిపోవటం శోచనీయం.

## హ్యూమర్ క్లబ్ :

1935లో హ్యూమర్ క్లబ్ స్థాపించబడినా 1950 నుంచే సారస్వత సేవ చెయ్యటం ప్రారంభించిందని వ్యవస్థాపకులలో ఒకరైన విద్వాన్ బులుసు సీతారామ శాస్త్రిగారు పేర్కొన్నారు. శాస్త్రిగారితోపాటు వసురాయ కవిగారి మేనల్లుడైన వద్దిపర్తి లక్ష్మీనారాయణ, అవసరాల కామరాజు, మునిరాజు, వేలూరి వెంకటేశ్వరశర్మ, సి. ఎన్. ఆచార్యులు, మాచిరాజు రామకృష్ణారావు సాహిత్య కార్యక్రమాల్ని నిర్వహించేవారు. సాహిత్య గోష్ఠులు, జయంత్యుత్సవాలతోపాటు 6-11-1977న హ్యూమర్ క్లబ్ద్వారా "సమాలోచన" అనే సాహిత్య పత్రికను ప్రచురించటం ప్రారంభమైంది. కొన్నాళ్ళ తర్వాత సభ్యుల సహకారం లేకపోవటంవల్ల బులుసు సీతారామ సీతారామశాస్త్రిగారే సొంతంగా "బి. వి. అండ్ కో. ప్రెస్" స్థాపించి 'చేతిచమురు భాగోతం'గా సమాలోచనను నిర్విఘ్నంగా నడిపారు. (శాస్త్రి గారి మరణానంతరం కూడా సమాలోచన వెలువడుతుండటం ప్రశంసించ దగినది.)

## సాహిత్య భారతి :

సి. ఎస్. శర్మగారు, కప్పగంతుల మల్లికార్జునరావుగారు, పోతు కూచి సూర్యనారాయణమూర్తిగారు కలిసి 1-1-1971లో "సాహిత్య భారతి" ని స్థాపించారు. తన్నీరు బుల్లెయ్యగారి సహకారం ఈ సంస్థకి లభించింది. అయిదేళ్ళు మాత్రమే నడిచిన ఈ సంస్థ చేపట్టిన విశిష్టకార్య క్రమాలలో మూడు పేర్కొనదగినవి.

1 1960-70 లలో వచ్చిన నాటకాలలో "నాకు వచ్చిన నాటకం" పై చర్చ నిర్వహించటం

2 16-3-1971న, 15-8-71న బహుభాషా కవి సమ్మేళనాలు నిర్వహించటం. రాజమండ్రిలో మొదటిసారిగా తెలుగు, సంస్కృతం, జర్మన్,

ఆంగ్ల, హిందీ, ఉర్దూ, సింధి, మలయాళం, తమిళం, రాజస్థానీ, మరాఠీ, కన్నడం, గుజరాతీ, పంజాబీ, బెంగాలీభాషల్లో కవితాపఠనం జరిగింది.

3 "చరిత్ర – సంస్కృతి–సాహిత్యం" – ఇవి పరస్పరాశ్రితాలని గుర్తించి ప్రతిఏటా ఒకచరిత్ర పరిశోధకుని సన్మానిస్తూ "గురుపూజా మహోత్సవం" నిర్వహించటం

## శరన్మండలి :

"శారద రాత్రులుజ్జ్వల ... ..." అనే నన్నయపద్యం సుపరిచితమే. శరదృతువులోనే నన్నయ జననమరణాలు జరిగి ఉంటాయని మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు అభిప్రాయపడ్డారు. అందుకని నన్నయ్య కవితాప్రచారం, నన్నయ సంస్మరణ ధ్యేయాలుగా 'శరన్మండలి' సంస్థ ప్రారంభమైంది. మధునాపంతులవారు సారధిగా 1978లో స్థాపించబడిన ఈ సంస్థలో శ్రీయుతులు వై. ఎస్. నరసింహారావు, కరుటూరి సత్యనారాయణ, సన్నిధానం నరశింహశర్మ, ఎమ్. వి. చలపతి, పున్నమరాజు నాగేశ్వరరావులు సభ్యులు. ప్రతి సంవత్సరం కార్తీక శుద్ధ పౌర్ణమినాడు నన్నయ జయంతిని నిర్వహిస్తూ సాహితీవేత్తలచే నన్నయపై ఉపన్యాస కార్యక్రమాలు ఏర్పాటుచేయడం ఈ సంస్థ ఆశయం. మధునాపంతులవారు కీర్తి శేషులైన తరువాతకూడా శరన్మండలి నన్నయ జయంతిని నిర్వహిస్తూనే వుంది.

## చైతన్య వేదిక:

ప్రజాసాహిత్యాన్ని, కళల్ని పోషిస్తూ హేతువాద దృక్పథాన్ని వ్యాప్తిచేస్తూ స్త్రీ, పురుష సమానత్వాన్ని కోరుతూ 1986లో "చైతన్య వేదిక" ఏర్పడింది. శ్రీయుతులు కె. ఎన్. వెస్లి, సతీష్‌చందర్, పద్మ మొదలైనవాళ్ళు నిర్వాహకులు. ప్రగతిశీల సాహిత్యాన్ని ప్రచారంచేసే

సభలు, గోష్ఠులూ నిర్వహిస్తూ కొంతకాలం 'రచన' అనే సాహిత్య మాస పత్రికను కూడా వెలువరించింది. ఇందులో "ఎండకు ఎండి వానకు తడిసే మనుషుల గుండెగొంతుకలను వినిపించే కవితలూ, జనం వూపిరినే ప్రాణం పోసుకున్న కథలూ, అనుభవం, ఆలోచన, శాస్త్రీయ పరిశీలనలో పుట్టు కొచ్చే ప్రత్యేక వ్యాసాలూ కనపడతాయి. ఒక విధంగా దళితస్పృహ ఎక్కువగాగల సాహిత్య పత్రికగా పేర్కొనవచ్చు.

## తెలుగు సాహిత్య సమితి:

1978లో జర్నలిస్ట్ శ్రీ కొండ్రు శ్యామ్‌చంద్ "తెలుగు సాహిత్య సమితి"ని స్థాపించారు. శ్రీయుతులు చేబోలు చిన్నయబ్రహ్మకవి, కె. ప్రభాకరరావు, కె. విజయభాస్కరరావులు కార్యవర్గ సభ్యులు. ప్రతి ఏటా జాషువా జయంతిని జరపటం ఈ సంస్థ ముఖ్యలక్ష్యం. 1978లోనే "తమ్మృత్యంజలి" అనే చిన్న కవితాసంపుటిని ప్రచురించింది. ఇందులో విశ్వనాథ సత్యనారాయణగారు జాషువాగురించి రాసిని చిన్నవ్యాసం ఎంతో విలువైనది. కొన్ని పంక్తులు పరికించండి –

"నేను మంచములో పడియుండగా శ్రీ జాషువా మృతివార్త నాకు తెలిసినది. నాకు వచ్చిన దుఃఖము నేను చెపితే ఎవరు నమ్మరు. ఈ దేశములో హృదయము ప్రధానముకాదు. దొంగమాటలు, ప్రచారము ప్రధానమైనవి.

ఆతనికీ నాకూ కలిసి పద్మభూషణ వచ్చినది. నేనది పుచ్చుకొనే టందుకు ఢిల్లీ వెళ్ళాను. జాషువా రాలేదని నేను ఎంత అనుకున్నానో అక్కడి నా స్నేహితులకు తెలుసు.

ఒకసారి ఆయన నాతో అన్నాడుకదా – అందరు బ్రాహ్మణులూ నీవంటి వాళ్ళయితే నాకు బ్రాహ్మణులతో విరోధంలేదు. మనసులో నిది దాచవు ప్రత్యక్షంగా చెప్తావు. నీకు ఈర్ష్య, అసూయ లేవు. ఎదుటివాడి

మేలు ఓరుస్తావు. నీవు ఎంతమందో హరిజనులకు స హా య ం చేసావు. తక్కినవారందరూ దొంగలు – అని.”

ఈ ఒక్క వ్యాసాన్ని 'స్మృత్యంజలి'లో ప్రచురించటంవల్ల ఒక చారిత్రక సత్యాన్ని అక్షరబద్ధంచేసిన సంస్థగా ప్రశస్తికెక్కినది.

## కళాదర్బార్ :

లోలుగు అప్పాజీగారి అధ్యక్షతన 1965 నుంచి "కళాదర్బార్" సంస్థ నిర్విఘ్నంగా కొనసాగుతోంది. సంగీత, సాహిత్య, నృత్య, నాటక కార్యక్రమాలను నిర్వహిస్తూ కవితల, కథల పోటీలు ప్రత్యేక జయంత్యుత్సవాలు నిర్వహించడం చెప్పుకోదగిన అంశం. "కళాదర్బార్" పేరుతో అప్పుడప్పుడు పత్రికకూడా వెలువడుతూ వుంటుంది. తాపీ ధర్మారావు శతజయంతి సంచికను తప్పక పేర్కొవాలి. రాష్ట్రస్థాయి కవితలపోటీలో నేటి ప్రసిద్ధ కవయిత్రి కొండేపూడి నిర్మల 1988లో ఉత్తమ కవితకు బంగారు పతకం పొందింది. ఆ కవితపేరు "క్విక్ మెయిల్ సర్వీసు"

రాజమండ్రిలో పైన పేర్కొన్న సంస్థలే కాకుండా ఒ క నా డు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు సొంతఖర్చుతో 'కళాభివర్ధనీ పరిషత్'ను నడిపేవారట. శ్రీపాదవారు సభలు నిర్వహించే సభలపై శిష్ట్యాన్ని ఇంద్రగంటివారు "గౌతమీ గాథలు"లో కళ్ళకు కట్టించారు. ఇంకా సారస్వత సమితి, భారత సంస్కృతీ మహాసభ, విద్యాభివర్ధనీపరిషత్, నవ్యసాహితీ సమితి మొదలైనవి ఉన్నట్టు వినికిడి.

6–6–1944 నాటి త్రి లి ం గ వారపత్రిక ఆధారంగా 1943లో 'రాజమండ్రి సోదరసమితి' ఉన్నట్టు తెలుస్తోంది. ఒకసభకి దేవులపల్లి అధ్యక్షత వహించగా, తల్లావఝ్ఝల, పిలకా గణపతిశాస్త్రి, వి ం జ మూ రి సోదరీమణులు పాల్గొనటమేకాకుండా 'శోభిని' అనే పత్రిక ఆవిష్కరింపబడిందట. శ్రీ కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, సన్నిధానం శర్మగారు

'వాగర్థ సమాఖ్య" అనే సంస్థను కొన్నాళ్ళు నడిపారు. ఆచార్య సి. నారాయణరెడ్డిగారి గజల్స్ గాన కార్యక్రమాన్ని ఏర్పాటు చేయడం ఈ సంస్థ విశిష్టత. పాత సమాచార పత్రికలు పరిశీలిస్తే సాహితీసదనం, కవితా సమితి, విజ్ఞానగోష్ఠి, ఆనందసాహితి, కళాభారతి, ప్రదీప్తి మొదలైన సంస్థ లున్నట్టుగా తెలుస్తుంది.

## రాజమండ్రి ప్రాంతానికి సంబంధించిన సాహితీసంస్థలు :

రాజమండ్రి ప్రాంతానికి సంబంధించిన సాహితీ సంస్థలలో ప్రసిద్ధ మైనవి రెండు ఉన్నాయి. ఒకటి_ ఆలమూరులోని 'తరుణ సాహితీసమితి' రెండవది ఆత్రేయపురంలోని 'స్నేహలత'. వీటిలో ప్రాచీనమైనది ప్రచుర మైనది ఆలమూరులోని —

## తరుణ సాహితీసమితి :

తరుణ సాహితి ఆధ్వర్యంలో ఎన్ని సారస్వత గోష్ఠులు! ఎన్ని సాహిత్య సమావేశాలు! ఆ రోజుల్లో పండగ వస్తేచాలు జనార్ధనస్వామి ఆలయంలో జమ్మలమడక, జంధ్యాల, నండూరి, ఇంద్రగంటి, వేదులం మధునాపంతుల, పురిపండా, శ్రీరంగం నారాయణబాబు_ ఒకరేమిటి, ప్రసిద్ధులైనవారిలో ఎవరోఒకరి ఉపన్యాసం ఉండవలసిందే. సభ ఏర్పాటు చేయడం, పండగపేకాట వేసుక్కూచునే ఊరిపెద్దల్ని పేకాట మానిపించి సాహితీసభకి తీసుకువచ్చి కూర్చోపెట్టడం, ఊళ్ళో పేకాట హడావిడితగ్గి నాలుగైదేళ్ళయేసరికి సాహితీసంరంభం పెరిగింది. సమితి కార్యకలాపా లకు లంకంత కొంపని ఉచితంగా వాడుకోమన్నాడు మిత్రుడు నరసింహ దేవర పేరిశాస్త్రి (రంగయ్య). అక్కడ చిర్రావూరి సుబ్రహ్మణ్యంగారితో కలిసి 'సూర్యోదయం' నాటకరచన సాగించాడు ఉషశ్రీ. ఇవాళ దేశంలో

ప్రసలితంగా వున్న భువనవిజయ కార్యక్రమానికి రూపకల్పన చేశాడు.♦ అని వ్యవస్థాపకులలో ఒకరైన శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి గారు పలికిన మాటలు – "తరుణసాహితీ సమితి" ఆ రోజుల్లో అలమూరు వంటి గ్రామంలో ఎంత సాహితీ సంచలనం కలిగించిందో సాక్ష్యం చెపుతున్నాయి.

ఉషశ్రీగా పేరొందిన పురాణపండ సూర్యప్రకాశ దీక్షితులు, కనక్ ప్రవాసి అనబడే చామర్తి కనకయ్య, పోలాప్రగడ సత్యనారాయణమూర్తి ఈ ముగ్గురూ విద్యార్థులుగా ఉన్నప్పుడు అలమూరుతో 15–9–1948 – స్వాతంత్ర్య దినోత్సవ సుముహూర్తాన "తరుణ సాహితీసమితి" సంస్థను ప్రారంభించారు.♦♦ దాదాపు పదిహేను సంవత్సరాలు అలమూరులో సాహిత్యసభలు, కవిసమ్మేళనాలు విజయవంతంగా నిర్వహించింది. కొంత ప్రాచుర్యం పొందగానే ఈ సంస్థను రాష్ట్రవ్యాప్తంగా విస్తృతపరచాలనే సంకల్పంతో అన్ని ప్రాంతాలకు చెందిన వందమంది సాహితీవేత్తలను, సాహితీప్రియులను సభ్యులుగా చేర్చుకొని ఈ క్రింది కార్యవర్గాన్ని ఏర్పాటు చేసుకోవటం జరిగింది.

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి–రాజమండ్రి |
| ఉపాధ్యక్షులు | : | ఉషశ్రీ – విజయవాడ |
| | | కె. కె. రామానుజాచార్యులు – రేణిగుంట |
| కార్యదర్శి | : | పోలాప్రగడ సత్యనారాయణమూర్తి – బాపట్ల |
| సంయుక్త కార్యదర్శి | : | చామర్తి కనకయ్య – రాజమండ్రి |

♦ ఉషశ్రీ షష్టిపూర్తి సన్మానసంచిక (1988)–ఉషస్సుషమ(వ్యాసం) పుట 40–41.

♦♦ పోలాప్రగడవారి లేఖ ఆధారంగా

కార్యనిర్వాహకవర్గంలో శ్రీయుతులు కొండముది శ్రీరామచంద్ర మూర్తి (ఏలూరు), డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు (బాపట్ల), ద్విభాషి వెంకటరామశాస్త్రి (నరసరావుపేట), కె. వి. సత్యనారాయణాచార్యులు (బాపట్ల), శ్రీమతి పోలాప్రగడ రాజ్యలక్ష్మి (బాపట్ల) నేమాని సీతా రామయ్య (బాపట్ల) సభ్యులుగా ఉండేవారు.

ఈ సంస్థ ఆంధ్రదేశంలో తొలిసారిగా "భువనవిజయం" సాహిత్య రూపకాన్ని రూపకల్పనచేసి 1952లో ఆలమూరు దగ్గరగల చింతలూరు గ్రామంలో ప్రదర్శించింది. ఆనాటి 'భువనవిజయం'లో పాల్గొన్న అష్ట దిగ్గజ కవుల పాత్రధారులు వీరు –

విశ్వనాథ సత్యనారాయణగారు
మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు
జమ్మలమడక మాధవరామ శర్మగారు
జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు
నార్ల చిరంజీవి
శ్రీరంగం నారాయణబాబు
ఆకొండి సూర్యనారాయణ

శ్రీకృష్ణదేవరాయల పాత్రలేని ఆ రూపకానికి ఉషశ్రీ వ్యాఖ్యాతకాగా దర్శ కత్వం పోలాప్రగడవారిది. ఈ రూపక ప్రదర్శనకు లభించిన అఖండ ప్రజాదరణచూసి జమ్మలమడకవారు శ్రీకృష్ణదేవరాయలు, అప్పాజీ పాత్ర లను 1953లో విజయవాడ ఆకాశవాణిలో ప్రసారం చేయించారు. అప్పటి నుంచే ఆంధ్ర దేశంలో 'భువనవిజయం' ఊరూరా ప్రచారం పొందింది.

తరుణ సాహితీసమితి మరొక విశిష్టమైనపని చేపట్టింది. ఒక కవి పేరుమీదుగా ఒక ప్రత్యేక సంచికను ప్రచురించే సాంప్రదాయానికి ఈ

సమితి శ్రీకారం చుట్టింది అని చెప్పవచ్చు. సంస్థ ప్రచురించే 'విశ్వశ్రీ' పత్రికకు ఉషశ్రీ సంపాదకులుగా ఉండేవారు. విశ్వనాథ సత్యనారాయణ గారిపై ప్రచురించిన 'విశ్వశ్రీ' ప్రత్యేక సంచికకు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు సంపాదకులుగా వ్యవహరించారు. ఈ సంచికలో విశ్వనాథ వారిపై జీవిత సాహిత్యాలను విశ్లేషించే వ్యాసాలు, కవితలు ప్రచురితమై విశ్వనాథవారి విశ్వరూపాన్ని రేఖామాత్రంగా ప్రదర్శించటం జరిగింది. తరుణ సాహితీసమితి ప్రచురించిన రచనలుపదమూడు వరకు ఉన్నాయి.

ఈ పుస్తకాల ప్రచురణతో సంస్థ నిర్వాహకులు సంతృప్తిచెందలేదు "తెలుగు రచయితలకి కొదవలేదు. ప్రచురణ కే అవకాశంలేదు" అని భావించి, రచయితల పుస్తకాలను ప్రచురించాలనే సదుద్దేశంతో తరుణ సాహితికి అనుబంధంగా—"రసప్రప"♦ అనే ప్రచురణసంస్థను స్థాపించారు రచయితల పుస్తకాలను ప్రచురించి, నండూరి రామకృష్ణమాచార్యులు, ఇంద్రగంటి ప్రభృతుల సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకొచ్చిన సంస్థఇది ఈ పుస్తకాలను విక్రయించగా వచ్చిన సొమ్ములో ఖర్చులుమాత్రం తీసు కొని లాభాన్ని అయా రచయితలకు ఇవ్వటం తరుణ సాహితీసమితి గొప్ప దనానికి చిహ్నపకాత.

1955 నుంచి సాహిత్య అకాడమీ స్థాపనకోసం వ్యాసాలద్వారా, సభలద్వారా, కరపత్రాలద్వారా ఉద్యమించిన సంస్థఇది. అకాడమీ స్థాపించిన తర్వాత అందులో సభ్యత్వం పొంది అకాడమీ అభివృద్ధికి తోడ్పాటు అందించింది. విశ్వనాథవారికి బాపట్లలో మొదటిసారిగా పౌరసన్మానం చేసింది తరుణసాహితేనని చెప్పుకుంటారు. ఈ సంస్థద్వారా సభ్యులందరూ సాహిత్యారాధకుల్రయ్యారు. కొందరు ప్రసిద్ధ రచయితలుగా, కథకులుగా ఖ్యాతి చెందారు. బాపట్లలో సాహితీపతాకను ఎగురవేసిన సంస్థఇది. ఈ సంస్థవలన ఉషశ్రీ కవిగా, కథకుడిగా నవలారచయితగా, రూపకస్రష్టగా

♦ రచయితల సహకార ప్రచురణల పరిషత్ — 'రసప్రప' కావచ్చును

దర్శనమిస్తారు. ఒక మారుమూల గ్రామంలోపుట్టి–అపూర్వ కార్యక్రమాలను చేపట్టి – దాదాపు ఇరవై ఆరు పుస్తకాలను ప్రచురించి – రాష్ట్రస్థాయికి ఎదిగిన "తరుణసాహితీసమితి" పుట్టుకకు గల నేపధ్యం తెలుసుకోదగినది.♦

"శ్రీ శాస్త్రిగారు (ఇంద్రగంటివారు) అధ్యాపకవృత్తిలో ఆదర్శప్రాయులు. రచనాపరమైన ఉపన్యాసరూపమైన వీరి శిక్షణలో ఎందరో విద్యార్థులు తయారయ్యారు. వీరిలో యర్రమిల్లి శ్రీరామశాస్త్రి, ఉషశ్రీ, పోలాప్రగడ మున్నగువారు పేర్కొనదగినవారు. ఆచట (రామచంద్రపురంలో) పనిచేస్తున్నప్పుడు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'తరుణబ్రహ్మసమాజము'చే ప్రభావితులైన శ్రీ శాస్త్రిగారు 'తరుణసాహితి' అనే పేరుతో లిఖిత మాసపత్రికను ఏర్పాటుచేసి విద్యార్థులలో రచనా సంస్కారాన్ని పెంపొందింపచేశారు. ఈ తరుణసాహితీ సంప్రదాయాన్నే శ్రీ శాస్త్రిగారి శిష్యులైన శ్రీ పోలాప్రగడవారు కొంతకాలం నడిపారు."

రాజమండ్రి ప్రాంతంలోని సాహితీ సంస్థలలో రెండవది ఆత్రేయపురంలో స్థాపించబడిన సంస్థ –

## స్నేహలత: ♦♦

"స్నేహం అనే లత అల్లిబిల్లిగా అల్లుకోవాలి. దాని కుసుమాల సౌరభం విజ్ఞానం. అది అంతటా అలముకోవాలి. దాని మధుర ఫలాలు సాహిత్యాది కళలు. ఇవి అందరికీ ఆశ్వాద్యాలు కావాలి. ఆనందాన్ని అందించాలి. కళాసాంస్కృతిక విజ్ఞానంద్వారా చైతన్యవంతమైన సమాజం ఆవిర్భవించడానికి ఉడుతాభక్తితో 1978లో స్థాపించబడినసంస్థ 'స్నేహలత'

♦ శ్రీ హనుమదింద్రగంటి సాహిత్య సమగ్రావలోకనము (1988) రామడుగు వెంకటేశ్వరశర్మ. పుట–15.

♦♦ ఎస్వీ రమేష్ అందించిన సమాచారం ఆధారంగా.

చిత్రకారుడు 'బ్నిం' (బి. ఎన్. మూర్తి), ఎమ్.వి.రమేష్, బి. ఎస్. శర్మ, నీలాప్రియ, జె. రామచంద్రరాజు – ఈ యువకులు స్థాపించిన ఈ సంస్థ ప్రారంభోత్సవ కార్యక్రమంలో బాపు, ముళ్ళపూడి వెంకటరమణ, డాక్టర్ తంబు పాల్గొన్నారు. ఈ సంస్థకు చిహ్నాన్ని (ఎంబ్లమ్) ఆ సభలోనే బాపు చిత్రీకరించి సమర్పించారు. ఈ సంస్థకు శ్రీ ఎమ్. వి. ఎస్. సూర్యనారాయణ ప్రధాన సలహాదారుగా ఉండేవారు.

'స్నేహలత' విశిష్ట కార్యక్రమాలను చేపట్టలేకపోయింది. అందరు యువకులు, విద్యార్థులు (నిరుద్యోగులు) కావటంవల్ల ఆర్థిక సమస్యలు ఏర్పడ్డాయి. దాతలెవరైనా ఉత్సాహం చూపినప్పుడు సాహిత్యకార్యక్రమాలు ఏర్పాటు చేసేవారు. యువకులు సొంతఖర్చుతో చేసిన కార్యక్రమాలు సభలు, కవి సమ్మేళనాలు – తక్కువైనా ఆ మారుమూల గ్రామంలో ఆదరణ పొందాయి.

ఈ సంస్థపేరు కలకాలం నిలిచిపోవటానికి కారణం – 'స్నేహలత' అనే లిఖిత మాసపత్రిక. మొదట్లో త్రైమాసిక పత్రికగా వెలువడింది. శ్రీయుతులు ముత్య వెంకటసత్యసూర్యనారాయణ, ఎమ్వీ రమేష్, బ్నింల సంపాదకత్వంలో అగ్రశ్రేణి వార, మాసపత్రికల స్థాయికి సాటివచ్చేలా 'స్నేహలత' వెలువడేది. ఒక్కొక్క సంచిక ఒక్కొక్క కవికో, కళాకారునికో అంకితం ఈయబడేది. మండపాక సింహాచలం, బి.ఎన్. శాస్త్రి, టి. ఎ. రామ్మోహన్, శ్రీమతులు బి. లలిత, బి. మల్లీశ్వరులు లిఖితపత్రిక సుందరంగా వెలువడటానికి సహకరించేవారు.

కథలు, వ్యాసాలు, కవితలతోపాటు వ్యంగ్యచిత్రాలు (కార్టూన్‌లు) కవుల కవితలకు, భావాలకు రంగులచిత్రాలుకూడా ప్రతిసంచికలోను అలంకరింపబడేవి కవితలపోటీలు నిర్వహించేవారు. వేమన కవితలను ఈ నాటి రాజకీయ, సాంఘిక పరిస్థితులకు అన్వయించి 'బ్నిం' వేసిన కార్టూన్లు బహుధా ప్రశంశనీయం.

'స్నేహలత' లోని రచయితలు వివిధ ప్రాంతాలకు చెందినవారవటం మరో విశేషం. పేరుపొందినవారితోపాటు యువ రచయితలను ప్రోత్సహించటం, కిన్నెరసాని పాటలకు చిత్రాలంకరణ మరికొన్ని విశేషాలు. మినీ కవితలను 'బుల్లికవితలు'గా వేసేవారు. యువకులైన సభ్యులంతా ఇతర ప్రదేశాలకు వెళ్ళటంవల్ల 1985 వరకు మాత్రమే ఈ సంస్థ పనిచేసింది.

## కాకినాడలోగల సాహితీసంస్థలు :

కాకినాడలో ప్రాచీన, నవీన సంస్థలు, మరుగునపడినవి. పనిచేస్తున్నవి అన్నీ కలిపి మొత్తం పది సంస్థలు లెక్కకు వస్తాయి. 1987 లో కాకినాడ టౌనుహాలులో "లిటరరీ అసోసియేషన్" ప్రారంభించబడిందనీ— అది తర్వాత "గోదావరిజిల్లా అసోసియేషన్" గా మారిందనీ పెద్దలుచెప్తారు అంటే ఇది సాహిత్య సంస్థ అయిన పక్షంలో ఉభయగోదావరి జిల్లాలలోనే కాకుండా రాష్ట్రంలోనే అతి ప్రాచీన సంస్థగా "లిటరరీ అసోసియేషన్"ను చెప్పుకోవలసి వుంటుంది. కాకినాడలోని సాహిత్యసంస్థలు ఇవి —

1 ఆంధ్ర సాహిత్యపరిషత్
2 విశ్వనాథ సాహిత్యపీఠం
3 జాతీయ సాహిత్యపరిషత్ (జిల్లాశాఖ — కాకినాడ)
4 ఆంధ్ర కళాపరిషత్
5 సాంస్కృతీ సమాఖ్య (కాకినా
6 సాహితీ సమాఖ్య
7 సాహిత్య కళాపీఠం
8 జాషువాకవి సాహిత్యపీఠం
9 కవితాస్రవంతి
10 అభ్యుదయ రచయితల సంఘం (జిల్లాశాఖ)
11 క్రాంతి సాహితి

వీటిలో ప్రాచీనమైనది, ప్రముఖమైనది, కాకినాడకు పేరుతీసుకు తీసుకువచ్చినది – ఆంధ్ర సాహిత్యపరిషత్ సంస్థ దీనినిగురించి ముందుగా తెలుసుకుందాం :

## ఆంధ్ర సాహిత్య పరిషత్ :

'కాకినాడ' అవగానే సాహితీప్రియుల మనసులో ముందుగా మెలి లేది – ఆంధ్ర సాహిత్య పరిషత్తు. ఆ తర్వాత జయంతి రామయ్యగారు– ఆ పిమ్మట 'సూర్యరాయాంధ్ర నిఘంటువు'! రాష్ట్రంలోని ప్రముఖ సాహిత్య సంస్థలలో ప్రముఖమైనది – ప్రాచీనమైనది 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' సుదీర్ఘమైన చరిత్ర – అపూర్వ విశిష్టతగల ఈ సంసంస్థపై ప్రత్యేకంగా పరిశోధన చేయవచ్చు. అటువంటి ఆంధ్ర సాహిత్యపరిషత్తు సంస్థగురించి కొంతవరకు వివరించే ప్రయత్నం చేస్తాను.

"బహు విధంబుల నపభ్రంశ భాషలునిన్ను
బాధించు ననుచింత వలదు తల్లి!
నీ పుత్రులై జనుల్ నీ సమాచారంబు
తలఁపలేదనువంత వలదుతల్లి!
పలుచోట్లనీకు నిచ్చలు నిరంకుశవృద్ధి
గలుఁగలేదను భీతివలదుతల్లి!
నన్నయాదులఁబోలు నన్న యొక్కండైన
నిలువలేదను బుద్ధి వలదుతల్లి!

ఆంధ్ర సాహిత్య పరిషన్మహా దరమ్మ
వలన నీ పరితాపముల్ తొలఁగిపోయె
నోపఁగలవింక నీకేమి లోపమమ్మ
భూమగుణవల్లి యాంధ్ర భాషామతల్లి" ♦

---

♦ శతావధాని పిఠాపాటి చిదంబర శాస్త్రిగారు

అని తెలుగు సాహితీ సంపదను, భాషా వైభవాన్ని సంరక్షించే "ఆపద్బాంధవ సంస్థ" గా పండితులు ఆంధ్ర సాహిత్య పరిషత్తును స్థాపించేవారు. భాషావిషయంగా గ్రాంథికభాషా నిరసన ఎక్కువవుతున్న రోజులవి. ప్రాచీనభాషా వైభవం నశించిపోతుందనే 'బెంగ' సంప్రదాయ వాదులలో నిండిఉన్న కాలమది. అటువంటి సాహిత్య భాషాపరిస్థితులలో 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' ఆవిర్భవించింది.

"192, ఎస్ప్లనేడు – చెన్నపురి" అనే చిరునామా కార్యాలయంగా 1911లో ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపించబడింది. రెండుమూడు సంవత్సరాలకే "రామారావుపేట, కాకినాడ" శాశ్వత చిరునామా అయింది. ఈ పరిషత్ ఉద్దేశాలివి: ♦

1 ఆంధ్ర శబ్దాలకు సలక్ష్య వ్యుత్పత్తికంగా విపుల నిఘంటువు రచించటం

2 తెలుగుభాషకు ఇతర భాషలతోగల సంబంధాన్ని తెలుపుతూ భాషా తత్త్వాన్ని నిరూపించే లక్షణశాస్త్రం రచించుట

3 ఆంధ్రదేశ పూర్వ వృత్తాంతాన్ని ప్రమాణ పూర్వకంగా నిరూపించుట.

4 శాస్త్ర పారిభాషిక పదాలను నిర్ణయించుట.

5 నూతన గ్రంథరచనకు సహాయ్యమొనరించుట

---

♦ సంస్థ రజతోత్సవ సందర్భంగా వెలువడిన జయంతి రామయ్య పంతులుగారి 'ఆంధ్ర సాహిత్య పరిషద్వృత్తాంతము' గ్రంథం ఆధారంగా.

6 భాషా విషయాలను చర్చించటానికి పత్రిక నిర్వహించుట

7 సమగ్రమైన పుస్తక భాండాగారం ఏర్పరచుట

8 ఆంధ్రభాషా వాఙ్మయాభివృద్ధికై కృషి చేయుట

9 ఆంధ్ర భాషలోని మంచి గ్రంథములను పండిత పరిష్కారం చేయించి నిర్దుష్టముగా ప్రచురించుట

10 తెలుగు సాహిత్య విషయమున పరీక్షలు నిర్వహించి, పారితోషికాలను, సాహిత్యపట్టాను, యోగ్యతా పత్రాలను ఇచ్చుట

11 తెలుగు వాఙ్మయమునకు సంబంధించిన విషయములను గురించి చర్చించుటకు సాంవత్సరిక సభలను ఏర్పాటు చేయుట

12 వ్రాతప్రతులను సేకరించి, పరిష్కరించి ప్రచురించుట

ఈ సంఘ స్వరూపం గురించిన నియమ నిబంధనలు _

1 ఈ పరిషత్తునకు స్థాపకులు, ఉద్ధారకులు, పోషకులు, యావజ్జీవ సభ్యులు, సాధారణ సభ్యులు, గౌరవార్థ సభ్యులు సభ్యులుగా పరిగణింపబడతారు.

2 అయిదువేల రూపాయలు, ఆ పైన ఇచ్చువారు ఉద్ధారకులు

వేయి రూపాయలు, ఆ పైన ఇచ్చువారు పోషకులు

నూరు రూపాయలు, ఆ పైన ఇచ్చువారు యావజ్జీవ సభ్యులు

ఆరు రూపాయలు, ఆ పైన ఇచ్చువారు సాధారణ సభ్యులు

సాహిత్యాతిశయ కారణంచేతగాని, గ్రంథరచన కారణంచేతగాని, ఇతర కారణాలచేతగాని తెలుగు వాఙ్మయానికి ఉపకారం

చేసినట్లుగా కార్యనిర్వాహకసభ అంగీకరించినవారు గౌరవార్ధ (Honorary) సభ్యులు

3 18 సం॥లు వయస్సు తో బనినివారందరూ సభ్యులుగా ఉండటానికి అర్హులే. సభ్యుడిగా జెరేవారు పరిషత్తులో సభ్యులుగాఉన్న ఇరువురిచేత ప్రస్తావన (Nomination) చేయించాలి. కార్యనిర్వాహక సభ్యుల ఆమోదం పొందాలి.

4 పరిషత్తులోని సభ్యులు ఎన్నుకొనే 50 మంది సభ్యులు కలిసి కార్యనిర్వాహకసభ (Senate) గా ఏర్పడి పరిషత్తు కార్యక్రమాలను నిర్వహిస్తుంది.

"వంగీయ సాహిత్య పరిషత్" అనే సంస్థ బెంగాల్‌లోఉంది. దాని స్ఫూర్తితో ఈ సంస్థకు 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' అనే పేరు పెట్టారు. 'దేశభాషలందుతెలుగులెస్స' అనేమహాకవివాక్యం పరిషత్‌కుసూచకసంగ్రహవాక్యంగా (Motto). సరస్వతీ విగ్రహం పరిషత్ లాంఛనం (Crest) 1913 ఏప్రిల్ 8వ తేదీన పరిషత్తు "Company Act" ప్రకారం రిజిష్టరు చేయబడింది. ఈ పరిషత్తు పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలుసుకుందాం:

1911 లో జయంతి రామయ్య పంతులుగారు ఉద్యోగం పని (Presidency Magistrate) మీద మద్రాసువెళ్ళి మూడు సంవత్సరాలు అక్కడ ఉన్నారు. అప్పుడాయన మద్రాసులోని ప్రముఖులతో ఆంధ్రభాషా వాఙ్మయాభివృద్ధికి ఒక సంఘం ఏర్పాటుచేయవలసిన అవశ్యకతను నొక్కి చెప్పారు. ఆంధ్ర పత్రిక – ఉగాది సంచికలో "ఆంధ్ర భాషా మహాసంఘం" అనే వ్యాసంకూడా రచించారు. ఆ సమయంలో మద్రాసులోఉన్న పీఠికా పురాధీశ్వరులు శ్రీ మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు గారితోను, వారి దివాను మొక్కపాటి

సుబ్బారాయుడుగారితోను, రామయ్య పంతులుగారు ఈ విషయమై చర్చించారు. రాజావారు ఉత్సాహంతో 1911 _ మార్చి  ఒక చిన్న సభ ఏర్పాటు చేశారు _ రాజావారి ఆహ్వానపత్రం నమూనా ఇది _

RAJAH OF PITHAPURAM

Dunmore,
Teynampet,
Madras, 24-3-11

Dear Sir,

The favour of your attendance is requested at an informal meeting of a few friends to beheld at my residence at 2 p.m. on Sunday the 26 th instant in order to discuss the ways and the means for the improvement of Telugu Literature on the basis of a comprehensive scheme formulated by M. R. Ry J. Ramayya Pantulu garu B.A., B.L., Presidency Magistrate.

26_3_11 నాటి ఆ సమావేశంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు; వేదం వేంకటరాయ శాస్త్రిగారు, మొక్కపాటి సుబ్బారాయుడు గారు, చెన్నాప్రెగడ భానుమూర్తిగారు, వావిలికొలను సుబ్బారావుగారు, కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు, గోటేటి కనకరాజుగారు ప్రభృతులు పాల్గొని ఒక మహాసంఘాన్ని స్థాపించటానికి అంగీకరించారు. వీరేశలింగముగారు నిఘంటు నిర్మాణమే సంఘ ప్రధాన ఉద్దేశంకావాలనిచెప్పటం, వెంటనే రాజావారు దానికి కావలసిన ద్రవ్యసహాయం పూర్తిగా చేస్తానని మాటఇవ్వటం జరిగింది. మహాసంఘాన్ని ఏర్పరచటానికి, నియమ నిబంధనలను రూపొందించటానికి 1911 _ మే 12న "తిరువల్లిక్కేణి" ఉన్నత

పాఠశాలలో మరొక సమావేశం ఏర్పాటు చేశారు. ఆ సమావేశంలోనే పరిషత్తు ఆవిర్భవించింది. ఈ పరిషత్తు ప్రథమసభ్యులుగా వ్యవహరించిన వారు —

మహారాజశ్రీ శ్రీ వేంకటగిరి మహారాజుగారు కె.సి.ఐ.ఇ.
" శ్రీ బొబ్బిలి మహారాజుగారు "
" శ్రీ పిఠాపురము రాజుగారు
" శ్రీ చల్లపల్లి కుమారరాజుగారు
" శ్రీ వడిమితిరువూరు జమీందారుగారు
" శ్రీ మునగాల జమీందారుగారు
" శ్రీ పోలవరము జమీందారుగారు
" శ్రీ భద్రాచలము జమీందారుగారు
" శ్రీ మైలవరం జమీందారుగారు
" శ్రీ రాజా విక్రమదేవ వర్మగారు

ఆంధ్ర సాహిత్య పరిషత్తు మొదటి కార్యనిర్వాహక వర్గం—సంస్థకు మూల సంభాలనదగినవారు —

ప్రతిష్ఠాపకులు : పిఠాపురం రాజాగారగు శ్రీ రాజా రావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరు, వేంకటగిరి రాజాసర్, వెలుగోటి వెలుగోటి శ్రీ రాజగోపాలకృష్ణ యాచేంద్ర బహద్దరు.

అగ్రాసనాధిపతి : పిఠాపురం రాజాగారు

కార్యనిర్వాహక సభాధ్యక్షుడు : శ్రీ జయంతి రామయ్య పంతులు

కార్యదర్శులు : పురాణం నాగభూషణం పంతులుగారు,
ఆచంట లక్ష్మీపతిగారు

కోశాధ్యక్షులు : దివాన్ బహదూర్ కంచికృష్ణస్వామిరావుగారు
ది ఆనరబిల్ రావు బహదూర్ పిట్టి
త్యాగరాయశెట్టిగారు.

శ్రీయుతులు కిడాంబి రాఘవాచార్యులు, వింజమూరి వెంకన్న పంతులు, దివాన్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడు, పెద్దాడ రామస్వామి, కాశీభట్ట సుబ్బయశాస్త్రి, గొడవర్తి జగన్నాథస్వామి, చిలకమర్తి, ఓలేటి వేంకటరామశాస్త్రి, పానుగంటి ప్రభృతులు కార్యనిర్వాహక సభాసభ్యులుగా సంస్థ అభివృద్ధికి కృషిచేశారు.

పరిషత్తుకు వచ్చే నూతన గ్రంథాలను విమర్శించటానికి—జయంతి రామయ్యపంతులుగారు, కొమర్రాజు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, కాశీభట్ట బ్రహ్మయశాస్త్రి, గునుపాటి యానాదిరెడ్డి, కూచి నరసింహం, పురాణపండ మల్లయశాస్త్రి, ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ, బుర్రా శేషగిరిరావు, వేదం వేంకటరాయశాస్త్రి, మేడేపల్లి వేంకటరమణాచార్యులు పానుగంటి వార్లతో 1922లో ఒక గ్రంథవిమర్శక సంఘాన్నికూడా స్థాపించారు

పరిషత్ ప్రథమ వార్షికసభ 1912 – ఏప్రిల్ 6, 7 తేదీలలో పచ్చయప్ప కళాశాలాభవనంలో జరిగింది. ఆ సభలో "ఈ కాలములో నాంధ్ర ప్రబంధములు గొన్నింటిలో శృంగారవర్ణన మతిమాత్రముగాను, అశ్లీలముగానున్నది. కావున నట్టి గ్రంథములను బ్రకటింపరాదని యొకవాదమును, గ్రాంధికాంధ్రము జనసామాన్యమునకు దుర్గ్రాహ్యముగానున్నదిగావున వ్యావహారిక భాషలో గ్రంథములు రచియింపవచ్చుననియు నట్టిగ్రంథములె పాఠశాలలలో నుపయోగింప వలెనని యొక వాదమునుబట్టి విద్వల్లోకమును గలంచుచుండెను."

అనే సంగతి గ్రహించి – ఈ వాదాల పై సవివరంగా చర్చించి తీర్మానాలు చేయుటానికి మే నెల 15, 16 తేదీలలో పెద్ద విద్వత్సభను ఏర్పాటు చేశారు. ఆ సభలో గురజాడ అప్పారావుగారు, పేరి కాశీనాథశాస్త్రిలుగారు మాత్రమే వ్యావహారిక భాషావాదం సమర్ధిస్తూ ఉపన్యసించారు.

1912 – నవంబరు 24వ తేదీన మరొకసభను ఏర్పాటుచేశారు. ఈ సభకు కందుకూరి వీరేశలింగం పంతులుగారు అగ్రాసనాధిపత్యం వహించారు. "గ్రామ్యభాషలో రచింపబడిన తెలుగుపుస్తకములను పాఠశాలలలో నుపయోగింపకుండు నట్లుత్తరువు" ఈయవల్సిందిగా సభ ప్రభుత్వాన్ని కోరుటూ వినతిపత్రం సమర్పించింది. ఆ 'మనవిపత్రము'లో పదివేలమందిచేత సంతకాలు చేయించబడినాయి. దీనిని నిరసిస్తూ, గ్రామ్యవాదాన్ని సమర్ధిస్తూ గిడుగు రామమూర్తిగారు "నవీనాంధ్రము" (Modern Teugu) వ్యాసం వ్రాయటం, దానిని ఖండిస్తూ రామయ్య పంతులుగారు "గ్రాంధిక భాషా సమర్ధనము" (A Defence of Literary Telugu) వ్రాయటం సాహితీవేత్తలకు సుపరిచితమే. ఇంతకు సాహిత్యంలో శృంగారం, గ్రామ్యభాషా ప్రయోగం – అనే అంశాలపై పరిషత్ అభిప్రాయాలను క్రోడీకరించి ఈ విధంగా చెప్పవలసి వుంటుంది –

1 శృంగారం అనేది ఒక్క తెలుగులోనే కాకుండా అన్ని భాషలలోను వుంటుంది. అది ప్రధాన రసం. సంస్కృతంలోని శాస్త్రిలనే తెలుగు కవులు అనుసరించారు.

2 ఏ భాషలోనైనా అన్ని కావ్యాలు సర్వసామాన్య జనక పఠనీయాలుగా ఉండవు. పాఠకాధికారానుగుణంగా పఠింపబడతాయి.

3 శృంగార కావ్యాలవలన జనులకు దుర్వృత్తులు అలవాటవుతాయి అనటం యుక్తం కాదు. అటువంటిమాట సరికాదు–ప్రమాణం లేదు. అటువంటి అలవాట్లున్నవారు కావ్యాలను చదివేడివారుకాదు. చదివినా అర్ధంకానివారే.

4 శృంగార కావ్యాలు ఆయా కాలాలలో ప్రఖ్యాతులచేత, పండితుల చేత ఆదరణ పొందినవేకాని మూర్ఖములు కాలేదుకదా.

5 శృంగార వర్ణనలుగల గ్రంథాలను నిషేధిస్తే భాషావాఙ్మయాలకే విపత్తు ఏర్పడుతుంది. అలా అయితే అన్ని భాషలలో ఎన్నో కావ్యాలు నిషేధింపబడవలసి వుంటుంది.

6 గ్రంథరచనలో పూర్వాలాక్షణికులు చెప్పినప్రకారం భాషనుప్రయోగించాలి — లక్షణ విరుద్ధభాషను ప్రయోగించకూడదు.

7 అర్ధానుస్వారం. శకటరేఫలు శబ్దవ్యుత్పత్తులను, స్వరూపాన్ని నిరూపించే సాధనాలు కాబట్టి అవసరమే.

8 తెలుగులో గ్రాంథికభాష దుర్బోధమని చెప్పుట యతిసాహసము. అనుభవ విరుద్ధము. కొన్నిగ్రంథములు పాండిత్య విహీనులకు సులభముగా బోధపడకపోవచ్చును. ఈ కాఠిన్యం పాకభేదాన్ని అనుసరించి ఏర్పడినదే. సలక్షణ తెలుగుభాషలో వ్రాయబడిన అనేక నాటకాలను సమాజాలు ప్రదర్శిస్తున్నాయి. వేలకొలది ప్రజలు వాటిని చూచి అర్థంచేసుకొని ఆనందిస్తున్నారు.

9 ఆంగ్లభాషా వ్యామోహం, మాతృభాషా వైముఖ్యం గలవారి సౌకర్యార్థం భాషా మర్యాదలను మార్చటం ధర్మంకాదు.

10 ఏకరూపమైన సర్వసామాన్యమైన వ్యావహారిక భాషలేదు. జాతిభేద దేశభేదములనుబట్టి అది చాలారకాలుగా ఉండటంవల్ల సాహిత్య రచనకు ఉపయోగపడదు.

ఈ విధంగా గ్రాంథికభాషా ప్రయోగం లేకపోతే మనసాహిత్యం, చరిత్ర నశిస్తాయని ఆనాటి పండితులు అభిప్రాయపడ్డారు. వారికి

ఆంధ్ర సాహిత్యపరిషత్ అండగా నిలిచింది. ఆ కాలంనాటి పరిస్థితులను బట్టి 'వ్యావహారిక వాదం' పై కోపం ఏర్పడటం సముచితమే. అనిపిస్తుంది. కాలగమనంలో వ్యావహారికవాదమే విజయపతాక ఎగురవేసింది కదా!

## వార్షిక సభలు :

ఆంధ్రభాషపట్ల, సాహిత్యం పట్ల ప్రజలలో ఉత్సాహం, ఆసక్తి కల్పించడానికి వివిధ ప్రాంతాలలో పరిషద్వార్షికోత్సవాలు జరపాలని సంస్థ నిబంధనలలో ఉంది. ఆ ప్రకారం వార్షికసభలను జరిపింది. అప్పుడప్పుడు రెండుమూడు సంవత్సరాల కొకసారి వార్షిక సభలు జరిపే పరిస్థితికూడా ఏర్పడేది. ఈ సంస్థ నిర్వహించిన వార్షిక సభలలో ముఖ్యమైనవి కొన్ని—

ప్రథమ వార్షికసభ — 1912 ఏప్రిల్ 6, 7 తేదీలలో — చెన్నపురం పచ్చయ్య కళాశాలలో — పిఠాపురంమహరాజా వారు అధ్యక్షులు.

పంచమ వార్షికసభ — 1916, ఏప్రిల్ 7, 8 తేదీలలో గుంటూరులో శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావుబహద్దరు వారు అధ్యక్షులు.

అష్టమ వార్షికసభ — 1919. జూన్ 7, 8 తేదీలలో — నెల్లూరులో — వేదం వెంకటరాయ శాస్త్రిగారు అధ్యక్షులు.

దశమ వార్షికసభ — 1921, అక్టోబరు 3, 4 తేదీలలో — ఏలూరు లోని ఏలూరు పురమందిరంలో — శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు అధ్యక్షులు.

వింశతి వార్షికసభ — 1931 – మే 23, 24 తేదీలలో – విశాఖపట్టణము – మహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిగారు అధ్యక్షులు.

ఇంకా రాజమండ్రి, బళ్ళారి, కడప, మధుర, తణుకు, తుని, ముక్తేశ్వరం, పెద్దాపురం, అమలాపురం మొదలైనచోట్ల 'భారీఎత్తున' వార్షికోత్సవాలను నిర్వహించింది. వార్షిక సభలలోని కొన్ని విశేష సంఘటనలు :

కాకినాడలో జరిగిన మూడవ వార్షికసభకు కిళాంబి రామానుజాచార్యులు (విజయనగర కళాశాలాధ్యక్షులు) అగ్రాసనాధిపత్యం వహించారు ఈ సభలో రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారు, గురజాడ అప్పారావుగారు, 'గ్రామ్య' వాదాన్ని ప్రతిపాదిస్తూ ఉపన్యాసం చేశారు. అయినా పండితగోష్ఠి ఈ తీర్మానాన్ని ఆమోదించింది – "గ్రంథ రచనయందుఁ బూర్వలాక్షణిక మతానుసారమగు భాషను బ్రయోగింపవలయును గాని లక్షణ విరుద్ధమగు భాషను బ్రయోగింపగూడదు. గ్రంథములను మృదుమధురశైలిని రచింపవలెననుట సర్వజన సమ్మతము. అట్లొనరించుటకు లక్షణభంగ మవశ్యముకాదు. లక్షణభంగముకాకుండ భాషావైచిత్ర్యమెంతయైనను గనఁడఁబఱుపవచ్చును."

పండ్రెండవ వార్షికసభ రాజా విక్రమదేవ వర్మగారి అధ్యక్షతన తునిలో (1923) జరిగినప్పుడు పరిషత్ కార్యస్థానాన్ని కాకినాడకు మార్చాలని తీర్మానం చేయబడింది.

తణుకులో ఆచంట వేంకటరామ సాంఖ్యాయన శర్మగారి అధ్యక్షతన జరిగిన (1924) పదమూడవ వార్షికసభకు జయంతి రామయ్యపంతులుగారు రాలేదు. ఈ సభలో కార్యస్థానాన్ని రాజమండ్రికి మార్చాలని ఒక నిరయం –

"గ్రామ్యముకాని వ్యావహారిక కాంధ్రభాషలోఁ బూర్వ సంప్రదాయము ననుసరించి గ్రంథములు రచింపవచ్చు" అని మరొక నిర్ణయం తీసుకోబడింది.

పదునాల్గవ, పదిహేనవ సభలు కాకినాడలో 1926, 1927 సంవత్సరాలలో జరిగాయి. పదునాల్గవ సభకు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు అధ్యక్షత వహించారు. ఆ సభలో కార్యస్థానం కాకినాడకే మార్చాలని నిర్ణయించారు. వెంటనే దానిప్రకారం మార్చారుకూడా. ఇదే సభలో మరొక విశేషమైన నిర్ణయం తీసుకోబడింది. అది –

"తణుకులో జరిగిన పరిషత్సభలోఁ జేయఁబడిన 10వ తీర్మానము గ్రామ్యవాదమున కనుకూలముగా నన్వయించుట కవకాశముండుటచేతను, ఈ పరిషత్తువారికి గ్రామ్యవాద మనంగీకారమగుట చేతను, 1914వ సంవత్సరము ఏప్రిల్ 19వ తేదీని కాకినాడలో జరిగిన పరిషత్సభలోఁ జేయఁబడినట్టియు, ఆనందవత్సర పరిషత్పత్రికలోఁ బ్రకటింప బడినట్టియు తీర్మానమునే యీ సభవారు స్థిరపఱచుచున్నారు."

ఒకవేళ పై నిర్ణయాన్ని ఎప్పుడైనా మారుస్తారేమోననే సందేహంతో అదే సభలో సభ్యులలో 100కి 66గురు కాని అంతకు ఎక్కువ మందికాని ఆమోదిస్తేనే ఆ తీర్మానాన్ని మార్చాలని నియమం చేశారు.

గౌతమీ తీరాన – 1929 మార్చి 30, 31 తేదీలలో ముక్తేశ్వరంలో జనమంచి శేషాద్రి శర్మగారి అధ్యక్షతన జరిగిన 17వ సభలో సంస్కృతభాషా పరిచయంలేనిదే ఆంధ్రభాషా ప్రావీణ్యం అలవడదని "ఉభయభాషా ప్రవీణ"ను ప్రవేశపెట్టాలని ఆంధ్ర విశ్వవిద్యాలయం వారిని కోరటం జరిగింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం 1930 నుండి ఉభయ భాషా ప్రవీణను ప్రవేశపెట్టింది.

## పత్రికా నిర్వహణ :

ప్రాచీన సాహిత్యానికి, విమర్శకి ఎంతో సేవచేసిన "ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక" – పరీధావి (1913) – భాద్రపదమాసంలో ప్రారంభించ బడింది. మొదట మూడు మాసాలకు ఒకసారి వెలువడేది. తర్వాత మాస పత్రికగా మార్చబడినా – ప్రపంచయుద్ధం సందర్భంగా కాగితానికి కరువు ఏర్పడింది. అప్పుడు మళ్ళీ కాళయుక్తి (1919) నుండి రెండు నెలలకొక సారి వెలువడేది.

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (Journal of the Telugu Academy) ఆ రోజుల్లో 'పోష్టు' వ్యయంతో – సంవత్సరానికి మూడు రూపాయలు చందా చెల్లిస్తే లభించేది. బండారు తమ్మయ్య, వెంపరాల, పిశుపాటి చిదంబరశాస్త్రి, చిలకమర్తి, చిలుకూరి పాపయ్యశాస్త్రి, దాసరి లక్ష్మణస్వామి, కాశీభట్ల బ్రహ్మయశాస్త్రి, మంత్రిప్రగడ సూర్యప్రకాశ కవి, నిడదవోలు వెంకటరావు, మల్లాది సత్యనారాయణ శాస్త్రివంటి పండి తుల, కవుల వ్యాసాలు, కవితలు, కావ్యాలు ఈ పత్రికలలో ప్రచురింప బడేవి. గ్రంథ సమీక్షలకు ప్రాముఖ్యం ఇచ్చేవారు. "దోషారోపణము తోడనే తాము కృతకృత్యుల మైతిమని నేటి విమర్శకులలోఁ గొందఱు తలంచుచున్నారు. అట్లుగాక తాను జేయవలసిన భాషాసేవయందు సహ స్రాంశ మైననుఁ జేయగలిగినచో మనభాషకిట్టి పరిస్థితులుండవనియే మా నమ్మకము"

"అన్యభాషా వ్యామోహమును వదలలేక తమ గ్రంథములను గేవల మనుకరణములుగ రచించుచున్నారు"* – ఈ విధంగా సూచనలు చేస్తూ సమీక్షలు నిష్కర్షగా ఉండటం గమనార్హం.

---

* 1940 – 41, ఏప్రిల్, మెయి – ఆం. సా. పరిషత్పత్రిక.

ప్రాచీన సాహిత్యంపై వ్యాసాలు, శబ్దచర్చలు ఎక్కువగా ప్రాధాన్యత సంతరించుకున్నా – ఆధునిక భౌతికశాస్త్రాలను గురించిన వ్యాసాలు చోటుచేసుకోవడం, సుమారు అరవై సంవత్సరాల క్రితమే ఆంగ్లేయశాస్త్ర పారిభాషిక పదాలకు తెలుగుపదాలను (జయంతి రామయ్యగారు తయారు చేసేవారు) 'పట్టిక'గా ప్రచురించటం పత్రిక విశిష్టతకు సాక్ష్యాలు. పరిషత్ పుస్తక భాండాగారంలోగల గ్రంథాల, తాళప్రతుల వివరాలుకూడా పత్రికలలో అందించేవారు. ప్రాచీన సాహిత్యంపై ప్రామాణికమైన సాహిత్య పత్రికగా ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికకు ప్రముఖమైన స్థానం లభిస్తుంది.

## శాసనములు :

శాసన వాఙ్మయంపై కృషిజరగని రోజులలో మొదటిసారిగా ఆంధ్ర సాహిత్య పరిషత్తు మాత్రమే శాసనాలను ప్రకటించింది. ప్రాచీన తామ్ర, శిలాశాసనాలు సుమారు ముప్పయి ఎనిమిదింటిని పరిషత్తు విమర్శన పూర్వకంగా వెలుగులోకి తీసుకొచ్చి అపూర్వకృషి చేసింది. పరిషత్ పత్రికలలో చాలాశాసనాలను సమీక్షించటం జరిగింది. రాజరాజు నాటి నందంపూడి శాసనం, మహారాష్ట్రి శాసనం, పెద్దచెరుకూరు శాసనం, నరసారావుపేట శాసనం, మల్కాపుర శాసనం, యుద్ధమల్లుని బెజవాడ శాసనం మొదలైనవి ప్రకటించబడ్డాయి. ఈ శాసనములవలన ఎన్నో చారిత్రకాంశములు బయల్పడినాయి. నన్నెచోడ, తిక్కనాది కవుల కాలనిర్ణయంలో సహకరించిన శాసనాలున్నాయి. పరిషత్తు ప్రకటించిన "ప్రాచీన శాసన చతుష్కము" వలన పాఙ్నన్నయ యుగములోని ఆంధ్ర భాషా స్వరూపాన్ని నిరూపించటానికి అవకాశం ఏర్పడింది. మల్కాపుర శాసనంవల్ల కాకతీయ రుద్రమదేవి గణపతిదేవుని భార్యకాదు–కూతురేఅని తెలుస్తోంది. శాసనాలలోని విషయాలను పరిశీలించినప్పుడు ఆ నాటి గ్రామ నిర్మాణ పద్ధతులు, పరిపాలనా విధానాలు, ప్రజల జీవనవిధానాలు అవగాహన చేసుకో

వచ్చు. చిత్తశుద్ధితో శాసన వాఙ్మయానికి సేవచేసిన పరిషత్తు ప్రశంస నీయమే కదా!

## గ్రంథ ప్రచురణ :

అముద్రితంగా — తాళపత్ర గ్రంథాలలో నిరాదరణకు గురై జీర్ణ మవుతున్న ఎన్నో కావ్యాలను, గ్రంథాలను ప్రచురించి సాహిత్యోద్ధరణకు కంకణం కట్టుకొన్న ఏకైక సంస్థగా సాహిత్యపరిషత్తును కొనియాడవల సిందే. తాళపత్ర గ్రంథాలను పరిష్కరింపజేసి — ముందుగా పరిషత్ పత్రికలలో ప్రచురించిన తర్వాత గ్రంథరూపంగా ప్రచురించే పద్ధతికూడా శ్లాఘనీయమే. మొత్తముమీద నూరు గ్రంథాలకుపైగా ప్రచురించిన ఈ సంస్థ సారస్వత కృషికి నిదర్శనంగా కొన్ని గ్రంథాలను వివరిస్తాను.

1 విప్రనారాయణ చరిత్రము : ఎఱ్ఱాప్రెగడ చినమనుమడైన చదలు వాడ మల్లయ రచించిన ఈ కావ్యమును పరిషత్తు ముందుగా ప్రచు రించింది. సారంగు తమ్మయ వైజయంతీ విలాసానికి పూర్వం రచింపబడింది. క్రొత్తపల్లి సూర్యారావుగారి అన్వేషణ ఫలితంగా దొరికిన కావ్యం.

2 కవి జనాశ్రయము : వేములవాడ భీమకవి (రేచన అని కొందరు) రచించినదిగా ప్రసిద్ధికెక్కిన మిక్కిలి ప్రాచీన ఛందోగ్రంథమైన కవిజనాశ్రయాన్ని ప్రథమంగా ప్రచురించారు.

3 మన్నారుదాస విలాస నాటకం : తంజాపూరి ఆంధ్ర నాయకరాజు లలో చివరివాడైన విజయరాఘవ నాయకుడు నాయకుడుగా రంగా జమ్మ రచించిన ఈ యక్షగాన నాటకం వెలుగు చూసింది.

4 కావ్యాలంకార చూడామణి : విన్నకోట పెద్దన రచించిన ఈ లక్షణ గ్రంథం పూర్వం ముద్రితమే. అందులోచేరని రెండు ఆశ్వాసము లను కనుగొని – చేర్చి పునర్ముద్రించారు.

5 శాసన పద్యమంజరి : 88 శాసనాలలోగల 287 పద్యాలను సవ్యాఖ్యానంగా ప్రచురించిన గ్రంథం ఇది.

6 ఆంధ్ర శబ్ద చింతామణి : బాలసరస్వతి రచించిన వ్యాఖ్యానంతో ప్రచురితం

ఈ విధంగా ప్రాచీన సాహిత్యానికి పరిషత్ అనిదంపూర్వమైన సేవ చేసింది.

## పుస్తక భాండాగారం :

పరిషదుద్దిష్ట కార్యాలలో పుస్తక భాండాగారం స్థాపించటం ఒకటి. ముద్రితాముద్రిత గ్రంథాలు, వివిధ భాషాపత్రికలు, ప్రాచీన లిఖిత ప్రతులు "South Indian Inscriptions" – వంటి విలువైనవెన్నో పరిషత్ పుస్తకభాండాగారంలో భద్రపరచబడినాయి. హరిసేతు రామయ్య, శేషాద్రి రమణ కవులు మొదలైనవారు సేకరించిన పుస్తకాలు, తాళప్రతులు సంస్థ ప్రచురించినవి – సేకరించినవి మొత్తం కొన్నివేలు ఉన్నాయి. రజతోత్సవం నాటికే పుస్తక భాండాగారంలో 4,595 ఉన్నట్టు, వాటిలో 371 తాళప్రతులైనట్టు జయంతి రామయ్య పంతులుగారు పేర్కొన్నారు. సాహితీ పరిశోధకులకు, విద్యార్థులకు ఈ పుస్తక భాండాగారం ఎంతో ఉపయుక్తంగా వుంది.

## నిఘంటు నిర్మాణం :

"తెలుగు భాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించుచు సర్వంకషమగు నిఘంటు

వొకటి రచించి ప్రకటించుట" అనే పరిషత్ నిబంధన ప్రకారం నిఘంటు నిర్మాణానికి సంస్థ పూనుకొన్నది. దీనికి కావలసిన ధనం అంతా పిఠాపురం రాజా వారు ఇస్తాననటంవల్ల రాజా శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరుగారి పేరుమీదుగా "సూర్యరాయాంధ్ర నిఘంటువు" అనే పేరు పెట్టారు. ఆంగ్లేయ భాషా నిఘంటువు– "Oxford Dictionary of English Language" అనే ఉత్తమ నిఘంటువును ఆదర్శంగా తీసుకున్నట్టు రామయ్య పంతులుగారే తెలిపారు. మద్రాసులోని పరిషత్కార్యాలయంతోనే నిఘంటు నిర్మాణం ప్రారంభమైంది. కళాప్రపూర్ణ వేదం వేంకటరాయ శాస్త్రిగారు సంపాదకులుగా, ఒ. సి. వీర సామయ్యగారు సహసంపాదకులుగా ఏర్పాటయ్యారు. తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారు సంస్కృత శబ్దాలను పట్టికగా తయారుచేయటానికి నియమితులయ్యారు. 1918లో నిఘంటు కార్యస్థానం పిఠాపురానికి మార్చబడింది. తర్వాత కాకినాడకు మార్చబడింది. సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణంలో కృషి చేసిన పండితులలో కొందరు –

1 పురాణపండ మల్లయ్య శాస్త్రులు
2 పేరి పేరయ్య శాస్త్రులు
3 శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులు
4 కూచి నరసింహం
5 వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
6 దర్భా సర్వేశ్వరశాస్త్రి
7 చర్ల నారాయణశాస్త్రి
8 మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
9 పిశుపాటి చిదంబరశాస్త్రి
10 కాశీభట్ట సుబ్బయశాస్త్రి
11 పాలెపు వెంకటరత్నం

నిఘంటు కార్యక్రమాన్ని దర్శించిన ప్రముఖులు, పండితులు పరిషత్తు కృషిని ప్రశంసించారు. రెండు ప్రశంసలు ఉదాహరిస్తాను.

"I inspected the Andhra Lexicon Office to-day at 4-15 p.m. Fhe whole staff has been vigorously working. I inspected some of the cards written by the Pandits. They exhibit great care and Cincumspection. I wish this institution every success of the Rajah, who is the founder of this institution, is to be congratulated on securing such able and energetic staff of Pandits."

— **G. S. Somayajulu** M.A., B.L.
Subardinate Judge
ELLORE - 8-5-19

"నేడు శ్రీ సూర్యరాయ నిఘంటు కార్యస్థానమునకు వచ్చి నిఘంటు కల్పమునకుఁ బండితులు వ్రాసి యుంచిన శబ్దపట్టికఁ జూచితిని. పూర్వ నిఘంటువులవలన సాధింపరాని యర్థములసమీచీనముగ నిర్ణయించి యచటఁ బండితవర్యులు చేయు కృషి ప్రశంసాపాత్రముగ నున్నది"

— శేషాద్రి రమణ కవులు
గంపలగూడెము ఆస్థానకవులు
20-11-19

విద్వాంసుల ప్రశంసలు పొంది, తెలుగులో అపూర్వమైన నిఘంటువును తయారుచేసిన ఆంధ్ర సాహిత్య పరిషత్ కృషిని ప్రశంసిస్తూనే లోపాలనుకూడా ప్రకటించారు-గిడుగువారు "సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనము" అనే పుస్తకం వ్రాయగా జయంతి రామయ్య పంతులుగారు తమ పరిషత్ పత్రికలో సుదీర్ఘమైన ప్రతివిమర్శ చేశారు. మారేపల్లి

రామచంద్ర శాస్త్రిగారు — ఈ నిఘంటువులో తెలుగు పదాలకు ప్రాశస్త్యం లేకపోయింది. వాడుక నుడికి ప్రాధాన్యం ఈయలేదనీ కాబట్టి ఈ నిఘంటువు అసమగ్రమనీ తెలిపారు.♦ ఏమైనా కావ్యప్రయోగాలతో శబ్దరత్నాకరంకంటె సమగ్రమైన, విపులమైన నిఘంటువు సూర్యారాయాంధ్ర నిఘంటువు అనీ, దీని ఆవశ్యకత ఎంతో ఉన్నదనీ చెప్పటం సముచితం.

పై సాహిత్య కార్యక్రమాలే కాకుండా "భారత ప్రయోగానుక్రమణిక", "పాఠభేదసహిత గ్రంథ ప్రకటనము", "సమగ్ర వ్యాకరణ నిర్మాణము" వంటి కార్యక్రమాలను చేపట్టింది. విజ్ఞాన సర్వస్వసంగ్రహం ఆధునికాంధ్ర జీవితం అనే గ్రంథాలను ప్రచురించాలనే సంకల్పం కార్యరూపం ధరించలేదు.

ఈ విధంగా పత్రికా నిర్వహణ, సభల నిర్వహణ, గ్రంథప్రచురణ గ్రంథాలయ నిర్వహణ, శాసన ప్రకటన, నిఘంటు నిర్మాణం, వార్షికోత్సవాల నిర్వహణ, తాళపత్ర గ్రంథాల సేకరణవంటి సత్కార్యాలు చేపట్టి ఆంధ్రభాషా వాఙ్మయాలకు అనల్పమైన సేవచేసిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు —

"ఆంగ్లేయ భాషాంగ నానుకూల్యంబున
సరిలేని సాహిత్య గరిమవడసి
దేవభాషాంగనా సేవనా బలమునం
దులలేని సౌభాగ్య కలనంగాంచి
నన్నయాదులు కవినాథు లేర్పఱచిన
యెనలేని మార్గంబు ననుసరించి
ప్రతి వేశినుల నన్యపరిషత్కాంతల ప్రీల
ప్రతిలేని యాచార పటిమగాంచి

♦ "నుడికడలి" నిఘంటు నిర్మాణానికి పాటుపడ్డారు. అది అముద్రితం.

ముద్దపలుకులు మాటాడు ముద్దుబిల్లల
ఒక్కపలుకుచు నభివృద్ధి కెక్కఁగాక
నాంధ్ర సాహిత్య పరిషదజ్ఞాయతాక్షి
సద్యశోభితక్కు దిక్కులం జాటుకొనుచు''

అని దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు ఆశీర్వదించినట్టు చిరకాలం నిలువ లేకపోయింది. కాలానికి ఎదురీదటం కష్టమని మరోసారి నిరూపితమైంది. ప్రభుత్వ ఆధీనంలో నేటికీ నామమాత్రంగా – ఒక 'మ్యూజియం' గా – ప్రజలు మర్చిపోయేలా నిలిచిన ఆంధ్ర సాహిత్య పరిషత్తును చూస్తే ''సవ్యాంధ్ర సాహిత్య వీథులు'' లో కురుగంటివారు పిల్లలమర్రివారు పలికిన ఈ క్రింది పలుకులు స్మరణకు వస్తాయి –

''మొత్తముమీద 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' ప్రాచీన గ్రంథ ప్రకటనములో, గ్రాంథికభాషా గౌరవము నిలబడడములో కృషిచేసినదని చెప్పవచ్చు. ముఖ్యముగా సంస్కార నిరోధము కల్పించడములో తీవ్రముగా పాటుపడిన దనవలె. గిడుగువారి వ్యావహారిక భాషోద్యమాన్ని ఖండించిన సంస్థగా మాత్రము బాగాప్రసిద్ధి పొందినది. పర్యవసానములో ఓటమే సిద్ధించినది. ఒకవ్యక్తినాధారము చేసుకున్నసంస్థ ఏదైనా ఆ వ్యక్తి అనంతరము ఆ సంస్థ ఎక్కువ అభినివేశముతో నడువజాలదు.''

(పుట 205)

## జాతీయ సాహిత్య పరిషత్ :

'వచనం అయినా, నిర్వచనం అయినా, గేయమైనా, వచన కవితమైనా, నవల, గల్పిక, కథ, వ్యాససామగ్రి అయినా, సాహిత్యంమనిషిని, అతనికి సహజమైన చైతన్య మార్గంలో – సమన్వయ విధాన ఆకాశం అంత ఎత్తుకు తీసుకొని వెళ్ళగలిగేది – కనీసం ఒకమెట్టు ముందుకు వేయించ

గలిగేది కావాలి. క్రీంపికి జార్చేదిగాదు. మనిషి 'లోని' పశువును పెంచేది గాదు'♦ అనే ధ్యేయంతో రాష్ట్రస్థాయిలో ఏర్పడిన 'జాతీయ సాహిత్య పరిషత్' సంస్థకు అనుబంధశాఖ కాకినాడలో 1980లో ప్రారంభించబడింది. జానకీజాని, కాశీభట్ల సత్యనారాయణగార్లు అధ్యక్ష కార్యదర్శులు కాగా విద్యావేత్తలు డాక్టర్ పి. వి. ఎస్. రాజుగారు గౌరవాధ్యక్షులు. అమెరికాలో నివసించి కాకినాడలో స్థిరపడిన శ్రీ గవడసాని సత్యనారాయణ సాహిత్యాభిమానంతో జాతీయ సాహిత్య పరిషత్తుకు గౌరవ ఉపాధ్యక్షులయ్యారు.♦♦

సాహిత్యోపన్యాసాలద్వారా ప్రజలకు మానవతపట్ల, జాతీయభావాల పట్ల అవగాహన పెంపొందించడానికి జాతీయ సాహిత్య పరిషత్ ఉద్దేశించింది. ఈ లక్ష్యంతో ప్రాచీన కవిత్వంపై రామాయణ భారతాలపై అనేక ఉపన్యాస కార్యక్రమాలను చేపట్టింది.

మల్లంపల్లి శరభయ్యగారు, ఏలూరిపాటి అనంతరామయ్యగారు, సముద్రాల రంగరామానుజాచార్యులు, రాణి రామకృష్ణగారు ప్రభృతులు వక్తలుగా పాల్గొన్న ఈ రామాయణ సదస్సు, 'భారత సదస్సు' లు నిర్వహించిన తీరును ఎనిమిదేళ్ళ తర్వాతకూడా సాహితీప్రియులు మరచిపోలేకపోతున్నారు. తెలుగు, తమిళ రామాయణాలపై మరుపూరు కోదండరామిరెడ్డిగారి తులనాత్మక ప్రసంగాన్ని కాకినాడవాసులకు తొలిసారిగా వినిపింపజేసింది జాతీయ సాహిత్య పరిషత్తే!

గురజాడ మహాకవిని కాకినాడలో ఎవరూ పట్టించుకోని రోజుల్లో మొదటిసారిగా జాతీయ సాహిత్య పరిషత్ 'గురజాడ జయంతి'ని నిర్వహించింది. 'శ్రీ వేణుగోపాల సంస్కృత ప్రచారసభ'తో కలిసి సభలను

---

♦ 8-3-1975 నాటి కరపత్రం

♦♦ కాశీభట్ల సత్యనారాయణగారు ముఖాముఖిగా తెలిపిన సమాచారం ఆధారంగా

ఏర్పాటుచేసింది. సంస్కృత తెలుగు సాహిత్యాల పైననే కాకుండా ఆంగ్ల నాటకాల పైకూడా నాలుగులోజులు సభలను నిర్వహించడం విశేషం.

జాతీయ సాహిత్య పరిషత్ – అభ్యుదయ రచయితల సంఘంతో సంయుక్తంగా 'కవి సమ్మేళనాలు' నిర్వహించింది. వేర్వేరు సిద్ధాంతాలు గల ఈ సంస్థలు సంయుక్తంగా కార్యక్రమంఏర్పాటుచేయడం మరోవిశేషం అభ్యుదయ, ప్రగతివాదులైన అద్దేపల్లి రామమోహనరావు, చిరంజీవినీ కుమారికూడా జాతీయ సాహిత్య పరిషత్ సభలలో పాల్గొన్నారు. విశ్వనాథవారి నవలపై అద్దేపల్లి రామమోహనరావుగారు అనుకూలంగా (Positive) గా మాట్లాడారట! సోమసుందర్‌గారు అప్పుడప్పుడు శ్రోతగా వచ్చేవారుట!

మూలనిధి లేకుండా – దాతల విరాళాలతో సామాన్య కార్యక్రమాలతో సాహితీప్రియులకు రసానందాన్ని కలిగించి ప్రాచీన సాహిత్యంపట్ల అభిమానం కలిగించిన సంస్థ జాతీయ సాహిత్య పరిషత్.

## సాహిత్య లహరి :

'సాహిత్య లహరి' సంస్థ 1960లో స్థాపించబడింది. జానకీజాని, రామకృష్ణభరద్వాజ, కొమ్మూరి వేణుగోపాలరావు (అప్పుడక్కడ మెడికల్ స్టూడెంట్‌గా ఉండేవారు), చిరంజీవినీకుమారిగార్లు కలిసి సాహిత్యలహరిని స్థాపించారు. సాహితీతపస్వి శ్రీ సోమంచి సూర్యనారాయణశర్మ గారి సహకారం లభించింది. వారంవారం సభ్యుల రచనలు చదవడం, వాటిపై గోష్ఠులు నిర్వహించడం ఈ సంస్థ ప్రధాన కార్యక్రమం.

1966 – 68 సంవత్సరాలలో సోమసుందర్ అధ్యక్షులుగా, జానకీజాని కార్యదర్శిగా సంస్థను మరింతచైతన్యవంతం చేశారు. ఈ సంస్థఇచ్చిన ప్రోత్సాహంవల్ల చాలామంది వక్తలుగా, రచయితలుగా, కవులుగా పేరు

పొందారు. సాహిత్యపరిషద్వల్ల కాకినాడ పురజనులకు ఆసక్తిని కలిగించింది.

రెండుసార్లు 'సాహిత్య లహరి' జిల్లారచయిత మహాసభలు నిర్వహించింది. సభ్యులలో కొందరకువచ్చిన అభిప్రాయ భేదాలవల్ల కొన్నాళ్ళ సంస్థ కార్యకలాపాలు నిలిచిపోయాయి. ఈసంస్థ 1980లో జాతీయ సాహిత్య పరిషత్‌లో లీనమైంది. 1968లో ఉగాది సందర్భంగా 'సాహిత్య లహరి' అనే కవితాసంపుటి ప్రచురించబడింది. ప్రాచీన ఆధునిక కవితలు ఇందులో చోటుచేసుకున్నాయి.

## జ్ఞానానందకవిగారి సంస్థలు : ♦

'కళాప్రపూర్ణ', 'మహాకవి' డాక్టర్ సురగాలి తిమోతి జ్ఞానానంద కవిగారు స్థాపించి – నిర్వహిస్తున్న (నిర్వహించిన) సంస్థలు మూడున్నాయి, అవి –

1. సాహితీ సమాఖ్య
2. సాహిత్య కళాపీఠము
3. జాషువాకవి సాహిత్య పీఠము

## సాహితీ సమాఖ్య :

14–1–1967 న – సంక్రాంతి మహోదయ వేళలో ప్రారంభించబడిన సంస్థ యిది. జాతీయ పర్వదినాలలో, పండగలలో కవిసమ్మేళనాలను, ఉపన్యాసాలను, సత్కారములను నిర్వహించటమే ఈ సంస్థ ప్రధాన ధ్యేయం. అన్ని రకాల సాహిత్యప్రక్రియలూ ఈ సంస్థకు సమ్మతాలే.

♦ డా॥ జ్ఞానానందకవిగారు అందజేసిన సమాచారం ఆధారంగా

శ్రీ భాష్యం అప్పలాచార్యులు, స్ఫూర్తిశ్రీ, వేదుల రామచంద్రమూర్తి, జోయి భీమన్న, దేవులపల్లి కృష్ణశాస్త్రి మొదలైన సాహితీవేత్తలు సాహితీ సమాఖ్య కార్యక్రమాలకు విచ్చేశారు. సంస్థాపకులు జ్ఞానానంద కవిగారే. బి. వి. ఎస్. పాత్రుడు, అల్లంరాజు సత్యనారాయణ, పి. వి. రమణమూర్తి ప్రభృతుల సారథ్యంలో 'సాహితీ సమాఖ్య' నడిచింది. 'సాహితీ సమాఖ్య' ఈ క్రింది ప్రచురణలు చేపట్టింది.

1. మణిమంజూష
2. బాష్పాంజలి
3. చందమామ
4. ఉగాది గానము

## సాహిత్య కళాపీఠము :

"ఆధునిక సారస్వతంలో వివిధ ప్రక్రియలలో ఉత్తమ రచనలు సాగించుతూ వర్ధమాన రచయితలకు ఉత్సాహాన్ని కల్పిస్తూ ఉజ్జ్వల రచనలు చేసేటందుకు" జ్ఞానానందకవిగారు 13-1-1971 న స్థాపించిన సంస్థ "సాహిత్యకళాపీఠము". ఈ సంస్థ సాహిత్య కార్యక్రమాలు అంతగా చేపట్టినట్టులేదు.

## జాషువాకవి సాహిత్యపీఠము :

5-10-1980 న ప్రారంభించబడిన ఈ సంస్థ ప్రత్యేకంగా జాషువాపైగల అభిమానంతో స్థాపించబడింది. జాషువా కవిత్వ వ్యక్తిత్వాలను ప్రజలలో వ్యాప్తి చేయడానికి – అందుకనుగుణమైన కార్యక్రమాలను చేపట్టటమే ఆశయంగా స్థాపకులు జ్ఞానానందకవిగారు తెలిపారు. యువతరానికి – సాహిత్యమార్గంలో పయనించేవారికి వెనకతరాలవారి

కవితా ప్రాశస్త్యాన్ని గమనింపజేసి, ఉత్తేజితుల్ని చెయ్యడానికి _ మహాకవుల సంస్మరణ జాతికి పూజనీయమని చాటిచెప్పడానికి ఏర్పడిన 'జాషువా కవి సాహిత్య పీఠం' శ్రీయుతులు పి. రామచంద్రరావు, సలాది అర్థసారథి, నూతికట్టు కోటయ్య, జె. ఆంద్రూపాల్ ప్రభృతుల సారథ్యంలో నిర్వహింపబడుతోంది. జాషువా జయంతి సభలను కాకినాడలో ప్రారంభించిన సంస్థగా పేర్కొనవచ్చు.

## మరికొన్ని సంస్థలు :

అ. ర. సం : 'అభ్యుదయ రచయితల సంఘం' రాష్ట్ర సంస్థకు అనుబంధశాఖగా కాకినాడలో అభ్యుదయ రచయితల సంఘం కొంతకాలం నడిచింది. రాజమండ్రి, రాజోలులలో, పిఠాపురంలో అరసం తరపున సభలు, ఉపన్యాస కార్యక్రమాలు, చర్చాసదస్సులు, కవి సమ్మేళనాలు జరిగాయి. సోమసుందర్, అద్దేపల్లి రామమోహనరావు, చిరంజీవినీ కుమారి, అదృష్టదీపక్, కప్పగంతుల మల్లికార్జునరావు, ఘిరియాల రామకృష్ణ ప్రభృతులు అభ్యుదయ రచయితల సంఘం తరపున కార్యక్రమాలను నిర్వహించారు. గత పదేళ్ళగా ఈ జిల్లాలో ఈ సంస్థ కార్యకలాపాలు దాదాపు లేనట్టే అని చెప్పవచ్చు ♦

ఆంధ్రకళాపరిషత్ : 1960 ప్రాంతంలో రోళ్ళ సీతారామయ్య, రమణశ్రీ (రామ్‌బాబ్జీ), కాకరపర్తి కృష్ణమూర్తిశాస్త్రి, బి. వి. ఎస్. పాత్రుడు మొదలైనవారు సాహిత్యం, నాటకం తదితరకళలపై కార్యక్రమాలను నిర్వహించాలని "ఆంధ్ర కళాపరిషత్" ను స్థాపించినట్టు తెలుస్తోంది♦♦ 1962 నాటి ఉగాది సభలో విద్వాన్ పాలెపు వెంకటరత్నంగారు, శైవసాహితీ సార్వభౌమశ్రీ బండారు తమ్మయ్యగారు పాల్గొనటం చెప్పుకోదగినది.

---

♦ అ.ర.సం. గురించిన సమాచార సేకరణకు ప్రయత్నించాను గానీ _ లభ్యం కాలేదు.

♦♦ 13_4_62 నాటి 'సమాచారం' ఆధారంగా

## విశ్వనాథ సాహిత్యపీఠం : ♦

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు పరమపదించగానే వారి శిష్యులైన అష్టావధాని శ్రీ పేరాల భరతశర్మగారు – విద్వత్కవి వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి అధ్యక్షతన 'విశ్వనాథసాహిత్యపీఠం' స్థాపించారు. విశ్వనాథవారి రచనలపై పోటీలు నిర్వహించి విమర్శకులకు బహుమతిద్వారా ప్రోత్సాహాన్ని కల్పించిన ఈ సంస్థ మూడు సంవత్సరాలు మాత్రమే కొనసాగింది.

"యంగ్ మెన్స్ హేపీక్లబ్" అనే సాంస్కృతికసంస్థ ప్రధానంగా నాటక సంస్థ అయినా కొన్ని సాహిత్య కార్యక్రమాలను కూడా నిర్వహిస్తోంది. సోమసుందర్, ఆలూరి విజయలక్ష్మి, పోతుల వీరాస్వామి గార్ల ఆధ్వర్యంలో నడిచిన "కళాస్రవంతి", జానకీజాని, పోలాప్రగడ మొదలైనవారి ఆధ్వర్యంలో నడిచిన తూర్పుగోదావరిజిల్లా రచయితల సంఘం – ఒకనాటి సాహిత్య సంస్థలుగా మాత్రమే పేర్కొనదగినవి. 'సాంస్కృతీసమాఖ్య' అనే రాష్ట్ర సంస్థ ఆధ్వర్యంలో కూడా ఆధునిక సాహిత్య సభలు జరుగుతూనే ఉన్నాయి. "ప్రజారచయితల సమాఖ్య" అనే సంస్థకూడా అప్పుడప్పుడు విప్లవ సాహిత్య కార్యక్రమాలను నిర్వహించటం కూడా జరుగుతోంది.

## నా పరిశీలనలో గల సాహిత్య సంస్థలు

సాహిత్యపరంగా విభజింపబడిన తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడ మండలానికి చెందినవి –

1. పిఠాపురం
2. పెద్దాపురం
3. అనపర్తి
4. రామచంద్రపురం

♦ పేరాల భరతశర్మగారి నుంచి సమాచారం రాబట్టలేకపోయాను.

ఈ నాలుగు ప్రాంతాలలో "సమాజ" చేయబడిన సంస్థలు మొత్తం ఎనిమిది ఉన్నాయి. వాటి వివరాలు —

పిఠాపురం : కళాకేళి
సారస్వత మిత్రమండలి
పీఠికాపుర సాహితీ సమ్మేళనం

పెద్దాపురం : సాంస్కృతీ సమాఖ్య
ప్రగతి సాహితీ కళాసమాఖ్య
విజ్ఞాన సమితి

అనపర్తి : అభ్యుదయ రచయితల సమాఖ్య

రామచంద్రపురం: స్నేహసాహితి

వీటిలో 'పీఠికాపుర సాహితీసమ్మేళనం', 'స్నేహసాహితి' సంస్థల వివరాలు మృగ్యం. స్నేహసాహితిని డి. సీతారామారావు. సి. పి. సోమయాజులు ప్రభృతులు నిర్వహించినట్టు తెలుస్తోంది. కాకినాడ తర్వాత సాహిత్య కేంద్రంగా పిఠాపురాన్ని పేర్కొనాలి. పిఠాపురం అనగానే ముందుగా గుర్తుకువచ్చే సంస్థ –

కళాకేళి : ♦

నిడదవోలు శివసుందరేశ్వరరావు, సోమసుందర్‌లు ఇంటర్మీడియేట్ విద్యార్థులుగా ఉన్నపుడే కాకినాడలో – 1944లో "కళాకేళి" ని స్థాపించటం జరిగింది. తర్వాత పిఠాపురానికి మార్చబడింది. అప్పట్లో సంవత్సరానికొక రూపాయి సభ్యత్వ రుసుం ఉండేది. ప్రతి సంవత్సరం

---

♦ శ్రీ సోమసుందర్ ముఖాముఖిగా తెలిపిన అంశాలు ఆధారంగా

క్రమం తప్పకుండా వసంతోత్సవాల పేరిట సాహిత్య కార్యక్రమాలు నిర్వహించేది. 1945లో వెంకాని భావనరావుగారు ఏర్పాటుచేసిన 'నవ్యకళా సమితి' (నాటకసంస్థ)తో సంయుక్తంగా కార్యక్రమాలు నిర్వహించేవారు. నవ్యసాహిత్య పరిషత్తుకు అనుబంధ సంస్థగా పనిచేసింది. అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడినతర్వాత — 1945 మే నెలనుంచి అ.ర.సా.నికి అనుబంధ సంస్థగా 'కళాకేళి' కొనసాగుతూ వచ్చింది. అరసం సభ్యులే కళాకేళి సభ్యులయ్యారు. సోమసుందర్‌గారి ఆధ్వర్యంలోనే సాహిత్య కార్యక్రమాలు జరిగేవి. రాంషా, శశాంకలు కొంతకాలం కళాకేళికి కార్యదర్శులుగా ఉండేవారు. కళాకేళి నిర్వహించిన సాహిత్యసభలు తక్కువే. 1945 ఏప్రిల్ 16న కందుకూరి జయంత్యుత్సవం సందర్భంగా శ్రీరంగం నారాయణబాబు, చాసోలను సన్మానించటం — అదికూడా దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి అధ్యక్షతన జరగటం విశేషకార్యక్రమం. పిలకా గణపతిశాస్త్రి గార్ని, జమ్మలమడక మాధవరామశర్మ గార్ని 1946 లో సత్కరించారు.

"కళాకేళి" కి అనుబంధంగా పెద్దాపురంలో నాటకశాఖ ప్రారంభించారు. పాలగుమ్మి పద్మరాజుగారి గొప్పకథ— "గాలివాన" ను నాటకంగా మార్చి ప్రదర్శించిన ఖ్యాతి కళాకేళికే దక్కుతుంది. "కుక్క నవుతు" అనేనాటకంలో (బెర్నార్డ్‌షా Brew ఆధారంగా వ్రాయబడింది) రాంషా, సోమసుందర్‌లు నటించారు.

'కళాకేళి' సభ్యుల, రచయితల గ్రంథాలను ప్రచురించి ప్రోత్సహించాలనే ఉద్దేశంతో 1948 లో "కళాకేళి" ప్రచురణలను ప్రారంభించింది. రాంషా రచించిన 'శిలాప్రతిమ' నాటకం, 'కామేశ్వరికథ' నవల తొలిప్రచురణలు. 1949 లో వరుసగా వజ్రాయుధం, త్వమేవాహం (ఆరుద్ర), అగ్నివీణ (అనిసెట్టి), అగ్నిధార (దాశరథి), రుద్రవీణ, అడివి (కె. వి. రమణారెడ్డి) వంటి అభ్యుదయ కావ్యాలను ప్రచురించి ఖ్యాతి కెక్కింది. అంతేకాదు — 1950 మేలో శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని, గంగినేని 'ఉదయిని'ని ప్రచురించిన ఘనతకూడా దక్కుతుంది. పురిపండా వారి 'పులిపంజా'ను కూడా ఈ సంస్థ ప్రచురించింది.

1950 ఫిబ్రవరిలో సోమసుందర్ వజ్రాయుధం నిషేధానికి గురయింది. “ప్లీడర్‌గా ఉన్న రాంషాపై ప్రభుత్వం ‘వేటు’ పెట్టింది. కొంతకాలం ‘జైలు’ శిక్ష అనుభవించారు. తర్వాత రాంషా విడిపోయి “అభిసారిక” పత్రికానిర్వహణ చేపట్టారు. 1956 వరకు రాంషాతో కలిసి నడిపిన ‘కళాకేళి’ సంస్థ 1956 నుంచి సోమసుందర్ సంస్థగా నడుస్తోంది. కళాకేళి ప్రచురణలలో ఇతరుల ‘కళాకేళి’ గురించి చెప్పుకోవలసిన మరో విశేషం_“అక్షయపాత్ర” అనే లిఖిత పత్రికను నిర్వహించటం ‘కళాకేళి’ అనే సాహిత్య పత్రికను ప్రచురించటం.

‘అక్షయపాత్ర’ కు సోమసుందర్, రమణమూర్తి సంపాదకులుగా వ్యవహరించేవారు. 1944, మే నుంచి వెలువడుతున్న ఈ ‘పవిత్రసాహితి’కి చిత్రకారుడిగా బుజ్జాయి వ్యవహరించారు. సంపాదకీయంలో చెప్పినట్లుగా “అధునాతన సనాతనాంధ్ర సాహిత్య సుధాపాత్రమే ఈ అక్షయపాత్ర”. పిఠాపురంలో వెలువడిన లిఖిత పత్రికలలో ‘అక్షయపాత్ర’ మూడవది.♦

‘అక్షయపాత్ర’లో వేంకటపార్వతీశ కవుల (కవిరాజహంసలు) శ్రీ రామాయణము, దేవులపల్లి సోదరకవుల ‘నయనోల్లాసము’ ప్రబంధం నుంచి ‘వసంత వర్ణనలు’, సుబ్రహ్మణ్యమూర్తి స్తుతిగీతములు ప్రచురింపబడేవి. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి‘అభినవ వేమన’ పద్యాలు వేమనపద్యాలకు అనుకరణలు _ తొలిగా అక్షయపాత్రలోనే వచ్చాయి. (తర్వాత ‘యువ’ మాసపత్రికలో ప్రచురితం)సోమసుందర్ అముద్రిత (నేటికికూడా)రూపకం ‘వసంత విలాసం’ ఈ సంచికలలో లభ్యమవుతుంది. చెఱుకువాడ నరసింహంగారి కథ, వింజమూరి శివరామారావుగారి కథ, దర్భా వెంకటరామశాస్త్రి (రాంషా) పద్యకవితలు, పన్నాల వెంకటాద్రిభట్ట శర్మగారి ‘దాంపత్యం’ నాటిక, పాలగుమ్మి పద్మరాజుగారి అముద్రిత నాటిక

♦ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయ లిఖిత పత్రిక మొదటిది. ‘నవయుగ’ రెండవది.

'కట్నం', ఊరుపల సుబ్బారావుగారి 'సాహిత్యచిత్రం' వ్యాసం – ఈ సంచికలలో భద్రపరచబడ్డాయి.

'అక్షయపాత్ర' లో గల

"ఒక్క నోటుబుక్కు ఒకబుక్కు కవివాక్కు
కలపి రుబ్బిరుబ్బి అలికిఅలికి
అతడు పీఠమెక్కి యాచార్యుడయ్యెరా
విశ్వదాభిరామ వినురవేమ"

మొదలైన దేవులపల్లి 'హ్యారడీలే' శ్రీశ్రీకి – సిరిసిరిమువ్వ శతక రచనకు స్ఫూర్తినిచ్చాయని సోమసుందర్ చెప్తున్నారు.

రాంషాగారి పద్యరచనాధోరణికి ఒకపద్యం –

''ప్రాచ్యులైనను నవ్యసంపర్కులైన
విపుల భావనాకారులు తపసులవలె
నగ్న సత్యాల రూపింప నాటుకొలుపు
హృదయవాంఛల రచియింతు రాదికళగ''.

''ఆలవలీ మనోజ్ఞ మృదులాధర హాసవసంత భృంగవం
శీలలితా రవోన్మిషిత శీకరముక్త లతాంత......'' అనే విధంగా

మనోజ్ఞంగా పద్యాలు అల్లగల ప్రతిభావంతుడు – 19 సం॥ల అంగవికలుడు అయిన పెన్మెత్స వరహాలరాజు (సామర్లకోట) కవితలు – సేకరించి అందించటంలో సోమసుందర్ కృషి మెచ్చదగినది.

పిఠాపురంలో ప్రధానమైన సాహిత్యసంస్థ 'కళాకేళి' అయినా అంతకుముందు 'సారస్వత మిత్రమండలి' అనే సంస్థ ఉన్నట్లు తెలుస్తోంది♦

---

♦ బాలాంత్రపు రజనీకాంతరావుగారు చెప్పినవిషయం.

పానుగంటి విజయరాఘవరావు, చిరంజీవి రావు, వెంకటరమణారావు, దుగ్గిరాల పళ్ళంరాజు (దేవులపల్లి మేనల్లుడు), వింజమూరి శివరామారావు, చాగంటి భీమశంకరం (చాగంటి శేషయ్యగారి పెద్దకొడుకు) ప్రభృతులు 'సారస్వత మిత్రమండలి' గా ఏర్పడి సూర్యరాయాంధ్ర భాండాగారంలో సమావేశాలు జరిపేవారు. అయిదు సంవత్సరాలకు పైగానే ఈ మండలి పనిచేసింది.

ఇంకా 'పిఠాపురం జాన్సన్స్ క్లబ్' ఉండేదని వినికిడి. నడకుదుటి వీర్రాజు పంతులుగారిని 'లార్డ్ జాన్సన్' అనేవాళ్ళట. ఆయన అధ్యక్షులుగా ఏర్పడిన 'పిఠాపురం జాన్సన్స్ క్లబ్' నే "విమర్శాదర్శ సాహితీ కూటం"గా వ్యవహరించేవారట. సోమసుందర్ అధ్వర్యంలో 1956–60 మధ్య "పీఠికాపుర సాహితీ సమ్మేళనం" అనే సంస్థ ప్రతినెలా 'కవి జయంతి' జరిపేవారు. పిఠాపురంలో సాహితీ చైతన్యం కలిగించే సాహిత్య సంస్థలు ఈనాడు లేవు.

## పెద్దాపురం విజ్ఞాన సమితి : ♦

ఇది పెద్దాపురంలో ప్రాచీనమైన సంస్థ. 'మూర్తిశ్రీ' వ్యవస్థాపకులుగా 1957లో స్థాపించబడిన ఈ సంస్థ శ్రీయుతులు జోశ్యుల రాధాకృష్ణ, దొంకాడ సత్యనారాయణమూర్తి, కొత్తపల్లి సుబ్రహ్మణ్యశర్మ, అల్లంరాజు లక్ష్మీపతి, దేశపల్లి గోపాలరావు, వి. వి. యల్. నరసింహరాజు ప్రభృతులు నిర్వహించేవారు. 1986 వరకు ఈ సంస్థ ప్రతినెలా క్రమం తప్పకుండా స్థానిక సభ్యులతో, స్థానికులతో, సాహిత్యగోష్ఠులు నిర్వహించి పెద్దాపురంలో సాహిత్య సమావేశాలను ఏర్పాటుచేసే ఏకైక సంస్థగా పూర్వం గుర్తింపు పొందింది.

♦ సంస్థ వ్యవస్థాపకులు 'మూర్తిశ్రీ' గారి 3–4–90 నాటి లేఖ ఆధారంగా.

1975లో ఉగాదికి ఏర్పాటుచేసిన కవితాగోష్ఠి, 1968లో 'గౌతమీ కోకిల' వేదుల సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గార్లతో ఏర్పాటుచేసిన వార్షికోత్సవసభ-విశిష్ట కార్యక్రమాలుగా పేర్కొన వచ్చు. తెలుగు కవుల, పరిశోధకుల, చరిత్ర పరిశోధకుల జయంతులను, వర్ధంతులనేకాక - రవీంద్రనాథ ఠాగూరు జయంత్యుత్సవాలను ప్రతిసంవత్సరం ఏర్పాటుచేసిన సంస్థ 'విజ్ఞానసమితి'.

"సాహిత్యమే ధృతి వివేకము, వినోదము కలిగిస్తుంది. కవిత్వము భావ ప్రధానముగా ఉండవలెను". అని సంస్థ భావించింది. ఈ భావనతో 1968లో "విజ్ఞానసుధ" అనే మాసపత్రికను వెలువరించారు. 'విజ్ఞాన సమితి' కార్యక్రమాలను ఇప్పటికీ సాహితీప్రియులు స్మరించుకోవటం గమనార్హం.

'విజ్ఞాన సమితి' సంస్థ ప్రాచీన సాహిత్య ప్రచారానికి పరిమితమైతే ఆధునిక సాహిత్య వ్యాప్తికి కృషిచేస్తున్న సంస్థ -

## సాంస్కృతీ సమాఖ్య : ♦

"సాహితీ దీపాన్ని వెలిగిద్దాం
అజ్ఞాన తిమిరాన్ని కోలగిద్దాం"

అనే ఆశయం (Motto)తో 1971 - జనవరి 17 రాష్ట్ర సంస్థగా 'సాంస్కృతీ సమాఖ్య' (యువహహితీ వికాసవేదిక) ఏర్పడింది. శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, శ్రీ వి. శిరీష్‌కుమార్, కొల్లూరి, పృథ్వి మొదలైనవారి ఆధ్వర్యంలో అభివృద్ధి చెందుతున్న 'సాంస్కృతి సమాఖ్య'కు తూర్పుగోదావరి జిల్లాశాఖ ఏర్పాటైంది. పెద్దాపురం కార్యాలయంగా

♦ సంస్థ రాష్ట్ర కార్యదర్శి ఎస్. ఆర్. పృథ్వి తెలిపిన సమాచారం ఆధారంగా.

ఎస్.ఆర్. పృథ్వి కన్వీనర్‌గా 'సాంస్కృతీసమాఖ్య' 1976లో ఏర్పడింది. కవితాగోష్ఠులు, కవిసమ్మేళనాలు, ఉపన్యాసాలు మొదలైన సామాన్య కార్యక్రమాలను ఈ సంస్థ చేపట్టింది – చేపడుతోంది. 1988 మార్చిలో సర్వశ్రీ అద్దేపల్లి రామమోహనరావు, జ్ఞానానందకవి, చేబోలు చిన్మయ బ్రహ్మకవి, శాంతిశ్రీ బొత్సకవి, పంపన సూర్యనారాయణ, శివలెంక ప్రకాశరావు, పోచిరాజు శేషగిరిరావు గార్లతో ఏర్పాటుచేసిన 'భువన విజయం' సాహితీరూపక ప్రదర్శనను పెద్దాపురంలో సాంస్కృతీ సమాఖ్య మొదటిసారిగా నిర్వహించింది.

సాంస్కృతీ సమాఖ్య – తూ.గో. జిల్లాశాఖ రెండు ప్రచురణలు చేపట్టింది. అవి –

1 చైతన్యదీపిక 2 శాంతిపవనాలు

పెద్దాపురంలోనే 'ప్రగతి సాహితీకళాసమాఖ్య', 'కళావాహిని' అనే సంస్థలుకూడా అప్పుడప్పుడు కార్యక్రమాలు చేస్తూంటాయి.

కాకినాడ ప్రాంతంలో అనపర్తి, రామచంద్రపురాలలో కూడా సాహిత్యసంస్థలు లేకపోలేదు. 1976 ఫిబ్రవరిలో అనపర్తిలో 'అభ్యుదయ రచయితల సమాఖ్య ఏర్పడింది. ఈ సంస్థకు సత్తి హనుమంతరెడ్డిగారు పోషకులు. తోలేటి వెంకటరమణమూర్తిగారు కార్యదర్శిగాగల ఈ సంస్థలో పదిహేనుమంది సభ్యులున్నారు. కవిసమ్మేళనాలు, సాహిత్యసభలు అనపర్తిలోనే కాకుండా పరిసర ప్రాంతాలలోకూడా నిర్వహించటం ఈ సంస్థ ప్రత్యేకత. ఈ సంస్థ పోషకులైన సత్తి హనుమంతరెడ్డిగారి పద్య, వచన కవితాసంపుటి "ప్రణయాంజలి"ని ఈ సంస్థ ప్రచురించింది. విశేషంగా వివరించవలసిన కవితాసంపుటికాదు.

సామర్లకోటలో రాంషా, క్షత్రి సుభానీసింగ్‌ల నిర్వహణలో 'లలిత కళాపీఠం', మారెళ్ళపూడి వీరభద్రరావుగారి ఆధ్వర్యంలో 'నెహ్రూ

'బాలానంద సంఘం' కొన్నాళ్ళు పనిచేసినట్టు తెలుస్తోంది. 'అభ్యుదయ రచయితల సంఘం' తరపున రామచంద్రపురంలో డాక్టర్ స్టాలిన్‌గారు కొన్ని సాహిత్య కార్యక్రమాలు నిర్వహించినట్టు తెలిపింది.

కాకినాడ ప్రాంతంలోగల సాహిత్య సంస్థలలో ప్రధానమైనవి – ప్రముఖమైనవి రెండు : ఆంధ్ర సాహిత్య పరషత్తు, కళాకేళి. అభ్యుదయ రచయితల సంఘం – తూర్పుగోదావరి జిల్లాశాఖ కాకినాడలో కొన్నాళ్ళు మంచి కార్యక్రమాలను చేపట్టింది. ప్రస్తుతం ఆ సంఘ కార్యకలాపాలు లేవు. పెద్దాపురంలో సాహితీవేత్తలు నడిపేసంస్థలు మూలపడ్డాయి. యువకులు అప్పుడప్పుడు ఏదే ఒక సంస్థ ఆధ్వర్యంలో (బ్యానరుమీద) చిన్న కార్యక్రమాలు చేస్తున్నాయి. సాహితీ చైతన్యం కాకినాడలో ఉన్నా – సాహిత్యసంస్థలు గొప్పవి లేవు. రాజమండ్రితో సంస్థల విషయంలోగాని, కార్యక్రమాల విషయంలోగాని కాకినాడ పోటీపడలేదు. ఇక కోనసీమ మండలంలోని సాహిత్య సంస్థలను పరిశీలిద్దాం.

## కోనసీమ మండలంలోని సాహిత్య సంస్థలు :

"శ్రీదేవి వాగ్దేవి చెలిమిఁ గ్రీడింతు ర
త్తయుఁ గోడలను మాటఁదలప కెందు
నలరారు గోదావరమ్మ పెంజలువ స
స్యశ్యామలము గన జస్రమెద్ది
దివికిని భువికి బాంధవము గూర్చును హవి
రాజ్య గంథానిల వ్యాప్తి నెద్ది
"రాత్రిం దివంబన్న దాత్రులు గృహిణు" లం
చవినశ్వర యశస్సునందె నెద్ది

నిలిచెనెది కాలమహిమ నాంగల కలా వి
శేషముల సైత ముత్తమశ్రేణికెక్కి
యట్టి మముఁగన్నతల్లి నిత్యము స్మరింతుఁ
గోనసీమ సమస్త విజ్ఞాన ధామ"

అని విద్వత్కవిశేఖరులు వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు పొంగిపోయారు.

కోనసీమ ప్రాంతంలో అమలాపురం, రాజోలు, ముంగండలలో మొత్తం పదిసంస్థలున్నట్టు గుర్తించబడింది.

అమలాపురం : సాహితీసమితి
విజ్ఞానసమితి
నవశంఖ ఫలకం
నవతా రచయితల సంఘం
త్రివేణి
సాహితీ మిత్రమండలి
జాతీయ సాహిత్య పరిషత్
దీపిక

రాజోలు : సాహితీ స్రవంతి

ముంగండ : విశ్వసాహిత్యమాల

ముందుగా కోనసీమకుగుండెకాయవంటి అమలాపురంలోని సాహిత్య సంస్థలగురించి వివరిస్తాను.

## అమలాపురం :

"కనుగొనఁ గల్పవృక్షముల కైవడి సత్ప్రభువుల్ గురూత్తము
ల్ధనమును విద్యయు న్పలములం ఘటియింపఁగ బాలకీరవా
గ్వినుతులునెల్ల నెల్లపుడు బెంపలరారుటఁ గోనసీమయే
యన నమలాపురంబు చెలువందు ధరాస్థలి స్వర్గతుల్యమై"

– పుల్లెల శ్రీరామశాస్త్రి

అటువంటి అమలాపురంలో సాహితీవేత్తలకు కొరతలేదు. కవులు పండితులు నాడు, నేడు కూడా ఉన్నారు. సాహితీచైతన్యానికి కొదువలేదు. అందుకనే అమలాపురంలో ఏనిమిది సంస్థలు సాహితీసేవలో భాగస్వాము లయ్యాయి. ఆ సంస్థలను తెలుసుకుందాం:

సాహితీసమితి

అమలాపురంలోగల సాహిత్య సంస్థలలో ఇది ప్రాచీనమైన సంస్థ 1957లో దసరా ఉత్సవాలలో – శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు గౌరవాధ్యక్షులుగా, పరిమి వెంకటావధానిగారు ఉపాధ్యక్షులుగా. ఓలేటి సూర్యనారాయణ రాజుగారు, శిష్ట్లా సూర్యనారాయణమూర్తిగారు కార్యదర్శు లుగా "సాహితీసమితి ప్రారంభించబడింది. పురప్రముఖులైన గిడుగు సూర్యనారాయణమూర్తి, కూచిమంచి ప్రకాశం, కూచిమంచి వెంకటరత్నం గార్ల ఆర్థికసహాయం ఈ సంస్థకు లభించింది. సంస్థను సమర్థవంతంగా నిర్వ హించటంలో శ్రీయుతులు దుప్పూరి రామకృష్ణారావు. మల్లాది గోపాల కృష్ణశర్మ, వక్కలంక లక్ష్మీపతిరావు, కొర్లపాటి శ్రీరామమూర్తిగార్లు సహకరించారు. వీరు కొన్నాళ్ళు సభ్యులుగా కొనసాగారు.

ప్రాచీన అర్వాచీన సాహిత్యాలను ప్రజలకు పరిచయంచేసి సాహి త్యానురక్తి కలిగించటమే సంస్థ ప్రధాన ఆశయం. కాని, ప్రాచీన సాహి త్యంపై మక్కువగల సంస్థగా పేర్కొనవలసి వుంటుంది. 'సాహితీసమితి' ఉపన్యాస కార్యక్రమాలకే పరిమితమైంది.

ఈ సస్థ ఏర్పాటుచేసిన సభలలో ఆనాడు విద్వల్లోకంలో కాకలు తీరిన – ఎందరో ఉద్దండులు అమలాపురంవచ్చి ఈ సంస్థ కార్యక్రమా లలో పాల్గొనడం మరపురాని మధుర సన్నివేశాలు.

సాహితీసమితి వైశిష్ట్యం ఏమిటంటే – వెంపరాల సూర్యనారా సూర్యనారాయణ శాస్త్రిగారి అధ్యక్షతన అమలాపురంలో శ్రీనాథుని కవితా

---

• సంస్థ నిర్వాహకులలో ఒకరైన శ్రీ శిష్ట్లా సూర్యనారాయణమూర్తి గారు తెలిపిన వివరాలు.

సాహిత్యంపై నాలుగురోజులసభ ఏర్పాటు చేయడం. శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు వక్తలు. ఈ ఉపన్యాసాల ఫలితంగానే పాపయ్య శాస్త్రిగారు "శ్రీనాథ కవితాసమీక్ష" (శ్రీనాథుడు శృంగారియా?) అనే ఉత్తమ గ్రంథం రచించటం జరిగింది. ఈ రచనకు 'సాహితీసమితి' స్ఫూర్తినిచ్చింది. అని చిలుకూరి పాపయ్య శాస్త్రిగారే స్వయంగా పేర్కొన్నారు — ♦

"ఈ వికారి వత్సర శ్రావణమాసమున — అనగా 1958 ఆగస్టు 15 మొదలు 18వ తేదీవఱకు అమలాపురమునందు నేనీవిషయమును సాహితీసమితి సదస్సుల ముఖమున నుపన్యసింపవలసి వచ్చినది. అమలాపురిలో గత వత్సరమున బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారి యధ్యక్షతతో బారంభమైన యా సాహితీసభ, ఆంధ్రదేశ ప్రసిద్ధ పండిత కవులచే సంభాషణములు గావింపఁజేయుచు నఖండమగు భాషాసేవ చేయుచున్నది. సహృదయులయిన యా సాహితీసమితి సభ్యుల యాహ్వానముపై వారి సముఖమున శ్రీనాథుని కవితాశిల్పమునుగూర్చిన నా యూహలను వెలార్చుచు "శ్రీనాథుఁడు శృంగారికాఁడు" అను విషయమున నాకుఁ దోచిన యుపపత్తులను దెలియఁజేసి యుంటిని. నా యూహలను గ్రంథస్థము చేయవలయునను తొందఱ నాకుఁ గూర్చినదీ సాహితీ సమితియే".

లబ్ధప్రతిష్ఠులైన సాహితీవేత్తలచే ఉపన్యాసాలు ఏర్పాటుచేసి అమలాపురం ప్రజలలో సాహిత్యాభిలాషను కలిగించిన సాహితీసమితి మూడు సంవత్సరాలకే మూలనపడింది. సాహిత్యసంస్థల పతనానికి గల కారణాలలో సభ్యులలోగల 'బద్ధవైరం' కూడా ఒకటని ఈ సంస్థ తెలియజేసుంది.

♦ శ్రీనాథ కవితాసమీక్ష (1959) — ఆముఖము — పుట 5, 6.

నవశంఖ ఫలకం :

దిగంబర కవిత్వపు హోరునుంచి బయటపడి విప్లవకవితాఝరులతో ప్రవహిస్తున్న తెలుగు సాహితీలోకాన్ని పరిశీలించి సాహిత్యంలోని అవాంఛనీయ ధోరణులను తూర్పారబెట్టాలని వాడి, వేడిగల తొమ్మండుగురు ఆంధ్రోపన్యాసకులు (శ్రీ కోనసీమ భానోజిరామర్స్ కళాశాల, అమలాపురం) సమిష్టిగా స్థాపించిన సంస్థ – ''నవశంఖ ఫలకం''.

ధూర్జటి ప్రస్తావించిన శంఖఫలకాన్ని దృష్టిలో పెట్టుకొని 'నవ' శబ్దానికి గల రెండు అర్థాలు సార్థకమయ్యేలా 'నవశంఖ ఫలకం' అనే పేరు పెట్టారు. నక్కీరుని ఆదర్శంగా తీసుకొని 'విమర్శ' అనే చికిత్సతో సాహితీ కాలుష్యాన్ని పారద్రోలాలని ప్రారంభింపబడిన ఈ సాహితి సంస్థలో –

శ్రీ బి. వి. రమణ (కన్వీనరు), వి. చక్రపాణిరావు, పి. సత్యనారాయణరెడ్డి (పైడిపాల), డి. నాగేశ్వరశాస్త్రి (ద్వా. నా. శాస్త్రి) డా॥ కస్తూరి హనుమంతరావు, కన్నెబోయిన వెంకటేశ్వరరావు, బి. వి. నరసింహారావు, మంతెన సూర్యనారాయణరాజు, గరిమెళ్ళ సోమయాజిశర్మ సభ్యులు. వీరికి దిగంబర కవితోద్యమం కొంత స్ఫూర్తినిచ్చింది.

''తెలుగునాడులో ప్రతీమొదటివాడు ఓ కవి – అనే నానుడికి ఊపిరి పోస్తూ నేడు ఇంటింటా వంటింటా కందపిలకల్లా చింతపిక్కల్లా కవులూ రచయిత(త్రు)లూ – సాక్షాత్కరిస్తున్నారు. పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న పత్రికల పుణ్యమాఅని – అచ్చోసి వదిలిపెట్టిన రాతలన్నీ సాహితిమతల్లి నుదుటిగీతల్ని వెక్కిరిస్తున్నాయి. అస్పష్టత, అశ్లీలత, అయోమయం, అతివాదం, అపరిణత, అనుకరణ – ఆధునికత ముసుగులో స్వైరవిహారం చేస్తున్నాయి. ఈ అవకతవకల్ని అరికట్టడానికి ఈ అదునులో పదునైన కత్తెరలున్న నిర్భయ, నిష్పాక్షిక విమర్శనావేదికలు ఆవిర్భవించడం అత్య

వసరం. కానిపక్షంలో ఈ అసంతృప్త – అజ్ఞాత యుగంలోంచి ఆంధ్ర సాహితి అధః పాతాళానికి జారిపోయే ప్రమాదం ఉంది. ఈ ఆలోచనాలోచనాలతో కొంతైనా భావితరాలవారికి మేలు జరుగుతుందనే తలంపుతో మా 'నవశంఖ ఫలకం' తలెత్తుతోంది. ఈ వేదికమీద నిలబడి మా 'యువ మిత్రులం' ముక్తకంఠంతో విప్లవశంఖం పూరిస్తున్నాం! నవశకానికి నాందీవాచకం పలుకుతున్నాం".

– అని కరపత్రంలో పేర్కొన్నారు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఈ నాందీవాచకమే భరతవాక్యంగా మారటం.

## సమతా రచయితల సంఘం : ♦

"నాకున్న పరిధిలో మిత్రులు శ్రీయుతులు రాజగోపాలరాజు, చక్కా సత్యనారాయణమూర్తి, పి. వి. ఎన్. రాజు, టి. ఆర్. సోమయాజులు, వక్కలంక రామకృష్ణ తదితరులతో కలసి సాహిత్య దృక్పథంతో ఉడతాభక్తిగా ఈ 'సమతా రచయితల సంఘం' – సమతా మానవతా భావంతో సమసమాజ నిర్మాణ ధ్యేయంతో ఇటు కవితాలోకంలోనూ, అటు సాంఘిక నైతికస్థితుల పరిరక్షణలోనూ సమంగా కృషిచేసి మాకున్న పరిధిలో మేమేమైనా చెయ్యగలమా? లేదా? అనేది పరీక్షించుకొందుకూ – ఎంతో కొంత సాధిస్తామనే ఆశాభావంతో యథాశక్తిగా తలపెట్టాం." (సమత – కవితా సంకలనంలో ముందుమాట)

– అని ఈ సంస్థ వ్యవస్థాపక కార్యదర్శి శ్రీ ఆచంట సుదర్శనరావు వినయంగా మనవిచేశారు. అయితే 1972లో స్థాపించబడిన నాటినుంచి నేటివరకు – 23 సంవత్సరాలు నిర్విఘ్నంగా సంస్థ కొనసాగడమేకాదు –

---

♦ సంస్థ వ్యవస్థాపకులలో ఒకరైన చక్కా సత్యనారాయణమూర్తి గారు తెలిపిన సమాచారం ఆధారంగా.

సాహితీ చైతన్యంద్వారా కవుల్ని, కార్యకర్తల్ని, కవయిత్రుల్ని తయారు చేసిందికూడా.

కొల్లూరి (ఎక్స్ రే సంపాదకుడు), ఆసు రాజేంద్ర (గుండె చప్పుళ్ళ కవి), వసీరా (లోహనది), పచ్చిగోళ్ళ సుధ – వీరంతా సమత రచయితల సంఘంద్వారా వెలుగులోకి వచ్చినవారే. ఈ సంస్థ విజయవంతంగా నిర్వహింపబడటంలో కొల్లూరి, పెమ్మరాజు గోపాలకృష్ణ, నందుల వెంకటేశ్వరరావు, చక్కా సత్యనారాయణమూర్తి, పి. వి. ఎన్. రాజు, యు. ఆశీర్వాదం (చిత్రకారుడు), పీసపాటి కృష్ణమూర్తి, మంతెన సూర్యనారాయణరాజు (కవి, నాటకకర్త) ప్రభృతులు కృషిచేశారు.

ఈ సంస్థ యువకులచే ప్రారంభించబడింది. అద్దేపల్లి రామమోహనరావు, ఘనశ్యామలప్రసాద్, బి. వి. రమణమూర్తిగార్ల సహకారం లభించింది. స్థానిక జిల్లా గ్రంథాలయాధికారుల తోడ్పాటు లభించింది. ఈ యువకుల సాహితీ సంబరానికి వదాన్యుల ఆర్థిక సహకారం లభిస్తూనేఉంది ప్రాచీన సాహిత్యంపట్ల ద్వేషభావం లేదుగానీ – ఆధునిక సాహిత్యంపట్ల మక్కువ ఎక్కువ.

సమత రచయితల సంఘం చేపట్టిన కార్యక్రమాలలో చెప్పుకోదగినవి ఉన్నాయి. 1980లో మొట్టమొదటి సారిగా రాష్ట్రస్థాయిలో మినీ కవితాసదస్సును ఏర్పాటుచేసిన ఘనత ఈ సంస్థకే దక్కుతుంది. ఈ సదస్సులో మినీకవితలకు డాక్టర్ జి. వి. పూర్ణచంద్ గీసిన భావచిత్రాల ప్రదర్శన మరపురాని విశిష్ట కార్యక్రమంగా పేరుపొందింది.

సర్వశ్రీ బెజవాడ గోపాలరెడ్డి, పురిపండా అప్పలస్వామి, కుందుర్తి ఆర్. ఎస్ సుదర్శనం, వాకాటి పాండురంగారావు, సోమసుందర్, జ్వాలాముఖి, నగ్నముని, అద్దేపల్లి రామమోహనరావు, పురాణం సుబ్రహ్మణ్య

శర్మ వంటి సాహితిప్రముఖులు ఈ సంస్థ కార్యక్రమాలలో పాల్గొని యువకులలో సాహిత్యాభిలాషను కలిగించారు.

సమత రచయితల సంఘానికి రాష్ట్రవ్యాప్తంగా పేరు తీసుకొచ్చింది ఉత్తమ వచనకవితా సంపుటికి బహుమతిప్రదాన కార్యక్రమం. ప్రతి సంవత్సరం ఒక ఉత్తమ వచనకవితా సంపుటికి ఇచ్చే బహుమతి సొమ్ము తక్కువే అయినా _ ఈ సంస్థనుంచి బహుమతి పొందడం ఒక 'అర్హత'గా భావించడం జరుగుతోంది. 'స.ర.సం.' సభ్యుల కవితా సంపుటాలు ఈ బహుమతికి యోగ్యం కావని సంఘం తీర్మానించిందికూడా. సమత రచయితల సంఘం ప్రకటించిన వచనకవితా సంపుటాలను, కవులను పరిశీలిస్తే ఆధునిక కవిత్వంతో ఆ కవితా సంపుటాలకు, ఆయా కవులకు ఎంతో గుర్తింపు వచ్చిందని విదితమవుతుంది.

సమత రచయితల సంఘం ప్రచురణలుకూడా చేపట్టింది. 1974 నుంచి 1989 వరకు పదకొండు పుస్తకాలు ప్రచురించటం సామాన్య విషయంకాదు. స. ర. సం. సభ్యుల రచనలే కాకుండా ఇతరుల రచనలు కూడా సేకరించి ప్రచురించింది. ఈ సంఘం ప్రచురించినవాటిలో కవితా సంపుటులు (ఎనిమిది) ఎక్కువ.

కొల్లూరి ఇతరవ్యాపకాలలో నిమగ్నమైపోవటంవల్ల, ఆసు రాజేంద్ర సంస్థనుంచి తప్పుకోవటంవల్ల, మరికొందరు ఉద్యోగాలరీత్యా ఇతర ప్రాంతాలకు వెళ్ళిపోవటంవల్ల గతమూడు సంవత్సరాలుగా సమతరచయితలసంఘం మందకొడిగా నడుస్తోంది.

## జాతీయ సాహిత్య పరిషత్ :

"జాతి పురోభివృద్ధికి, ఉత్తమ సంస్కారాల నిర్మాణానికి సాహిత్యం ప్రేరకం కావాలని జాతీయ సాహిత్య పరిషత్ నమ్ముతున్నది. సాహిత్యంలో హింస, అవినీతి, పరావలంబనము, దుశ్శీల ప్రచారం, వ్యాపార

ధోరణులను నిరసిస్తుంది" అని జాతీయ సాహిత్య పరిషత్ రాష్ట్ర కార్య దర్శి, అమలాపురం జాతీయ సాహిత్య పరిషత్ శాఖ వ్యవస్థాపకులు డాక్టర్ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాద్‌గారు సంస్థ లక్ష్యాలను వివరించారు కృష్ణస్వామి, బి. వి. రమణమూర్తి, మంగళంపల్లి రామనరసింహం, సి. హెచ్. కె. రాజు మొదలైనవారి సారథ్యంలో ఈ సంస్థ అమలాపురంలో సాహిత్య కార్యక్రమాలు ఏర్పాటు చేసింది. "విశ్వ శ్రేయః కావ్యమ్" అనే సూక్తిని ఆదర్శంగా తీసుకొని జాతీయతకు ఉపకరించే సాహిత్యంపైననే సభలు ఏర్పాటుచేసింది. ఈ సంస్థ 1978 – ఏప్రిల్ 8, 9 తేదీలలో తూర్పు గోదావరి జిల్లా రచయితల సభలను అత్యంత వైభవంగా నిర్వహించింది.

కేవలం ప్రాచీన సాహిత్యానికే ప్రాధాన్యం ఈయటంవలన – ఆధునిక సాహిత్యంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా కార్యక్రమాలు నిర్వహించకపోవటంవల్ల, ఆర్థికంగా ప్రోత్సాహం లేకపోవటంవల్ల, రాష్ట్ర నాయకత్వమే నిర్లక్ష్యం వహించటంవల్ల గత అయిదు సంవత్సరాలుగా జాతీయ సాహిత్య పరిషత్ – అమలాపురంశాఖ కార్యక్రమాలు నిర్వహించడంలేదు

## సాహితీ మిత్రమండలి :

సర్వశ్రీ బి. ఎస్, రాజు, రేకపల్లి శ్రీనివాసమూర్తి, కె. వెంకటేశ్వరరావు, నల్లా నరసింహమూర్తి ప్రభృతులు 'ఫ్రెండ్స్ సర్కిల్' గా ఏర్పడి గోష్ఠులు, సభలు నిర్వహిస్తూ – 1984 జనవరి 14 – సంక్రాంతి నాడు "సాహితి మిత్రమండలి" ని స్థాపించారు. ప్రస్తుతం బి ఎస్. రాజు తప్ప మిగతా ముగ్గురు ఈ సంస్థ నిర్వహణ బాధ్యతలను తమ భుజాలపై వేసుకున్నారు. శ్రీ సలాది శ్రీరామ చంద్రమూర్తి, దువ్వూరి సుబ్రహ్మణ్యశర్మ, దేవగుప్తాపు వెంకు ప్రభృతులు సభ్యులుగా ఉన్నారు.

సంస్థ అధ్యక్షులు శ్రీ రేకపల్లి శ్రీనివాసమూర్తి సొంతసంస్థగా చెప్పవలసిన 'సాహితీ మిత్రమండలి' ఇప్పటికి చిన్న, పెద్ద సభలు, గోష్ఠులు అన్నీ కలిపి దాదాపు రెండువందల కార్యక్రమాలను చేసట్టినట్టు సంస్థ కార్యదర్శి శ్రీ నల్లా నరసింహమూర్తి తెలిపారు. కవుల జయంతులు సంస్మరణ సభలతోపాటు వివిధ సాహిత్యాంశాలపై కార్యక్రమాలు నిర్వహించిన ఈ సంస్థ – వచన కవితలపోటీ నిర్వహించింది విమర్శనా గ్రంథాలకు బహుమతి ఇవ్వటం, ఉత్తమ పద్యశతకానికి బహుమతిఇవ్వటం ఈ సంస్థ ప్రత్యేకతలు. సాహితీ మిత్రమండలి నాలుగు గ్రంథాలను ప్రచురించింది. అవి పసిడి తళుకులు, ఉదయరాగం, చీకటిబొమ్మ, శాంతికపోతాలు.

## త్రివేణి :

"తెలుగువారిలో సాహిత్య రసికత్వాన్ని సముల్లసితం చేయటానికి కళాశీలతను పెంపొందించటానికి ఉడుతాభక్తిగా సాహితీప్రియుల, కళాభిమానుల ఆదరాభిమానాలతో 4_2_86 న కోనసీమ నడిబొడ్డున అమలాపురంలో స్థాపించబడిన సంస్థ" త్రివేణి. ♦ 'నృత్య గీత సాహిత్య కళా వేదిక'గా స్థాపించబడినా – సాహిత్యానికే ప్రథమ తాంబూలం.

డాక్టర్ గుత్తుల దేవీమీనాక్షి, క్షందుకూరి పుండరీకాక్షుడు, డాక్టర్ బి. వి! రమణమూర్తి, డాకర్ బి. శ్యామలరావు, కొల్లూరి లక్ష్మి, కొల్లూరి సుబ్బారావు, ద్వా. నా. శాస్త్రి, డాక్టర్ కె. హనుమంతరావు, శ్రీ జె. వి. ఎస్. ఆర్. భాస్కరశర్మ, కష్ణస్వామి, పి. డి. వి. రామచంద్రుడు మొదలైన వారి నిర్వహణలో త్రివేణి పెద్దఎత్తున సాహిత్య కార్యక్రమాలను చేపడుతోంది. 160 మంది జీవిత సభ్యులతో ఏర్పడిన 'త్రివేణి' సంస్థ ప్రాచీన నవీన సాహిత్యాలను సమీకరిస్తుంది. ఈ సంస్థ నిర్వహించిన సాహిత్య కార్యక్రమాలలో విశిష్టమైనవి మూడున్నాయి.

తొలి వార్షిక నివేదిక (1987) ఆధారంగా.

సాహిత్య సప్తాహం : ప్రతి సంవత్సరం ఏడురోజులు లబ్ధప్రతిష్ఠులయిన ఆయా విషయాలలో నిష్ణాతులైన సాహితీవేత్తలను ఆహ్వానించి వదాన్యుల సహకారంతో 'సాహిత్య సప్తాహం' ఏర్పాటు చేయడం పేర్కొనదగినది. ప్రాచీన కవులపై, ఆధునిక కవులపై ఏర్పాటుచేసిన సాహిత్య సప్తాహాలు పలువురి మన్ననలు పొందాయి. ఈ సాహిత్య సప్తాహాలలో ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మగారు, ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు, ఆచార్య చేకూరి రామారావుగారు, ఆచార్య శలాక రఘునాథ శర్మగారు, ఆచార్య సర్వోత్తమరావుగారు, డాక్టర్ కె. రామమోహనరాయ్, అద్దేపల్లి రామ మోహనరావుగారు, డాక్టర్ ముదిగొండ శివప్రసాద్‌గారు, ఏల్చూరిపాటి అనంతరామయ్యగారు, మల్లంపల్లి శరభయ్యగారు, ఆచార్య దివాకర్ల వెంక టావధానిగారు ప్రభృతులు పాల్గొని 'త్రివేణి' సంస్థకు పేరు ప్రతిష్ఠలు తీసుకొచ్చారు.

శతావధానం : అమలాపురంలో ఈ తరంవారు ఎరుగని శతావధాన కార్య క్రమాన్ని 'త్రివేణి' సంస్థ అత్యంత సమర్థవంతంగా నిర్వహించింది. 1987 లో కడిమిళ్ళ వరప్రసాదు (నరసాపురం) శతావధానాన్ని మూడు రోజులపాటు జరిపి అందరిమన్ననలు పొందింది. ఆచార్య బేతలోలు రామ బ్రహ్మంగారి ఆధ్వర్యంలో, శ్రీ ధావూరి వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతన జరిగిన ఈ శతావధానం మరువరానిది. ఈ శతావధాన పధాకలను ఒక పుస్తకంగా ప్రచురించటం చెప్పుకోదగినది. ప్రస్తుతం సాహితీబంధు శ్రీ ఆర్. వి. యస్. సూర్యనారాయణరాజు అధ్యక్షులుగా, శ్రీ ఇ. ఆర్. యస్. సుబ్రహ్మణ్యం కార్యదర్శిగా సంస్థ అప్పుడప్పుడు కార్యక్రమాలు చేపడుతోంది. విశిష్ట కార్యక్రమాలద్వారా అమలాపురంలో పేరుపొందిన 'త్రివేణి' సంస్థ స్థానిక సాహితీవేత్తలను ప్రోత్సహించటం లేదనే విమర్శ వుంది. ఈ సంస్థ తరపున "కళాత్రివేణి" అనే బులిటిన్ కూడా వెలువడు తోంది.

దీపిక :

"సాహిత్య విజ్ఞాన రంగాలలో పరస్పరావగాహనే లక్ష్యంగా మిడి మిడి పరిజ్ఞానంతో సతమతమయ్యేవారిలో సమగ్ర విజ్ఞానం, ఆశక్తి కలిగించేందుకు" దీపిక సంస్థ – ఒక సాహిత్య సమాలోచనా వేదికగా ప్రారంభించబడింది. ఎస్. కె. బి. ఆర్. కళాశాల పాలకవర్గ సభ్యులు శ్రీ నడింపల్లి సుబ్బరాజు వ్యవస్థాపకులుకాగా, పెడిపాల కార్యదర్శి. పలువురిచేత పలు అంశాలలో ఉపన్యాసాలు ఏర్పాటుచేసి చర్చానదస్సులను నిర్వహించిన సంస్థ ఇది. కాశీపట్నం రామారావు, గొల్లపూడి మారుతీరావు, శశికాంత్ శాతకర్ణి, రావి కొండలరావు ప్రభృతులు దీపిక సమావేశాలలో పాల్గొన్నారు. నాగభైరవ కోటేశ్వరరావుగారి సమక్షంలో ఆయన రచించిన 'కవన విజయం' రూపకాన్ని స్థానిక కళాశాల ఉపన్యాసకులచే ప్రదర్శింపజేసి ప్రత్యేకతను సంతరించుకొంది. ప్రస్తుతం ఈ సంస్థ కార్యకలాపాలు కొనసాగించటంలేదు.

అమలాపురంలో పైన పేర్కొనిన సంస్థలుకాక విజ్ఞాన సమితి, సాంస్కృతీ సమాఖ్య అనే సంస్థలుకూడా లేకపోలేదు. అయితే వాసమూర్తి గారి ఆధ్వర్యంలో కొన్నాళ్ళపాటు నడిచిన విజ్ఞానసమితివి సాహిత్య సంస్థగాకంటె శాస్త్రవిజ్ఞానాన్ని వ్యాప్తిచెందించిన సంస్థగా పరిగణించవలసి వుంటుంది. రాష్ట్ర స్థాయిలోగల సాంస్కృతీసమాఖ్య తూర్పు గోదావరి జిల్లాలో అమలాపురంలోకూడా ఒక అనుబంధశాఖను కొంతకాలం నడిపింది ఇక్కడ ప్రత్యేకమైన కార్యవర్గంలేదు. ఈ సంస్థ ప్రతినిధిగా కొల్లూరి – ఆ సంస్థ పేరుతో రెండు మూడు కార్యక్రమాలను నిర్వహించారు. అయితే 'మినీ కవితా విప్లవం' పేరుతో రెండువందల మంది కవుల మినీ కవితల సంపుటిని ప్రచురించిన సాంస్కృతీ సమాఖ్య, సంపాదకులు కొల్లూరి అభినందనీయులు.

కవులు, కథారచయితలు, పండితులు, నాటక కర్తలు. విమర్శకులు, ఉపన్యాసకులు ఎక్కువగాగల అమలాపురంలో సాహిత్యసంస్థలు ప్రస్తుతం

మూడు నాలుగు పనిచేస్తున్నా – ఈ సంస్థలమధ్య సహకారం – సమన్వయ దృక్పథం లేనందువల్ల 'ఎవరికి వారే' అన్న విధంగా నిర్వహింపబడు తున్నాయి.

## రాజోలు :

రాజోలులో సాహిత్య కార్యక్రమాలు నిర్వహించే సంస్థలు లేవనే దిగులుతోఉన్న కవిగారు – శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తిగారు (శ్రీశ్రీశ్రీ) కొంతమంది మిత్రులతో కలిసి చర్చించారు. తత్ఫలితంగా 1982 మే లో శ్రీశ్రీశ్రీగారు అధ్యక్షులుగా, శివలెంకప్రసాదరావు కార్యదర్శిగా "సాహితి స్రవంతి" అనే సంస్థ ప్రారంభించబడింది.

'కళాసాగర' శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావుగారిచే ప్రారంభించ బడిన 'సాహితిస్రవంతి' లో సుమారు ఏభై మంది సభ్యులున్నారు. సంస్థ గౌరవాధ్యక్షురాలైన డాక్టర్ అల్లూరి రాజకుమారిగారు "సాహితిస్రవంతి"కి మూలస్తంభంగా నిలిచి సంస్థ అభివృద్ధికి కృషిచేస్తున్నారు. ఈ సంస్థ అభి వృద్ధికి సర్వశ్రీ బిక్కిన సత్యనారాయణ, ఎమ్. వి. సుబ్బారావు, నున్న నాగేశ్వరరావు, కొప్పర్తి, వింజమూరి శేషఫణిశర్మ, పొన్నాడ హను మంతరావు, శ్రీమతి వాగ్దేవు రమాదేవి ప్రభృతులు సహకారం అందిస్తు న్నారు.

సాహిత్యోపన్యాసాలతో, అష్టావధానాలతో, బుర్రకథలతో రాజోలు వంటి మారుమూల ప్రాంతంలో సాహితీ చైతన్యాన్ని తీసుకువస్తున్న 'సాహితి స్రవంతి' విశిష్ట కార్యక్రమాలుకూడా ఏర్పాటు చేస్తోంది. అల్లూరి రాజకుమారిగారు, తమ తల్లిదండ్రులు – అల్లూరి అచ్యుతమ్మ, అల్లూరి నారాయణరాజుగార్ల స్మృత్యర్థం ప్రతి సంవత్సరం సాహిత్య కార్యక్రమా లను నిర్వహించటంతో సంస్థకు ప్రాచుర్యం లభించింది. ప్రాచీనాధునిక సాహిత్యాలకు ఈ సంస్థ వారధిగా నిలుస్తోంది.

# ముంగండ

## విశ్వసాహిత్యమాల :

'మునిఖండము' అనే ప్రాచీననామంగల ముంగండ జగన్నాథ పండితరాయలవారి స్వగ్రామం. ఇప్పటికీ ముంగండలో సాహితీవేత్తలు, లాక్షణికులు, వేదపండితులు ఉన్నారు. 1935లో మహీధర సోదరులుగా పేరుపొందిన - రామమోహనరావుగారు కలిసి "విశ్వసాహిత్యమాల" ను స్థాపించారు.

ఈ సంస్థ ప్రధానాశయం గోష్ఠులు నిర్వహించడం. అప్పటికి రాజోలు, ముంగండ ప్రాంతాలలో సామ్యవాద సిద్ధాంతం (సోషలిజం) తెలిసినవాళ్ళు ఉండేవారు కారు. అందువల్ల సామ్యవాద సాహిత్య ప్రచారం కోసం ఈ సంస్థ ఏర్పాటుచేశారు,♦ లెనిన్, గోర్కీల సాహిత్యాలపై చర్చా సదస్సులు నిర్వహించారు. మూడు సంవత్సరాలదాకా గోష్ఠులు నిర్వహించి - తర్వాత అవి మానేసి ప్రచురణ బాధ్యతలు చేపట్టారు. 1938-40 మధ్య సోషలిస్టు గ్రంథాలను ప్రచురించారు. కమ్యూనిస్టు సాహిత్య ప్రచారానికి కృషిచేసిన 'విశ్వసాహిత్యమాల' వ్యక్తిగతమైన బాధ్యతలవల్ల ముగ్గురు విడిపోవటంతో సంస్థ అంతరించి పోయింది.

ఈ విధంగా తూర్పుగోదావరిజిల్లాలో సాహిత్య సంస్థలు సాహితీ సేవను కొనసాగించాయి - కొనసాగిస్తున్నాయి. వ్యక్తిగతమైన సంస్థలు, ఆవిష్కరణలకు సన్మానాలకు పరిమితమైన సంస్థలు లేకపోలేదు. అయినా వాటివల్ల కూడా ఎంతోకొంత సాహితీసేవ జరుగుతోంది కదా ! తూర్పు గోదావరిజిల్లా విస్తీర్ణంలో పెద్దది. సంపదలు పుష్కలంగాగల ప్రాంతం. కాబట్టి ఎక్కువ సంఖ్యలో సాహిత్యసంస్థలుండటంలో ఆశ్చర్యం లేదు.

---

♦ మహీధర రామమోహనరావుగారు తెల్పిన అంశాలు.

# నాల్గవ అధ్యాయం

## పశ్చిమగోదావరిజిల్లాలో సాహిత్య సంస్థలు

పశ్చిమగోదావరిజిల్లాను సాహిత్యపరంగా–పరిశోధనా సౌలభ్యం కోసం మూడు సాహిత్య మండలాలుగా విభజింపవచ్చు:

ఏలూరు మండలం : ఏలూరు, తణుకు, తాడేపల్లిగూడెం

భీమవరం మండలం : భీమవరం, పాలకొల్లు

నరసాపురం మండలం : నరసాపురం, పెనుగొండ, నిడదవోలు

ప్రధానమైన ఈ పట్టణాలతో పాటు కొవ్వూరు, కొంతుదురు, మార్టేరు, పెదపాడు, అర్లపాడు వంటి ఊళ్ళల్లో కూడా సాహిత్య సంస్థలు లేకపోలేదు. ఈ జిల్లాలో మొత్తం లెక్కకువచ్చిన సంస్థలు 33 వరకు ఉన్నాయి. అవి

ఏలూరు :

1. సాహిత్యమండలి
2. తెనుగు దర్బారు
3. చైతన్య వేదిక
4. ఎంకిపాటల పండుగ

భీమవరం :

5. శ్రీ రామరాజభూషణ సాహిత్యపరిషత్
6. కవు ప్రవంతి
7. కళాసమాఖ్య
8. భాగవత విజ్ఞాన సమితి
9. రసచంద్రిక
10. సాహితీసంసత్
11. వసంత భారతి
12. కవితా ప్రభాస
13. జాహ్నవీ సాహితీ సమితి
14. రవీంద్ర సారస్వత సమాజం
15. శ్రీనివాస భారతి

తణుకు :

16. నన్నయభట్టారక పీఠం
17. నరేంద్రనాధ సాహిత్యమండలి
18. సాహితీ సరోవరం

తాడేపల్లిగూడెం :

19. తెలుగు సాహితీ సమాఖ్య
20. లలితకళాసమితి

నరసాపురం : 21. సాహితీ నికుంజము
22. మహాకవి జాషువాజయంతి సమితి
23. జ్ఞానపీఠ నిలయం
నిడదవోలు : 24. అభ్యుదయ సమితి
25. చైతన్య సాహితీ సమాఖ్య
పాలకొల్లు : 26. పోతనామాత్య పీఠం
పెనుగొండ : 27. సరసభారతి
28. రమ్యసాహితీ సమితి
మార్టేరు : 29. కౌముదీ కళానికేతన్
పెదపాడు : 30. సాహితీసుధ
కొవ్వూరు : 31. సాహితీ కళా సంసత్
కొంకుదురు : 32. సాహిత్య కళాసమితి
అర్లపాడు : 33. సారస్వత చంద్రికామండలి

సాహిత్య సంస్థల సంఖ్యలోనూ – కార్యక్రమాల నిర్వహణలోను భీమవరమే ప్రథమస్థానం వహిస్తుంది. ఏలూరులోని 'సాహితీమండలి' ఒకప్పుడు రాష్ట్రవ్యాప్తంగా పేరొందిన సంస్థ. తణుకులోని నన్నయ భట్టారక పీఠంకూడా ప్రసిద్ధికెక్కినదే. ముందుగా ఏలూరులోని సంస్థలు పరిశీలిద్దాం :

## ఏలూరు ప్రాంతంలోని సాహిత్య సంస్థలు

### ఏ లూ రు

ఏలూరులోగల నాలుగు సాహిత్య సంస్థలలో ప్రముఖమైన, ప్రాచీనమైన సాహిత్యసంస్థ 'సాహిత్యమండలి'. మిగిలిన సంస్థలు మామూలు సంస్థలే!

## సాహిత్య మండలి : ♦

ఏలూరులోని 'సాహిత్యమండలి' గురించి ఆ సంస్థ వ్యవస్థాపకులైన 'సాహితీవల్లభ' సామవేదం జానకీరామశర్మగారి పద్యం గుర్తుకు వస్తుంది –

"పేరు సాహిత్యమండలి – పెంపుచేర
వృద్ధి గావించి యుంట జీవితమునద్ది
గట్టిగాఁ జుట్టిరేఁబవల్ పట్టినన్నుఁ
గూర్చునద్వైత భావమ్ము కొసరి కొసరి"

ఘనత వహించిన 'సాహిత్యమండలి' ఏవిధంగా స్థాపించబడిందో వ్యవస్థాపకులలో ఒకరైన సామవేదం జానకిరామశర్మగారుముఖాముఖిగా చెప్పిన మాటలలో తెలుసుకోవచ్చు –

"నేనున్న వసంతవాడ గ్రామంలో సాహిత్య ప్రశక్తి ఉండేదికాదు ఏలూరులో సంస్కృతాంధ్రవిద్వాంసులుండేవారు. వారిలో మరూరు లక్ష్మీ నరసప్ప పంతులుగారొకరు. జిల్లా ట్రెజరి ఆఫీసరుగా వుంటూ తేటగీతులలో రామాయణం రాస్తుండేవారు. సోమంచి లింగయ్యగారిని – అడ్వకేట్ – ఆంధ్రాంగ్ల సాహిత్యాలలో దిట్ట. ఆయన దివ్యజ్ఞాన సమాజ సభ్యుడు. బొమ్మకంటి సింగరాచార్య. శ్రీనివాసాచార్య – ఈ ఇద్దరు సోదరులు సాహిత్యంపై సరైన అవగాహన కలవారు. వీళ్ళూ నేను రోజూ కలుసుకొనేవాళ్ళం. ఆ వాతావరణం తలుచుకొంటే గుండె ఉద్విగ్నమవుతుంది.

మనం ఒక సాహిత్య సంస్థను ప్రారంభిద్దాం. నిత్యజీవితంలో భాగం కావించుకుందాం ? అని లింగయ్య గారితో అన్నాను. భోగరాజు పట్టాభిరామయ్యగారి బంధువులు – బుచ్చిరాలాయ్యగారు. ఆంధ్రపత్రిక

---

♦ సామవేదం జానకిరామశర్మగారు, పుల్లాభొట్ల శ్రీరామమూర్తిగారు, శంకర శ్రీరామారావుగారు తెలిపిన సమాచారం ఆధారంగా.

కరస్పాండెంట్ మంగళంపల్లి చంద్రశేఖరరావుగారు, నరసప్ప పంతులు గారు నిత్యం కలుస్తూ చర్చించుకుంటూ ఉండేవాళ్ళం. లింగయ్యగారింటి దగ్గరే సాహిత్య మండలిని స్థాపించాం.

ఆ విధంగా 10_1_1939 న ప్రారంభమైన సాహిత్య మండలిలో వ్యవస్థాపక సభ్యులుగా శ్రీయుతులు పైడిపాటి సుబ్బరామశాస్త్రి, వేమూరి ఆంజనేయశర్మ, బుద్ధిరాజు రాజభూషణరావు, డా॥ శంకర శ్రీరామారావు లు ఉన్నారు. 1943 లో రిజిష్టరు చేయబడిన ఈ సంస్థను –

సర్వశ్రీ చుండూరి శ్రీరాములు
సోమంచి లింగయ్య
నండూరి సుబ్బారావు
వేలూరి జగన్నాధరావు
సామవేదం జానకిరామశర్మ
గరికిపాటి మల్లావధాని
పోతుకూచి రామజోగేశ్వరరావు
బుద్ధిరాజు రాజభూషణరావు

ప్రభృతులు 'అధ్యక్షులు'గా పనిచేసి సంస్థను చక్కగా నిర్వహించారు.

'సాహిత్యమండలి' కార్యక్రమాలకు ఆర్థికంగా సహకరించి సంస్థ పురోభివృద్ధికి పాటుపడిన వారిలో - కలగర నాగభూషణం, తాళ్ళూరి సుబ్బారావు, శీతంరాజు కేశవరావు, జవ్వాది లక్ష్మయనాయుడు, బిక్కిన వెంకటరత్నం, గారపాటి కనకయ్య, డాక్టర్ రంగయ్య, దామరాజు వెంకటారావు, ఈదర వెంకట్రామయ్య ముఖ్యులు.

సాహిత్య మండలి కార్యక్రమాలను నిర్వహించటంలో శక్తి యుక్తుల్ని ప్రదర్శించి సంస్థకు పేరు ప్రతిష్ఠలు తీసుకొచ్చిన కార్యదర్శులలో – సర్వశ్రీ మంగళంపల్లి చంద్రశేఖరరావు
బొడ్డు బాపిరాజు

బి. వి. సింగరాచార్య
బొమ్మకంటి సింగరాచార్య
జానకీజాని
వెల్చేరు నారాయణరావు లు ముఖ్యులు

సంస్థ కార్యవర్గానికి ఎప్పుడూ 'ఎన్నికలు' జరగలేదు. కొందరు కలిసి ఏకాభిప్రాయానికి వచ్చేవారు. వాళ్ళే కార్యవర్గంగా ఎన్నికయ్యేవారు. అందుకనే డాక్టర్ శంకర శ్రీరామారావుగారు – "Executive body Not by Election - but by Selection" అన్నారు. సభ్యులుగా చేర్చుకొనే విషయంపై తొలిరోజుల్లో భేదాభిప్రాయాలు వచ్చేవి. సాహిత్య పరిచయం, రచనాశక్తి ఉన్నవాళ్ళే సభ్యులుగా ఉండాలని కొందరనేవారు. కార్యక్రమాలకు డబ్బుకావాలి కాబట్టి – ధనవంతులు, పేరున్నవాళ్ళు 'సాహిత్యశక్తి' లేకపోయినా సభ్యుల్నిగా చేర్చుకోవాలని మరి కొందరు వాదించేవారట.

## కార్యక్రమాలు :

'సాహిత్య మండలి' నెలవారీ చర్చలతో, సంస్కృతాంధ్ర ఆంగ్ల సాహిత్య సభలతో, స్వీయరచనా పఠనాలతో చైతన్యవంతమైన కార్యక్రమాలను చేపట్టిన గొప్ప సంస్థ. ఆనాటి సాహితీ విశిష్టులు – శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, తిరుపతి వేంకటకవులు, కాశీ కృష్ణాచార్య, విశ్వనాథ సత్యనారాయణ, కాటూరి వేంకటేశ్వరరావు, గుఱ్ఱం జాషువా, దేవులపల్లి కృష్ణశాస్త్రి, తుమ్మల సీతారామమూర్తి వంటివారు 'సాహిత్య మండలి'లో ఉపన్యసించి సంస్థ స్థాయిని పెంచారు. ఈ సంస్థ కార్యక్రమాలకు చుట్టుప్రక్కల ఊళ్ళనుంచికూడా శ్రోతలు వచ్చేవారట. 'సాహిత్య మండలి' నిర్వహించిన విశిష్ట కార్యక్రమాలలో కొన్ని:

1 ప్రాచీన జానపద కళారూపమైన తోలుబొమ్మలాట ప్రదర్శనలు

2 హరికథలకు, బుర్రకథలకు ప్రాధాన్యం

3 కావ్య, కథాపఠనాలు

4 అష్టావధాన, నేత్రావధాన కార్యక్రమాల నిర్వహణ

5 పశ్చిమగోదావరి జిల్లా రచయితల మహాసభల నిర్వహణ

6 'ఆంధ్ర బెర్నార్డ్ షా' గా పిలువబడే అంధులు – శ్రీ వేదాంతకవి గారిచే గంటకు నూరు పద్యాలు ఆశువుగా చెప్పే కార్యక్రమ నిర్వహణ.

7 నవ్యసాహిత్య పరిషత్ సభలను, సాహితీ సమితి వార్షికోత్సవ సభలను, ఆంధ్ర నాటక కళాపరిషత్ వార్షికోత్సవ సభలను, 'సాహిత్య మండలి' నిర్వహించింది.

8 రాయలసీమ కళాపరిషత్ (హిందుపురం) వార్షికోత్సవాలు 1945, డిసెంబరులో సాహిత్యమండలి ఆధ్వర్యాన నాలుగురోజులు అత్యంత వైభవంగా నిర్వహించబడ్డాయి.

9 దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తమ రేడియో నాటికలను, అముద్రిత కవితలను ఈ సంస్థ కార్యక్రమాలలో చదివేవారు. బందా కనక లింగేశ్వరరావుగారు జయదేవుని అష్టపదులను, బసవరాజు అప్పారావుగారి గీతాలను తఱచు గానం చేసేవారు.

10 ఒక కార్యక్రమంలో తల్లావజ్ఝల శివశంకర శాస్త్రిగారు 'కవిప్రియ' నాటిక పూర్తిగా చదివి వినిపించారు.

11 చుట్టుప్రక్కల ప్రాంతాలకు 'సాహిత్య యాత్ర' లు జరిపి కవితా పఠనాలతో, ఉపన్యాసాలతో, పాటలతో శ్రోతల్ని సాహిత్యాభిలాషులుగా చేసేవారు.

## శ్రావణి :

'సాహిత్యమండలి' కొన్నాళ్ళు 'శ్రావణి' అనే లిఖిత పత్రికను నడిపినట్లు తెలిసింది. అయితే అవి లభ్యంకాలేదు. చతుర్థ వార్షికోత్సవం సందర్భంగా 1943లో ప్రచురితమైన గద్య, పద్య వ్యాసావళి—'శ్రావణి' లభ్యమైంది.♦ ఈ 'శ్రావణి' సంచికను సాహితీ విలువలుగల అపురూప సంచికగా పేర్కొనవచ్చు. ఈ సంచికలో —

కవితలు : ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ పిలకా గణపతిశాస్త్రి, పింగళి—కాటూరి, సామవేదం జానకిరామశర్మ, తుమ్మల సీతారామమూర్తి, తిలక్, ఊటుకూరు సత్యనారాయణరావు. కోపల్లె రామలింగస్వామి, బి. వి. శ్రీనివాసాచార్య, పైడిపాటి సుబ్బరామశాస్త్రి, కొనకళ్ళ వెంకటరత్నం, మొక్కపాటి కృష్ణమూర్తి, బి. వి. సింగరాచార్యల కవితలున్నాయి.

సాహితీ లోకంలో ప్రసిద్ధిచెందిన విశ్వనాథవారి "విశ్వనాథ పంచశతి" తొలుత శ్రావణిలోనే ప్రచురితమైంది.

పింగళి — కాటూరి 'జంటకవుల' — 'కవిసంభవము', సామవేదం వారి 'నవ్య సృష్టి', కోపల్లె రామలింగస్వామిగారి 'గులాబి', బి. వి. శ్రీనివాసాచార్యగారి 'యశోద', తుమ్మలవారి 'గాంధి సూక్తులు' (ఆత్మకథనుండి), పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి 'గండపెండేరము', కొనకళ్ళవారి "మొక్కజొన్న తోటలో...", మొక్కపాటివారి 'నా కళలు' (గేయం), హనుమచ్ఛాస్త్రిగారి 'గోదావరి' శ్రావణిలో చోటుచేసుకున్నాయి వచన కవిత్వానికి పుష్టిని చేకూర్చిన — అమృతం కురిసిన రాత్రిని అందించిన దేవరకొండ బాలగంగాధరతిలక్ 'గోరువంకలు' అనే పద్యఖండిక రాశారు.

---

♦ 'జిరాక్స్ కాపీ'ని బొమ్మకంటి శ్రీనివాసాచార్యగారు పంపారు.

కథలు : సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారి 'ఆశ', కొనకళ్ళ వెంకట రత్నంగారి 'విముక్తి', రావూరు వెంకటసత్యనారాయణరావుగారి 'ప్రారంభోత్సవం' అనే మూడు కథలూ పదికాలాలపాటు పదిలంగా దాచుకొనవలసినవి. జీవితంలోగల వైవిధ్యాలను. వైవిధ్యాలను నిశితంగా పరిశీలించి, 'డాబు' తనం లేని శైలిలో చక్కగా వివరించిన కథలివి.

శ్రీశ్రీ స్కెచ్ : అప్పుడు ఢిల్లీలో ఉంటున్న శ్రీశ్రీ 'శావణి' కి పంపిన ప్రత్యేక రచన –

'కోఈహఁస్ రహాహై' కోఈరోర రహాహై'

ఇది 'చైతన్య స్రవంతి' పద్ధతిలో సాగిన వినూత్న రచన

మొక్కపాటి కృష్ణమూర్తిగారు, శ్రీమాన్ ముడుంబ నరసింహాచార్యులుగారు భావయుక్తమైన చిత్రాలు మనల్ని అలరిస్తాయి.

## సాహిత్యమండలి విశేషాలు :

సాహిత్యమండలి నిర్వహించిన సాహిత్య కార్యక్రమాలలో ఎన్నో విశేషాలు, ముచ్చట్లు జరిగేవి. వాటిని ఆతరంవారు కథలు – గాథలుగా చెప్పుకుంటూ ఉంటారు. డాక్టర్ శంకర శ్రీరామారావుగార్ని అడిగితే 'నిజమే' అంటూ ఓ సంఘటన చెప్పారు –

"భారతదేశంలో శ్రీకృష్ణుడు - అనే అంశంపై మాట్లాడవలసిందిగా విశ్వనాథ్ వారిని ఆహ్వానించాం. ఆయన ఉపన్యసిస్తూ కృష్ణుడ్ని మాటిమాటికి "వాడిదుంపతెగ" అంటున్నారు సభలోనుంచి ఒక శ్రోత– "మీరు పండితులని పిలిస్తే వాడిదుంపతెంచటమే కాదు – మా దుంపకూడా తెంచుతున్నారు" అన్నాడు. అప్పుడాయనకు కోపంవచ్చి కృష్ణుడిమీద 'సీరియస్'గా ఉపన్యాసమిచ్చారు. ఆ కోపంతో మేం మూడుసార్లుపిలిచినా మళ్ళీ సాహిత్యమండలికి రాలేదు. కాని – That was the Best speech I heard"

ఒకసారి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారున్న సభలో పిలకా గణపతి శాస్త్రిగారు –

"అమ్మా మాదాకబళం తల్లీ
అమ్మా పిల్లలమన్నం తల్లీ"

అనే గీతం చదివారు. అప్పుడు చెళ్ళపిళ్ళవారు – శాస్త్రి నువ్వు అలంకార శాస్త్రం చదువుకొన్నావుగదా! ఇలాంటి పిచ్చిపిచ్చి విషయాలమీదనా కవిత్వం వ్రాయటం?' అని యతి ప్రాసలులేని గేయం వ్రాసినందుకు ఆక్షేపించారట. దానికి సమాధానంగా గణపతిశాస్త్రిగారు ధనంజయుడి దశ రూపకంలోగల "రమ్యమ్ జుగుప్సిత ముదారం ......" అనే శ్లోకం చదివి సమర్థించుకొన్నారట! ఆ సభలో పాల్గొన్న విశ్వనాథవారు కూడా పిలకావారిని సమర్థించి – చెళ్ళపిళ్ళవారి పద్యాలలో యతిదోషాన్ని గుర్తు చేశారట! ♦

1940 – 1955 మధ్యకాలంలో 'సాహిత్యమండలి' ఉజ్జ్వలంగా ప్రకాశించింది. కాలక్రమేణా సన్నగిల్లుతూ ప్రస్తుతం 'నేనూఉన్నాను' అనేవిధంగా ఉంది. 1952 లో స్థలసేకరణ జరిగినా నేటికీ సాహిత్య మండలి ప్రారంభించబడలేదు. సాహిత్య లోకంలో వచ్చిన 'degeneration', రాజకీయాలపై ఆసక్తి ఎక్కువకావటం, పాతవారే ఓపిక, తీరిక లేకున్నా సంస్థ పదవులలో ఉండటం – అనే కారణాలవల్ల సాహిత్య మండలి పూర్వ వైభవాన్ని కోల్పోయింది.

## తెలుగు దర్బారు :

ఏలూరులో 1958లో స్థాపించబడి రిజిష్టరు చేయబడిన 'తెలుగు దర్బారు' సాహిత్య కార్యక్రమాలకంటె సంగీత, నాటకకోత్సవాలు బాగా

---

♦ చూ : 19–2–88, 8–4–88, 6–5–88 – నాటి ఆంధ్రజ్యోతి వారపత్రికలు.

నిర్వహిస్తూ కవుల, పండితుల సన్మానాలు ఎక్కువగా చేస్తున్న ఈ సంస్థను కురెళ్ళ లక్ష్మణరావుగారు స్థాపించారు. సంస్థ స్థాపించినప్పటినుంచి లక్ష్మణ రావుగారు కార్యదర్శులుగా ఉంటున్నారు.

## చైతన్య వేదిక :

**1985**లో పి. పి. శాస్త్రిగారు (న్యాయవాది) అధ్యక్షులుగా, బత్తుల వీరవెంకట అప్పారావు కార్యదర్శిగా 'చైతన్యవేదిక' ఆవిర్భవించింది. కె. గంగాధరరావు, పి. ఎస్. చాంద్, టి. వెంకటేశ్వరరావు ప్రభృతులు సభ్యులుగాగల ఈ సంస్థ అడపాదడపా కార్యక్రమాలు చేపడుతోంది. అశ్లీల, క్షుద్రసాహిత్యాలకు వ్యతిరేకంగాను, అభ్యుదయ ప్రజాసాహిత్యాభి వృద్ధికి అనుకూలంగాను కార్యక్రమాలను నిర్వహించటమే ఈ సంస్థ ధ్యేయం.

## ఎంకి పాటల పండుగ :

విచిత్రమైన పేరుగల ఈ సంస్థ రెండు సంవత్సరాల క్రితమే ఏలూరులో అశోక్‌నగర్‌లో ప్రారంభించబడినట్టు పత్రికలవల్ల తెలిసింది ♦ నండూరి సుబ్బారావుగారి పాటలకు విస్తృత ప్రచారం కల్పించటానికి ఏటా 'ఎంకి పాటల' పోటీ నిర్వహిస్తామని పత్రికా ప్రకటనలో తెలిపారు.

ఏలూరు ప్రాంతంలో గల సాహిత్యసంస్థలు

## తాడేపల్లిగూడెము

తాడేపల్లిగూడెంలో రెండు సంస్థలు ఉన్నాయి.

1. తెలుగు సాహితీ సమాఖ్య
2. లలితకళాసమితి

♦ ఆ చిరునామాకు లేఖ వ్రాస్తే సమాధానం రాలేదు. ఏలూరులో ఎవ్వరూ చెప్పలేదు.

'లలితకళాసమితి' మరుగున పడినసంస్థ. యద్దనపూడి సూర్యనారాయణమూర్తి, మామిడి వెంకటేశ్వరరావు, వాజపేయాజుల సుబ్బయ్య, యద్దనపూడి వెంకటరత్నం మొదలైనవారు నడిపిన 'లలితకళాసమితి' నాటక, సంగీత కార్యక్రమాలతోపాటు సాహిత్య కార్యక్రమాలు కూడా చేపట్టింది. పద్దెనిమిది సంవత్సరాలుగా సాహితీసేవ చేస్తున్న "తెలుగు సాహితీ సమాఖ్య" ప్రముఖమైన సంస్థ. రాష్ట్రంలో పేరుపొందిన సంస్థ కూడా. ఈ సంస్థను గురించి వివరించే ప్రయత్నం చేస్తాను.

## తెలుగు సాహితీ సమాఖ్య : ♦

తెలుగు వెలుగును నలుదిశలా వ్యాపింపజేయాలనే ఉద్దేశంతో - ఉత్సాహంతో 2-10-1972 - జాతిపిత మహాత్మాగాంధీ జయంతినాడు చామర్తి సుందరకామేశ్వరరావు మారేమండ సీతారామయ్యగార్లు "తెలుగు సాహితీ సమాఖ్య"ను స్థాపించారు. శ్రీయుతులు గూడవల్లి నరసింహారావు, వేమూరి గోపాలకృష్ణమూర్తి, జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి, డాక్టర్ ఎన్. వి. ఎస్. రామారావు, రసరాజు, లాల్ అహ్మద్ ప్రభృతులు ఈ సంస్థ కార్యవర్గ సభ్యులుగాఉండి పురోభివృద్ధికి కృషిచేశారు. ఈ 'తెలుగు సాహితీసమాఖ్య' ముఖ్య ఆశయాలు ఇవి — ♦♦

1) సమాఖ్య అన్నిరకముల సాహితీ ప్రక్రియలకు సమన్వయ వేదికగా నుండి పరస్పర కువిమర్శలను నిషేధించుట

2) సభ్యులు, కవులు, వ్రాసిన తెలుగు గ్రంథాలను ప్రకటించుట, అందుల కవసరమయిన ముద్రణాయంత్రసామగ్రిని సేకరించుట.

3) సాహిత్య పత్రికను ప్రచురించుట.

---

♦ రసరాజు, జంధ్యాల వెంకటేశ్వరశాస్త్రిగార్లు అందించిన సమాచారం ఆధారంగా.

♦♦ తెలుగు సాహితీ సమాఖ్య మెమోరాండం - నియమావళి (1976) ప్రచురితం.

4) తెలుగు కన్నడ లిపులను సమన్వయపరుస్తూ ఏకలిపిని తయారు చేయించి ఉభయ భాషలకు సమన్వయలిపిని వాడుకభాషను తయారు చేయుట.

5) ఇతర భాషా ప్రాశస్త్యము తెలియబరచువారిని- స్త్రీపురుషు లందరును ఆహ్వానించి ఉపన్యసింపజేయుట.

— ఇవి 'తెలుగు సాహితీ సమాఖ్య' ప్రకటించిన ఇరవై ఆశయాలలో ముఖ్యమైనవి. ఈ సంస్థ కార్యక్రమాలను సమీక్షించినపుడు పై ఆశయాలలో చాలవరకు నెరవేర్చినట్టు — చివరి రెండు ఆశయాలు సఫలం కానట్లు గమనించవచ్చు.

'తెలుగు సాహితీ సమాఖ్య' 1972 నుండి ఈనాటివరకు సుమారు 185 సమావేశాలు, కార్యక్రమాలు నిర్వహించినట్టు తెలుస్తోంది. ఈ సంస్థ నిర్వహించిన కార్యక్రమాలలో ముఖ్యమైనవి ఇవి: ♦

15–12–1972 – ఆంధ్రోద్యమంపై కవి సమ్మేళనం

25–12–1973 – వసుచరిత్ర – శతజయంతి

2–10–1974 – విశ్వనాథ, మధునాపంతుల మొదలైనవారితో సాహితీ సదస్సు.

22–7–1975 – ధారా రామనాథ శాస్త్రిగారి 'నాట్యావధానం'

30–6–1976 – శ్రీశ్రీ సమక్షంలో "తెలుగుభాష – నేడు-రేపు అంశంపై గోష్ఠి.

ఈ విశిష్ట కార్యక్రమాలను పరిశీలించినప్పుడు ఈ సంస్థ ఆశయాలు సఫలీకృతమైనట్టు తెలుస్తుంది. ప్రాచీన, నవీన సాహిత్యాలపై సదస్సులు

♦ ఈ వివరాలు గరిమెళ్ళ అచ్యుతరామారావు (అధ్యక్షులు) గారి 3–2–88 లేఖ ఆధారంగా.

నిర్వహించారు. అన్ని సాహిత్యం ప్రక్రియలను సమాదరించారు. భాషా విషయంగా సదస్సుకూడా నిర్వహించారు. సాహితీవేత్తలను, విశ్వవిద్యాలయ ఆచార్యులను ఆహ్వానించి కార్యక్రమాలు నిర్వహించటం విశిష్టకార్యక్రమాలుగా పరిగణింపబడుతున్నాయి. సభ్యులలో సాహిత్యాభిలాషను రేకెత్తించి – రచనలపట్ల ఉత్సాహాన్ని కలిగించడంలో తెలుగు సాహితీ సమాఖ్య కృషి ప్రశంసనీయం.

'తెలుగు సాహితీ సమాఖ్య' కొన్ని గ్రంథాలనుకూడా ప్రచురించింది.

1 ప్రాజ్నన్నయ యుగము – సాంఘిక జీవనము (1976)
– డా॥ ఎన్. వి. ఎస్. రామారావు

2 కవితామంజరి (1978) – కవితాసంపుటి

3 జ్యోతిర్మయి (1978) – శాంతిశ్రీ జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రిగారి ఖండకావ్యం

4 యోగ సాధనము – గృహస్థాశ్రమము (1979)
– గోరింట వెంకట శివరామరాజు

## "మధుమంజరి" పత్రికా నిర్వహణ :

తెలుగు సాహితీ సమాఖ్య 'మధుమంజరి' అనే సాహిత్య మాస పత్రికను నడపటం ప్రశంసించ దగింది. ముందుగా నాలుగు పేజీలతో ప్రారంభమైన ఈ మాసపత్రిక తర్వాత వార్షిక సంచికలుగా వెలువడింది ఎన్. వి. ఎస్. రామారావు, పి. టి. వి. రామానుజాచార్యులు, కె. వి. నరసింహారావు, గరిమెళ్ళ అచ్యుతరామారావు, జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి మొదలైనవారి సంపాదకత్వంలో వెలువడిన వార్షిక సంచికలు ప్రామాణికంగా వెలువడ్డాయని చెప్పవచ్చు. సభ్యుల రచనలకే ప్రాధాన్యమిచ్చినా

బెజవాడ గోపాలరెడ్డి, బి. వి. నరసింహారావు. కాళోజీ, అద్దేపల్లి రామ మోహనరావు, రాజన్నకవి, సంజీవదేవ్, మల్లంపల్లి శరభయ్యా వంటి వాళ్ళచేత కవితలు, వ్యాసాలు రాయించేవారు. పురిపండా అప్పలస్వామి గారి 'ఎవరిపిల్ల' అనేమంచికథ 1980 వార్షిక సంచికలో చూస్తాం ఈ విధంగా మరింత ప్రామాణికమైన సాహిత్య పత్రికగా వెలుగొందుతుందని ఆశించినవారికి ఆశాభంగమైంది. వార్షిక సంచిక వెలువడటంలేదు తెలుగు సాహితీసమాఖ్య మాత్రం అప్పుడప్పుడు సభలు నిర్వహిస్తోంది.

## త ణు కు

తణుకులోగల ప్రసిద్ధమైన సాహిత్య సంస్థ -

## శ్రీ నన్నయభట్టారక పీఠం : ♦

"నాపేరు ఆరుద్ర అయినా మీ పీఠంలోనే ఆర్ద్రతఅంతా ఇమిడి ఉంది. ఏభై సంవత్సరాలుగా మీరు చేస్తున్న ఈ సత్కార్యం ఇంకో యాభై ఏళ్ళు - మరోమాభై మరోయాభై చొప్పున కొనసాగాలనిఆకాంక్ష. సంస్థలు శాశ్వతంగా ఉండటానికి వ్యక్తుల కృషిపునాది. ఈ పీఠం కార్య కర్తలందరూ శ్వాశీవలులే"

అని ఆరుద్రగారిచే ప్రశంసలు పొందిన శ్రీ నన్నయభట్టారక పీఠం 1931 లో స్థాపించబడింది. తొలుత నన్నయభట్ట పీఠారక గ్రంథా లయంగా ప్రారంభించబడి - నన్నయ పీఠంగా మారి శ్రీ నన్నయభట్టా రక పీఠంగా స్థిరపడింది.

"నన్నయభట్టు మున్ను యజనమ్మొనరించిన చోట
జమ్మిచెట్టున్నది తణుకు తూర్పుదెస"

---

♦ బి. ఎస్. ఆర్. ఆంజనేయులు, సుశర్మగార్లు అందించిన సమాచారం ఆధారంగా.

అనే నానుడి తణుకులో ప్రచారంలోఉంది. కొందరు నన్నయ జన్మస్థలం తణుకే అని అంటారు. నన్నయపట్లగల భక్తి ప్రపత్తులతో ఆయన పేరు మీదుగా సంస్థ ప్రారంభించబడింది.

ఒక చిన్న పాఠశాలలో అధ్యాపకునిగా ఉన్న పామర్తి రమణ కవిగార్కి నన్నయపేర ఒక సంస్థను స్థాపించాలనే సంకల్పం కలిగింది. ఆయన సంకల్పానికి ఆలమూరి రాజగోపాలరావు, తెన్నేటి కోదండ రామయ్య, మంత్రిరావు సత్యనారాయణ, పైడిమర్రి భానుమతి, తెలుగు రాజు, పెనుమత్స సత్యనారాయణరాజు, వేదుల సూర్యనారాయణశర్మ, చెరుకువాడ నరసింహపంతులు, ముదిగంటి జగ్గన్నశాస్త్రి, చిట్టూరి ఇంద్రయ్య, నిడదవోలు మృత్యుంజయరావు, మందరపు కామేశ్వరరావు మొదలైన ప్రముఖులు సహకరించారు. పామర్తి రమణకవిగారు కార్య దర్శిగా ఉండి ముప్పయి సంవత్సరాలు సంస్థ అభివృద్ధికి కృషిచేశారు. సంస్థ నేటికీ సజీవంగా ఉండటానికి రమణకవిగారు ముఖ్యకారకులు.

పామర్తి రమణకవిగారు మరణించిన తరువాత శ్రీ నన్నయ్య భట్టా రక పీఠం కొన్నాళ్ళు కుంటుపడింది. 1975లో యం.వి. సూర్యనారాయణ మూర్తి, వేదుల సూరి, వారణాసి విశ్వేశ్వరరావుగార్లు సంస్థ నిర్వహణ బాధ్యతను చేపట్టి కార్యక్రమాలను కొనసాగించారు. డాక్టర్ వి. వెంక ట్రాజుగారు ఆర్థిక సహాయం చేశారు. అయినా కొనాళ్ళతరువాత సంస్థ కార్యక్రమాలను చేపట్టలేని స్థితికి చేరుకుంది.♦

ఆస్థితిలో బంధకవి సీతారామాంజనేయులు (న్యాయవాది)గారు శ్రీ నన్నయ భట్టారకపీఠం అధ్యక్షులయ్యారు. "సంస్థకు డబ్బు లేనప్పుడు నేను పీఠాధిపతినయ్యాను. దాదాపు సంవత్సరంన్నరకాలం నా సొంత ఖర్చులతో సంస్థ కార్యక్రమాలు చేపట్టాను. Publicను involve చేశాను. దానివల్ల సంస్థకు పేరువచ్చి ఆర్థికంగా నిలదొక్కుకో కలిగింది

♦ సాహితీ సేవ (వ్యాసం): 18-1-80 ఆంధ్రజ్యోతి దినపత్రిక

నేను పదకొండు సంవత్సరాలు అధ్యక్షునిగా ఉన్నాను'' అని పలికిన బంధకవిగారి మాటలు అతిశయోక్తులు కావని సంస్థ చరిత్రను పరిశీలిస్తే అవగతమవుతుంది.

## కార్యక్రమాలు :

ఈ పీఠం వేదికమీద నుంచి శ్రీ వేదాంతకవి, శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి, శతావధాని చల్లా పిచ్చయ్యశాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు, విశ్వనాథ, పింగళి-కాటూరి, తిలక్ వంటివారే కాకుండా ఆధునికులైన బెజవాడ గోపాలరెడ్డి, దివాకర్ల వెంకటావధాని, నారాయణరెడ్డి, ఆచార్య ద్రోణప్ప, ఆచార్య యస్వీ జోగారావు, కరుణశ్రీ, తంగిరాల వెంకట సుబ్బారావు వంటివారుకూడా ఉపన్యసించి సాహిత్యామృతాన్ని పంచిపెట్టారు. ఇవికాక పలువురి ఆమోదాన్ని పొందిన _ కార్యక్రమాలతో కొన్ని.

1) 28_3_1960 నుంచి 9_4_1960 వరకు వసంత నవరాత్ర్యుత్సవాలలో ''నన్నయ్య బ్రహ్మోత్సవాలు'' నిర్వహించడం.

2) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు 'ఆస్థాన కవి' పదవి అలంకరించిన సందర్భంగా కల్లూరి చంద్రమౌళి, పింగళి_కాటూరి, తిలక్, పసల సూర్యచంద్రరావుగార్లతో ఎనిమిదిరోజులు సాహిత్యోత్సవాలు నిర్వహించడం.

3) 'కవిరాజ విరాజితం' సాహిత్యరూపక ప్రదర్శన ♦

4) ఆధునిక సాహిత్యంపైకూడా ఆరుద్ర, జ్వాలాముఖి, నారాయణరెడ్డి, ఎమ్వీయల్ వంటివారిని ఆహ్వానించి ఉపన్యాసాలు ఇప్పించడంవల్ల పేరును బట్టి ప్రాచీన సాహిత్యంపై మక్కువగల సంస్థ అని భావించటం పొరపాటని తెలుసుంది.

♦ 13_4_1986 నాటి ఆంధ్రజ్యోతి దినపత్రిక

## ప్రచురణలు :

సాహిత్య కార్యక్రమాలను పెద్దఎత్తున నిర్వహించడంతోపాటు ప్రచురణలుకూడా చేపట్టి ఇప్పటికి ఏడు గ్రంథాలను ప్రచురించటం జరిగింది. అవి :

1) నన్నయ్య - సా. లక్ష్మీనరసింహం
2) శ్రుతులు - అపశ్రుతులు! కొండేపూడి సూర్యనారాయణ
3) హనుమాన్ నిజస్వరూపం
4) వెంకటేశ్వరుని నిజస్వరూపం
5) శాసనమణి మంజూష
6) శ్రీ భగవాన్ పంచముఖీ - నారాయణసూరి
7) సాహిత్యపంచి

నన్నయ్య పై లక్ష్మీ నరసింహంగారి రచన గంథంగా కంటె ఒక పెద్దవ్యాసంగా పరిగణించాలి. మిగిలిన పుస్తకాలతో ముఖ్యమైనది -

## శాసనమణి మంజూష : 1979

దీని పూర్తిపేరు - "శ్రీ దక్షారామ భీమేశ్వరాలయ శాసన మణి మంజూష". చరిత్ర పరిశోధకులు శ్రీ తురగా కృష్ణమూర్తిగారు ప్రకటించిన ప్రథమ సంపుటంఇది. నివేదనము"లో రచయిత పలికిన పలుకులను బట్టి ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని తెలుకోవచ్చు -

"ఆంధ్రదేశములో దక్షారామ భీమేశ్వరక్షేత్రమున వెలసినభీమనాథాలయములో నున్నన్ని శాసనములు మరే దేవాలయములోనుకానుపింపవు. ఈ దివ్యక్షేత్రమున చాళుక్యుల, చోళుల, గాంగుల, హైహయుల, కళింగాధినాథుల, రెడ్డిరాజుల, నరపతుల, గజపతుల పాలనాకాలమున వేయబడిన

సుమారు నాలుగునూర్ల శాసనములీ భీమేశ్వరాలయ కుడ్యములపై గంఢరింపబడి నాటి చారిత్రక విశేషముల విశదముల లొనర్చుచున్నవి''.

అటువంటి శాసనాలలో ఒక నూరుశాసనాలను సంత్సరాల ప్రకారం వరుసక్రమంలో కూర్చి వర్గీకరించి, శాసన పాఠాలతోపాటు విశేషాలను, నాటి సామాజిక స్థితిని విశదీకరించే ప్రయత్నంచేసిన తురగా కృష్ణమూర్తి గారు ప్రశంసార్హులు. అటువంటి ఉత్తమ గ్రంథాన్ని ప్రచురించిన నన్నయ్య భట్టారక పీఠంవారు కూడా అభినంద్యులే.

కరుణశ్రీ, ఇంద్రగంటి, జ్వాలాముఖి ప్రభృతులెందరో ఈసంస్థ కృషిని కొనియాడారు. కీ॥ శే॥ ఎమ్వీయల్ మాటలు ఇవి _

'సాహితీ సదస్సును ఒక తపస్సుగా భావించి నిర్వహిస్తూ సమాజంలో రోగనిదానం చేస్తున్న మార్పును సూచిస్తున్న నన్నయ భట్టారక పీఠంలో ప్రతిఒక్కరికీ ప్రత్యేకాభివందనాలు, ఒకోకవిది ఒకోవాణి _ ఒకోబాణి. అన్నీవినే అవకాశాన్ని సాహిత్య ప్రియులకు కల్పించే విశాలహృదయం, దృక్పథంవుండటం ఈ పీఠం ప్రత్యేకత' (15-9-80)

ఆ ప్రత్యేకతతోనే నేటికీ నిర్విఘ్నంగా కొనసాగుతోంది శ్రీ నన్నయ్య భట్టారకపీఠం.

## శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి : *

'సాహిత్యభోజ ముళ్ళపూడి తిమ్మరాజుగారి ద్వితీయ పుత్రుడు శ్రీ ముళ్ళపూడి నరేంద్రనాథ్ చౌదరి 5_4_1927న జన్మించి 27-9-1942 న అకాలమరణం చెందారు. ఆచిన్నారిని చిరంజీవిని చెయ్యడానికి-మనకు

* మండలి కార్యనిర్వాహణాధికారి లేఖద్వారా తెలిపిన సమాచారం (12-4-88)

గల సారస్వతాభిలాషవల్ల సాహితీ సేవచెయ్యడానికి ముళ్ళపూడి తిమ్మ రాజుగారు 29-1-1947న శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలిని స్థాపించారు అనాటి మదరాసు రాష్ట్ర ముఖ్యమంత్రి - శ్రీ పూసపాటి కుమారస్వామి రాజాగారి అధ్యక్షతన ఈ సంస్థకు శ్రీకారం చుట్టబడింది. అప్పట్లో ఈ సంస్థ ఆశయాలు ప్రధానంగా రెండు :

1. ఉత్తమ గ్రంథ ప్రచురణ
2. ప్రముఖ కవి, పండితులను సత్కరించుట

ఉత్తమ గ్రంథ ప్రచురణకు ఆశయం నెరవేరడానికి స్వయంగా "రాయల్ ప్రెస్" అనే ముద్రణాలయాన్ని స్థాపించారు. సాహిత్యసభ లను నిర్వహిస్తూ, విశేషమైన పీఠికలతో గ్రంథాలు ప్రచురించిన సంస్థ ఇది. తిమ్మరాజుగారు ఊరూరు తిరిగి ముద్రితాముద్రిత గ్రంథాలను. తాళప్రతులను సేకరించారు. తాము ప్రచురించిన గ్రంథాలతో, సేకరిం చిన గ్రంథాలతో "నరేంద్రనాథ స్మారక గ్రంథాలయం" స్థాపించారు. ఈ సంస్థ కొన్నాళ్ళు స్తబ్దంగా ఉంది. 19-10-63న తిమ్మరాజుగారు మళ్ళీ సంస్థను పునర్వ్యవస్థీకరించి చురుకుగా కార్యక్రమాలు నిర్వహించా లని నిశ్చయించారు. అప్పుడు పైన పేర్కొనిన రెండు ఆశయాలుగాక మరొక మూడు ఆశయాలను జోడించారు. అవి :

1) అన్యప్రాంతీయుల నాహ్వానించి గౌరవించుట.

2) ఇందలి సర్వోపన్యాసములను లిఖితపూర్వకముగా నుంచుట

3) తణుకునందలి యువరచయితలను ప్రోత్సహించుట

శ్రీ నరేంద్రనాథ్ సాహిత్యమండలికి వ్యవస్థాపకులు, పోషకులు ముళ్ళపూడి తిమ్మరాజుగారే. కార్యక్రమాల నిర్వహణ మాత్రం సాహితీ

వేత్తలు - సాహితీప్రియులే చేపట్టేవారు. ఈ సంస్థ కార్యక్రమాల సారధ్యసంఘంలో సర్వశ్రీ -

పెన్మెత్స సత్యనారాయణరాజుగారు
వేదుల సూర్యనారాయణశర్మగారు
పిల్లలమఱ్ఱి మార్కండేయశాస్త్రిగారు
మధిర భానుమూర్తిగారు
ఏలూరిపాటి అనంతరామయ్యగారు
నిడదవోలు మృత్యుంజయరావుగారు

సభ్యులుగా ఉండి తిమ్మరాజుగార్కి సహకరించేవారు.

ఈ సంస్థ నిర్వహించిన సభలలో మహావిద్వాంసులు, కవులు పాల్గొని తణుకును సాహిత్యనగరంగా మార్చేశారు.

కాశీ కృష్ణాచార్యులుగారు; కుందూరి ఈశ్వరదత్తుగారు; చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు; జమ్మలమడక మాధవరామశర్మగారు; పుట్టపర్తి నారాయణాచార్యులుగారు; దివాకర్ల వెంకటావధానిగారు, త్రిపురనేని రామస్వామిచౌదరిగారు ప్రభృతులు ఈ సంస్థ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

## ప్రచురణలు :

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలివారు ప్రచురించిన గ్రంథాలు - గ్రంథ రచయితలు :

| గ్రంథం | రచయిత |
|---|---|
| 1. సాహితీవాల్లభ్యము మొదటిభాగం | |
| 2. రెండవభాగం - వివిధ కవుల, రచయితల కవితలు, కథల, వ్యాసాల కదంబం | |

3. నృత్తరత్నావళి – శ్రీ జమ్మలమడకమాధవరాయశర్మ
4. సకలజీవన సంజీవనము – శ్రీ సాయపనేని వెంకటాద్రినాయుడు
5. ఈడ్పుగంటిరాఘవేంద్ర
రావుగారి సంగ్రహచరిత్ర – శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు
6. ప్రతాపరుద్ర చరిత్రము – ఏకాంబ్రనాథుడు
7. కాకతి ప్రోలరాజు – శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ
8. నరేంద్రుడు – ,,
9. ఆర్య చాణక్యుడు – ,,
10. గోస్తనదీమాహాత్మ్యము – శ్రీ ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రి
11. పాతాళభైరవి – శ్రీ ఎ. వి. నరసింహంపంతులు
12. కాకతీయరాజులు – శ్రీ శేషాద్రిరమణకవులు
13. పశ్చిమచాళుక్యచరిత్ర – శ్రీ కొత్త భావయ్యచౌదరి
14. తిరుక్కురళ్ – శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి
15. పారిశ్రామికవేత్త –
శ్రీ జి. డి. నాయుడు – శ్రీ మధిర భానుమూర్తి
16. గురజాడ మనీష – శ్రీ సారంగు లక్ష్మీనరసింహారావు
17. అలెగ్జాండరు – శ్రీ మధురశ్రీ
18. కమ్మవారి చరిత్ర – శ్రీ సూర్యదేవర రాఘవయ్యచౌదరి
19. విదురనీతి – శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి
20. కందుకూరు పాకనాటి
మండల చరిత్ర – శ్రీ తల్లపనేని చెంచయ్య
21. 'ఆంధ్రభోజ' 'సాహితీ
వల్లభ' శ్రీ ముళ్ళపూడి
తిమ్మరాజుగారి
ఐతిహాసిక యాత్రలు – వివిధ రచయితల వ్యాసాలు

22. రాజా వీరబల్ — శ్రీ మేడూరి వెంకటసోమేశ్వర కృష్ణమూర్తి
23. శ్రీహర్ష శ్రీలాదిత్యుడు — ,, ,,
24. శ్రీ కోడి రామమూర్తి నాయుడు — ,, ,,
25. ఘుసుసూరి కాపయ నాయకుడు — ,, ,,

## సాహితీవాల్లభ్యము :

శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి సంస్థకు కీర్తిప్రతిష్ఠలను తీసుకొచ్చిన 'సాహితీవాల్లభ్యము' రెండు భాగాలుగా ప్రచురింపబడింది. నూరుమందికి పైగా రచయితలు, కవులు, కథారచయితలు, విమర్శకులు ఈ సంపుటులలో దర్శనమిస్తారు. మొదటి సంపుటం శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారి 68 వ జన్మదినమహోత్సవం సందర్భంగా 1968 లో ప్రచురింపబడింది, ద్వితీయసంపుటం 1974 లో తిమ్మరాజుగారి అభినందన సంపుటిగా ప్రచురింపబడింది.

శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య
శ్రీ పిల్లలమర్రి మార్కండేయశాస్త్రి
శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు
శ్రీ మధిర భానుమూర్తి

— వీరు సంపాదకులుగా వెలువడిన 'సాహితీవాల్లభ్యము' ప్రామాణికమైన సాహిత్య విశేషసంచికగా రూపొందింది. సంపాదకుల పట్టుదల. ఆసక్తి అభినందనీయం. 'సాహితీవాల్లభ్యము' సంచిక విశిష్టతను తెలిపే కరుణశ్రీ గారి పద్యరత్నం ఇది —

"పంచదార మాడ్కి-భారతీ! నీమోవి
యింత తీయనై నదేమి నేడు?
స్వామి! తణుకు సభల 'సాహితీవాల్లభ్య'
మధురసంబుసోకెనధరమందు".

'సాహితీవాల్లభ్యము' మొదటి భాగం గురించి పరిచయం చేస్తూ "దీనిలో విషయవైవిధ్యయున్నది. ఉన్నను అనుగతి యున్నది. ఇందు చరిత్ర సమీక్షణయున్నది. ఇందుసాహిత్యశాస్త్ర పర్యాలోచనయున్నది. సాహిత్యలక్ష్యసమాలోచనయున్నది. దీనిని సమీక్షించి ఎందరేని Ph.D. లు కావచ్చును" అని జమ్మలమడక మాధవ రామశర్మ గారనటంలో అత్యుక్తి లేదు. ఎనభై ఒక్క వ్యాసాలతో ఆరువందల పుటలకుపైగా చారిత్రక. సాహిత్య, లక్షణ శాస్త్రాది విషయములతో వెలువడిన ఈ 'సాహితీవాల్లభ్యము' మండలి సాహితీసేవకు యశస్స్తంభము. అయితే "శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి" ఇప్పుడు కార్యక్రమాలేవీ నిర్వహించటంలేదు దాదాపు ఈ సంస్థలేనట్లే.

## సాహితీ సరోవరం :♦

1962లో దేవరకొండ బాలగంగాధర తిలక్, చల్లా నరసింహరావు (కవి, న్యాయవాది)లు 'సాహిత్య సరోవరం' అనేపేరుతో సాహిత్యగోష్ఠులు జరిపేవారు. ఒక సంస్థగా రిజిష్టరు చేయబడలేదు. అధ్యక్ష కార్యదర్శి వంటి పదవులు ఉండేవికావు. సాహితీ సరోవరం నిర్వహించిన కార్యక్రమాలలో ఎక్కువ కవితాగానాలే. స్థానిక కవుల్ని పిలచి స్వీయకవితా పఠనం చేయించేవారు. శ్రావ్యంగా కవితాగానం చేసేవారికి ప్రాధాన్యం ఇచ్చేవారు "కవిత్వాన్ని వచనంగా చదవడంకాదు - కవిత్వంలా చదవాలి. కవితాపఠనం ఒక కళ" అని సాహితీ సరోవరం కవులకు వివరించింది.

---

♦ 'కవిషాదుషా' చల్లా నరసింహరావుగారు తెల్పిన సమాచారం ఆధారంగా

అప్పుడప్పుడు కవిత్వచర్చలు జరిగేవి. ఏ కార్యక్రమము జరిగినా స్థానిక కవులతో, రచయితలతో, సాహిత్యాభిలాషులతో జరిగేదికానీ – పెద్దపెద్ద వారిని ఇతర ప్రాంతాలనుంచి ఆహ్వానించి పెద్దఎత్తున సభలను నిర్వహించలేదు. మామూలు కార్యక్రమాలకు అయ్యే ఖర్చును చల్లా నరసింహా రావుగారే భరించేవారు.

తిలక్ మరణించిన తర్వాత సాహితీ సరోవరం పేరును "తిలక్ సాహితీ సరోవరం" గా మార్చారు. పదేళ్ళ (72-73) తర్వాత సాహితీ సరోవరం ఇంకిపోయింది.

తణుకులోగల మూడు సాహిత్య సంస్థలలో శ్రీ నన్నయ్య భట్టారక పీఠమే ప్రథమంగా ఎన్నదగింది, సమాజంచేత సమాజంకోసం నడప బడుతున్న సంస్థఇది. నరేంద్రనాథ్ స్మృత్యర్థం – ఏక వ్యక్తి నిష్ఠంగా శ్రీ నరేంద్రనాథ్ సాహిత్యమండలి నిర్వహించబడుతోంది. సాహిత్యాన్ని సమాజానికి దగ్గరగా తీసుకెళ్ళాలన్న తపనతో శ్రీ నన్నయభట్టారకపీఠం నిర్వహింపబడుతున్నట్లు గమనించవచ్చు.

## భీమవరం ప్రాంతంలోని సాహిత్య సంస్థలు :

భీమవరం, పాలకొల్లు భీమవరం మండలానికి చెందుతాయి. పాలకొల్లులో చెప్పుకోదగిన సాహిత్య సంస్థలులేవు – సాహిత్య కార్యక్రమాలూ లేవు, క్షీరా రామలింగేశ్వరస్వామి సంస్కృత కళాశాలవారి సహకారంతో 'పోతనామాత్య పీఠం' అనే సంస్థ అప్పుడప్పుడు సాహిత్యకార్యక్రమాలను చేపడుతోంది. 1982 ఉగాది పర్వదినాన ఈ సంస్థ ప్రారంభించబడింది. సభ్యులు, కార్యవర్గం లేకపోవటం, గణపతినవరాత్రులలో తొమ్మిదిరోజులు కార్యక్రమాలు జరపటం ఈ సంస్థ గురించి చెప్పుకొనవలసిన అంశాలు అని వ్యవస్థాపకురాలు శ్రీమతి రే. లక్ష్మీబాయిగారు వివరించారు. కాబట్టి పాలకొల్లులో సాహిత్య సంస్థల చరిత్ర దాదాపులేదని చెప్పవలసివుంటుంది.

భీమవరం సాహిత్యసంస్థలకు పుట్టినిల్లు. పశ్చిమగోదావరిజిల్లాలో భీమ వరంలో ఉన్న సాహిత్య సంస్థలు మరెక్కడలేవు.

భీమవరంలోని 11 సంస్థలు :

1) కళాస్రవంతి
2) కళాసమాఖ్య
3) భాగవతి విజ్ఞానసమితి
4) రసచంద్రిక
5) సాహితీ సంపత్
6) వసంత భారతి
7) కవితా ప్రభాస
8) రవీంద్ర సారస్వత సమాజం
9) శ్రీ రామరాజభూషణ సాహిత్య పరిషత్
10) జాషువా సాహితీసమితి
11) శ్రీనివాస భారతి

భీమవరంలోగల పదకొండు సాహిత్య సంస్థలలో నేటికీ సాహితీ సేవ చేస్తున్న మూడు సంస్థలను ముందుగా వివరించి – మరుగునపడిన సంస్థలగురించి తర్వాత వివరించే ప్రయత్నంచేస్తాను:

## శ్రీ రామరాజభూషణ సాహిత్యపరిషత్ : ♦

చిరంజీవి వెంకటసూర్యనారాయణరాజుగారు శ్రీ రామరాజభూషణ సాహిత్యపరిషత్ పేరుతో రామరాజభూషణుని జయంత్యుత్సవాలను జరుపుతూండేవారు. అప్పటికి ఒక సంస్థగా రూపుదిద్దుకోలేదు.

♦ ఈ వివరాలు చుక్కాన గంగరాజుగారు తెలిపారు.

13 7–1965 న చుక్కాన గంగరాజుగారు ప్రధాన కార్యదర్శిగా సూర్య నారాయణరాజుగారు అధ్యక్షులుగా సంస్థ 'రిజిష్టరు' చేయబడింది.

సాహితీప్రియులు ఎమ్. ఆర్. అప్పారావుగారిచే ప్రారంభోత్సవం చేయబడిన ఈ సంస్థకు 'అభినవభోజ' శ్రీ భూపతిరాజు రామకృష్ణంరాజు, కళాదాత శ్రీ గన్నాబత్తుల పెదతాతగార్లు అధ్యక్షులుగా – చుక్కాన గంగ రాజుగారు ప్రధాన కార్యదర్శిగా వ్యవహరిస్తున్నారు. శ్రీయుతులు తటవర్తి వెంకటరత్నం, రాయప్రోలు సీతారామశాస్త్రి, తటవర్తి శ్రీనాగేంద్రరామా రావు, రాయప్రోలు భగవాన్ మొదలైనవారు కార్యవర్గంలో ఉన్నారు. వీరి సారథ్యంలో శ్రీ రామరాజభూషణ సాహిత్యపరిషత్ దినదినాభివృద్ధి చెందుతోంది రామరాజభూషణుని పేర నడుస్తున్న సంస్థ ఇది ఒక్కటే అని పలువురి అభిప్రాయం.

## కార్యక్రమాలు :

ప్రతి సంక్రాంతికి, ఉగాదికి తప్పనిసరిగా కవిసమ్మేళనాలు నిర్వ హించటం, అష్టావధాన–పుష్పావధాన–నేత్రావధాన కార్యక్రమాలు నిర్వ హించటం, సాహిత్యరూపకాల ప్రదర్శనం వంటివి శ్రీ రామరాజభూషణ సాహిత్యపరిషత్ చేపట్టి ప్రజల మెప్పును పొందింది.

## వసుచరిత్ర చతుశ్శతజయంతి :

1973 నాటికి వసుచరిత్ర కావ్యం ఆవిర్భవించి నాలుగువందల సంవత్సరాలైనదిగా గుర్తించి వసుచరిత్ర చతుశ్శతజయంతిని నిర్వహిం చటం శ్రీ రామరాజభూషణ సాహిత్యపరిషత్‌కు సముచితమే. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించిన ఈ మహోత్సవాలతో సర్వశ్రీ పుట్ట పర్తి నారాయణాచార్యులు, దివాకర్ల వెంకటావధాని, విశ్వనాథ, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, తుమ్మపూడి కోటే శ్వరరావు, కోవెలన ప్రసన్నాచార్య, సంపత్కుమార, జి.వి. సుబ్రహ్మ

ణ్యాం, ఆరుద్ర, ఉషశ్రీ, సి. నారాయణరెడ్డి. బి. రామరాజు వంటి సాహితీ ప్రముఖులు పాల్గొని రామరాజభూషణుని కవితా వైభవాన్ని ప్రదర్శించారు.

## పరిష్కరణలు

శ్రీ రామరాజభూషణ సాహిత్య పరిషత్ ప్రధానంగా రామరాజ భూషణుని సాహిత్యప్రశస్తిని చాటడానికి ఆవిర్భవించింది. ఆ ఉద్దేశం తోనే రామరాజ భూషణునిపై మూడుపుస్తకాలను ప్రచురించింది. నాల్గవ పుస్తకం బొడ్డు బాపిరాజుగారి కవితా సంపుటి.

ఈ నాలుగు గ్రంథాల సమీక్ష :

1) భూషణ కిరణావళి 1969
2) వసుచరిత్ర సాహితీ సౌరభము (1976)
3) వసుచరిత్ర రచనా వైభవము
4) శ్రీ చందనము

శ్రీ రామరాజభూషణ సాహిత్య పరిషత్ గురించి పత్రికలు ప్రశం సించినతీరు గమనార్హం : ♦

"ఒక కవిపేరుమీదుగా నొక సాహిత్య పరిషత్తును వెలయించుట అనేది యొక గొప్పవిశేషమనియే చెప్పవలెను. పాశ్చాత్య దేశములందే పద్ధతియున్నది. షేక్స్పియర్, మిల్టన్, కేట్సు ఈ మొదలైన కవులకట్టి గౌరవ మా దేశమందున్నది. ఇప్పుడు తెలుగులో రామరాజభూషణునకు గౌరవము దక్కినది. ఆ కవియందింత అభిమానము గలవారొక పరిషత్తు

♦ 'భూషణ కిరణావళి'-గ్రంథంలో ప్రచురించిన అభిప్రాయాలనునుండి స్వీయచరిత్ర

గా నేర్పడి ఆయన సాహిత్యమును బహువిధముల ప్రచారముచేయుటకు సంకల్పించుట నిజముగా ప్రశంసింపదగిన విషయము”

– ఆంధ్రపత్రిక దినపత్రిక

“రామరాజభూషణునివలె దూషణభూషణలకు గురియైన కవిలేదు. ఈర్ష్యాపిశాచగ్రస్తులు ఆయనపై అభాండాలు వేయగా సాహిత్యారాధకులు ఆయనను కారణజన్ముడని ప్రశంసించారు. ఆ మహాకవిపేరుతో ఒక సాహిత్యపరిషత్తు నెలకొల్పి, ఆయన గొప్పతనాన్ని లోకానికి వెల్లడింప తలచుట ప్రశంసనీయం”

– ఆంధ్రజ్యోతి దినపత్రిక

ఇంకా పలువురు ప్రముఖులు కూడా ఈ విధంగా సంస్థకృషిని ప్రస్తుతించారు। ఒక ఉదాహరణ:

“భీమవరంబు నందుగల పెద్దలలోపల పెద్ద తాతలన్
సోముని సత్కృపాఝురికి జొక్కిలజేసిన గబ్బుడీతడా
పైమరి సాహితీసభలు వందలువేలుకు చేసిచేసిసా
రామృతయుల్ జనావళికి నర్పణజేసినధన్యుడీతడున్”

– ఆచార్య బేతవోలు రామబ్రహ్మం

## జాషువా సాహితీ సమితి :

1952 నుంచి జాషువాతో సన్నిహితంగా మెలగిన చిరంజీవి వెంకటసూర్యనారాయణరాజుగారు 1975 లో 'జాషువా సాహితీ సమితి' స్థాపించారు. జాషువా రచనల ప్రచారమే ప్రధాన ధ్యేయంగా కొన్నాళ్ళు భీమవరంలో మంచి ఉపన్యాస కార్యక్రమాలను ఏర్పరచిన ఈ సంస్థ ప్రస్తుతం లేనట్లే.

## శ్రీనివాస భారతి :

31–3–1982 న ఆంధ్రోపన్యాసకులైన డా॥ ఎస్. టి. వి. రాజ గోపాలాచార్యులు స్థాపించిన సంస్థ ఇది. రాజగోపాలాచార్యులు, వారి సోదరులు ఆచార్య తిరుమలగార్ల తండ్రిగారిపేర (శ్రీమత్తిరుమల వేంకట శ్రీనివాసాచార్యులు) "శ్రీనివాస భారతి" గా స్థాపించబడింది. భారతీయ సంస్కృతికి ఆధారభూతమైన సాహిత్యాన్ని, కళల్ని వ్యాప్తి గావించడమే ఈ సంస్థ ప్రధానాశయం. ఆధునిక–ప్రాచీన సాహితీ సదస్సులను, కవి సమ్మేళనాలను ఏర్పాటుచేసి భీమవరంలో కొంత సంచలనం కలిగించిన ఈ సంస్థ మంచి పుస్తకాలను కూడా ప్రచురించింది. అవి –

1) శ్రీరామనామసుధ – ఆచార్య తిరుమల
2) అన్నవిజ్ఞానము – రాజగోపాలాచార్యులు
3) తొలకరి మెరుపులు (మినీకవితలు)– రామడుగు వెంకటేశ్వరశర్మ
4) పూలజల్లు – పి. రాధాకృష్ణమూర్తి
5) శ్రీ మహాభారత వైజ్ఞానికసమీక్ష– కీ॥శే॥ శ్రీమత్తిరుమల వేంకట శ్రీనివాసాచార్యులు
6) అభిజ్ఞాన శాకుంతలము–కాళిదాసు ఆంతర్యము – ఆచార్య యస్వీ జోగారావు
7) విశ్వనాథ శబరి – డా॥ రాజగోపాలాచార్యులు

"శ్రీనిసాస భారతి" సంస్థకూడా గత అయిదారు సంవత్సరాలుగా కార్యక్రమాలు నిర్వహించటంలేదు.

## భీమవరంలో మరుగునపడిన సంస్థలు

మరుగునపడిన ఎనిమిది సంస్థలలో మూడు ప్రసిద్ధమైనవి. మిగిలినవి మఖలో పుట్టి పుబ్బలో మాయమైపోయినటువంటి తాత్కాలిక సంస్థ

లని చెప్పవలసిఉంటుంది. ముందుగా మరుగున పడిన ప్రసిద్ధ సంస్థలను వివరిసాను:

## 1) రవీంద్ర సారస్వత సమాజం

కవి, కథకుడు, భీమవరనివాసియైన అత్తిలి సూర్యనారాయణ మూర్తిగారు ♦♦ కార్యదర్శిగా "రవీంద్ర సారస్వత సమాజము" స్థాపించబడింది. తటవర్తి వెంకటరత్నంగారిజ్ఞాపకార్థంగా, చెల్లాయ్యమ్మగారి జ్ఞాపకార్థంగా స్త్రీ పురుషులకు సాహిత్యాలపై వ్రాతపరీక్షలు నిర్వహించి బహుమతులు ఇచ్చే వారనితెలుస్తోంది. ఆంధ్ర శేషగిరిరావుగారి "ఆంధ్ర భూమి" పత్రికవల్ల భారతం-విరాటపర్వంలోని చతుర్థాశ్వాసంపైన, తల్లావఝలవారి 'పద్మావతీ చరణచారణ చక్రవర్తి' పైన ఏలూరు, నర్సాపురం, తణుకు, భీమవరాలలో ఒకేసారి పోటీలునిర్వహించినట్లు తెలుస్తోంది

భీమవరలో 1938 ఏప్రిల్ 10వ తేదీన రవీంద్ర సారస్వతసమాజం (ప్రథమ?) వార్షికోత్సవం జరిగింది. మల్లాది రామమూర్తి శాస్త్రిగారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు, అడవి బాపిరాజుగారు, శ్రీశ్రీ, జలసూత్రం రుక్మిణినాథశాస్త్రిగారు, మల్లవరపు విశ్వేశ్వరరావుగారు, గురు భాగవతుల సుబ్బారావుగారు ఆ వార్షికోత్సవ సభలో పాల్గొన్నారు. ఆ నాటి విశేషాలను ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు "గీతమీగాథలు" (పుటలు 168-170)లో భద్రపరిచారు. ఆ విశేషాలలోకొన్ని!

"పుత్తడిబొమ్మలాంటి 14 ఏళ్ళ చిన్నది హార్మోనియమీద పుత్తడి బొమ్మ పూర్ణమ్మ పాటపాడుతోంది. ఆపిల్లలో పూజారింటను పుట్టిన చిన్నదాన్ని ఊహించుకుని కళ్ళుచెమ్మగిల్లుతున్నాయి. తర్వాత ఒకటిరెండు ప్రసంగాలు జరిగాయి. అధ్యక్షోపన్యాసం ఒకగంటసాగి ఆపూట సభ ముగిసింది".

---

♦ సమగ్రమైన సమాచారం లభ్యంకాలేదు.

♦♦ కవి, చిత్రకారుడు శ్రీ అడివి బాపిరాజుగారికి అప్తమిత్రుడు

"బాపిరాజు ఛలోక్తులతో గేయాలతో పట్టలేని అప్యాయతతో మాట్లాడుతూ ఉంటే ఉపన్యాసంలా లేవు. ఏ సభలోనైనా, 'వచ్చిరి మున్గురు సరాబులూ - ఒకడికి కాళ్ళులేవు. ఒకడికి నోరేలేదు' అనే జానపదగేయం పాడందే ఆయన ప్రసంగం ముగిసినట్లుకాదు".

"తర్వాత శ్రీనివాసరావు, విశ్వేశ్వరరావు మధ్యమధ్య వ్యాఖ్యానిస్తూ తమగేయాలను చదివారు. నేను భవభూతిమీదా, అతడు (రుక్మిణీనాథశాస్త్రి) నవ్యకవితలో సరికొత్త పోకడల మీదా మాట్లాడాము".

## 2) కవితా పరిభాస ♦

"ఇది కవితాప్రభాస-వసుధైక కుటుంబికవీంద్రసాహితీ
సదనము కావ్యశిల్పమయ శబ్ద తపోమఖశాల అర్థిసౌ
హృదసుకుమారభావుకుల కెల్లరకున్ రసరాజధాని తె
ల్గు దనపు సోయగమ్ములు వెలుంగుత ఇంకజగద్ధితముగన్"

- అనే పద్యాన్ని "ఎమ్మెస్ 55 పరకాళాపైజామా, సన్నలాల్చీ (చేతులుసన్నగా పైకి మడిచింది వేసుకొని) కొంచంవంగి, ముఖంఆట్టే పైకెత్తకుండా ఓకుర్రాడు" ♦♦ చదువుతూంటే కవితాప్రభాస కార్యక్రమాలు ప్రారంభమయ్యేవి. ఆ కుర్రాడు - ఉషశ్రీ!

1946లో ప్రసిద్ధకవి, విమర్శకులు - డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యగారు వ్యవస్థాపకులుగా "కవితాప్రభాస" ప్రారంభమైంది. కవి, గాయకుడు అయిన కేశనకుర్తి వీరభద్రాచారి తొలి కార్యదర్శి. ప్రతి సాయం సంధ్యాసమయంలో కవులు, సాహితీప్రియులుచేరి గోష్ఠులు జరిపేవారు. కవితాపఠనం చేసేవారు. బహిరంగసభలకు ప్రాధాన్యం ఇవ్వ

---

♦. డా॥ నండూరి రామకృష్ణమాచార్యులవారి 5-5-88 నాటిలేఖఆధారంగా

♦♦ ఉషశ్రీ షష్టిపూర్తి సంచికలో ఏ అనంతరామయ్యగారి వ్యాసంలో

కుండా పరిమితంగానే చర్చాకార్యక్రమాలు జరిగేవి. నిత్యం ఉషశ్రీ, శనగవ నరసింహస్వామి, ప్రోలాప్రగడ, లక్ష్మణయతీంద్రులు, దిగుమర్తి కార్లపాటిలతోపాటు భీమవరం విచ్చేసిన విశ్వనాథ, పింగళి, కాటూరి, దేవులపల్లి కూడా కవితాప్రభాసలో పాల్గొనేవారు. 1955 వరకు మాత్రమే కవితాప్రభాస కొనసాగింది,

## 3) రసచంద్రిక

1979లో స్థాపించబడిన 'రసచంద్రిక' సంప్రదాయ సాహిత్య ప్రచారానికి ఉద్దేశింపబడిన సంస్థ. వెంపరాల ప్రభాకర సుబ్రహ్మణ్యం గారు సంచాలకులుగా శ్రీ తమ్మన వెంకటేశ్వరరావు అధ్యక్షులుగా ఏర్పడిన రసచంద్రిక కార్యక్రమాలు ఆరుబయట పండువెన్నెలల్లో జరగటం విశేషంగా పరిగణించాలి. ఆచార్య తిరుమల రచించిన "ఆధునిక కవిత_అభిప్రాయవేదిక" పుస్తకంపై ఆయన సమక్షంలోనే సదస్సు నిర్వహించినందుకు అభినందనలు అందుకొంది. కలిదిండి వెంకట్రామరాజుగారు, భారతం శ్రీమన్నారాయణ, వై. యస్. రాంప్రసాద్, కలిదిండి సూర్యనారాయణరాజుగార్లు ఇందులో సభ్యులుగా ఉండేవారు. ఈ సంస్థ ప్రచురించిన

1) అర్త సంరక్షణము
2) ఆంజనేయస్తవాక్షరి
3) మహాదేవస్తుతి

అనే ఆధ్యాత్మిక సాహిత్యగ్రంథాలు సంస్థ అధ్యక్షులు తమ్మన వెంంకటేశ్వరరావుగారి కృతులే.

పైన పేర్కొనిన సంస్థలుకాక మరికొన్ని మరుగునపడిన సంస్థలున్నాయి.

1972లో స్థాపించబడిన 'కళాసమాఖ్య' డాక్టర్ విశ్వనాథరాజు, డాక్టర్ టి. రామకృష్ణారావు, జి. సూర్యనారాయణ మొదలైనవారి అధ్వ

ర్యంలో నిర్వహించబడింది గానీ – సాహిత్య కార్యక్రమాలు తక్కువగా చేపట్టేది.

వధాన్యులు శ్రీ బొండా నాగేశ్వరరావు, గన్నాబత్తుల పెదతాత గారు కలసి స్థాపించిన "కళాస్రవంతి" సంస్థ భీమవరంలో కొన్నిమంచి సాహిత్య కార్యక్రమాలను చేపట్టింది. 24–2–1985లో జరిగిన 'ఇందిరామందిరసభ' గురించి పురజనులు ఇప్పటికి చెప్పుకుంటూఉంటారు. కె. వి. శివయ్యగారు, ప్రసాదరాయకులపతిగారు, ధారా రామశాస్త్రిగారు, రాజన్న కవి, మొవ్వ వృషాద్రిపతి ప్రభృతులు పాల్గొన్న ఈ రూపకం దక్షిణాంధ్ర యుగంలోని రఘునాథనాయకుని సభను "ఇందిరామందిరం" గా భావించి తయారుచేసినది.

తాడిమళ్ళ జగన్నాథస్వామి, మంగళంపల్లి సూర్యనారాయణ, సన్నిధిరాజు సుబ్రహ్మణ్యం, తమ్మన వెంకటేశ్వరరావు మొదలైనవారు 1969–ఫిబ్రవరిలో – శివరాత్రి పర్వదినాన స్థాపించిన సంస్థ – "సాహితీ సంపత్". ఇదికూడా ప్రాచీన సాహిత్య పరిరక్షణకే ప్రభవించింది. ఐదేళ్ళపాటు సాహిత్యోపన్యాసాలతో, పద్యపఠనాలతో, అష్టావధానాలతో మంచి కార్యక్రమాలు చేపట్టడమే కాకుండా ప్రచురణలు కూడా చేపట్టింది. "సంస్కృతి" (కవితాసంపుటి), 'నీతిశతకం' (మంగళంపల్లి సూర్యనారాయణగారు),'కల్యాణి' (తమ్మనవారి సాంఘిక కావ్యం), కైమోడ్పు (గాలిబ్ శతజయంతికి వివిధ కవుల కవితాసంకలనం) సాహితీ సంపత్ ప్రచురించింది.

వసంత నవరాత్రులకు సాహిత్యగోష్ఠులు నిర్వహించే 'వసంత భారతి', ప్రాచీన సాహిత్యవ్యాప్తికై నెలకొల్పిన 'సుహృత్ పరిషత్' సంస్థలగురించి వివరాలు మృగ్యం. 1974–76 ప్రాంతాలలో భాగవత సప్తాహాలు నిర్వహించిన 'భాగవతవిజ్ఞానసమితి' సంస్థకూడా కాలగర్భంలో కలిసిపోయింది.

భీమవరం ప్రాంతంలోని సాహిత్య సంస్థలలో నేటికికూడా నిత్య సాహిత్యకృషిచేస్తున్న సంస్థ – శ్రీరామరాజభూషణ సాహిత్య పరిషత్ మాత్రమే.

## నరసాపురం ప్రాంతంలోని సాహిత్య సంస్థలు

నరసాపురం ప్రాంతానికి చెందిన నరసాపురం, పెనుగొండ, నిడదవోలులలో మొత్తం ఏడు సాహిత్య సంస్థలున్నాయి. ఈ ఏడింటిలో మూడు తప్ప – మిగిలిన నాలుగు సంస్థలు జీవంగా ఉన్నాయి. ముందుగా నరసాపురంలోని సాహిత్య సంస్థలను వివరిస్తాను.

నరసాపురంలో –

1) సాహితీ నికుంజము
2) మహాకవి జాషువా జయంతి సమితి
3. జ్ఞానపీఠ నిలయం

అనే మూడు సంస్థలున్నాయి. వీటిలో ప్రాచీనమైన సాహిత్యసంస్థ సాహితీనికుంజము' కాగా ప్రచురమైన సాహిత్యసంస్థ – మహాకవి జాషువా జయంతి సమితి.

ఇక 'జ్ఞానపీఠ నిలయము'ను సాహిత్యసంస్థగా కంటె ఆధ్యాత్మిక సంస్థగా పేర్కొన వలసి ఉంటుంది. శ్రీమతి సుందరేశ్వరీ జ్ఞానప్రసూనాంబగారు "జ్ఞానపీఠనిలయం" స్థాపించారు. ఒకటిరెండు సాహిత్య సభలు జరిగినా ఆధ్యాత్మిక–మత సంబంధమైన కార్యక్రమాలు, మతగ్రంథాలు ప్రచురించటంవల్ల సాహిత్య సంస్థగా ప్రాధాన్యత సంతరించుకోదని చెప్పవచ్చు.

## మహాకవి జాషువా జయంతి సమితి

నవయుగ కవిచక్రవర్తి గుఱ్ఱం జాషువా పేరుమీదుగా 1973లో ప్రారంభించబడిన సంస్థ "మహాకవి జాషువా జయంతి సమితి" ♦ మహాకవి జాషువా జయంత్యుత్సవాలు జరిపి జాషువా కవిత్వానికి ప్రాచుర్యం కలిగించటానికి శ్రీ ఉండవల్లి సీతారామస్వామి, శ్రీ బి థియడోర్‌లు స్థాపించారు. సర్వశ్రీ బొండాడ రమణగుప్త సాయిశ్రీ, టి. హరనాథ్, జి.వి.కె. రామారావు మొదలైనవారితోపాటు క్రైస్తవ పురప్రముఖులు కూడా సంస్థకు సహకారం అందిస్తున్నారు.

"అతని ఆవిర్భావం వల్లఈ సమాజం ఎన్ని అడుగులు ముందుకు వేసిందో లెక్కతేల్చడానికి గోరంతదీపాన్ని అన్వేషిస్తూ వెళ్తున్నవారిలో "మహాకవి జాషువా జయంతి సమితి" వారు ఒకరు. ఈ సంస్థలో ఎందరున్నా సారధి ఒక్కరే అని చెప్పాలి. జాషువా పదరూపాన్ని కలసిన ప్రతి ఒక్కరికీ పదేపదే చూపిస్తూ ఉండే ఆ ఫొటోగ్రాఫర్ ఒక సామాన్యుడు. స్థానికమిషన్ హైస్కూలులో పాఠాలు చెప్పుకొనే ఓబడి పంతులు. ఆయనపేరు బి. థియొడోర్. భిన్నకోణాల్లో జాషువా శిల్పాన్ని చెక్కుతూ కాలంగడిపేస్తూంటాడు. బహుశః ఆంధ్రదేశంలో జాషువా జయంతి ఉత్సవాలను మొదటిసారిగా ఈ సమితే ప్రారంభించి ఉండవచ్చు" — ఉదయం దినపత్రిక (28-10-85) నిజమే, ఈ సంస్థకు ఊపిరి శ్రీ బి. థియొడోర్‌గారే !

జాషువా కవిత్వంపై ఎందరో సాహితీవేత్తలచే ఉపన్యాస కార్యక్రమాలు ఏర్పాటు చేసింది. ముఖ్యంగా జాషువా పద్యాలకు యువతరంలో ప్రాచుర్యం, ప్రాశస్త్యం కల్పించాలని జాషువా పద్యపఠన కార్యక్రమాన్ని నిర్వహించింది. తొమ్మిదో తరగతి చదువుతున్న కందాళం

---

♦ బి. థియొడోర్‌గారితో జరిపిన ముఖాముఖి ఆధారంగా

లక్ష్మీ వెంకటరాఘవ సంపత్ కుమార్ 74 జాషువా పద్యాలను కంఠస్థంచేసి ఏకధాటిగా అప్పగించడం గమనించదగింది. జాషువాపై ఈ సంస్థ ఆరు గ్రంథాలను ప్రచురించింది.

1) జాషువా స్మృతి సంచిక (కవితా సంపుటి) (1976)

2) జాషువా కవితపై పద్యాలు, వ్యాసాలు (1977)

3) జాషువా కవికోకిలం (1978)
ఫిరదౌసి నుంచికొన్ని పద్యాలను డా॥ఎమ్.జి. థామస్‌గారు చక్కగా ఆంగ్లానువాదంచేశారు.

4) నవయుగ కవిచక్రవర్తి (1979)

5) మధుర శ్రీనాథుడు జాషువా
(జాషువాపై వ్యాసాలు, పద్యాలతోపాటు వచనకవితలుకూడా ఉన్నాయి.)

6) జాషువాపద్యాలు (1989)
విద్యార్థినీ విద్యార్థులకోసం జాషువా పద్యాలలో ఆణిముత్యాలను నూటిని సేకరించి ప్రచురించారు.

## సాహితీ నికుంజము :

డా॥ మానేపల్లి తారకలింగం (మల్లిబాబు) గారు, ఉండవల్లి సీతారామస్వామిగారు 1969లో "సాహితీ నికుంజము" స్థాపించారు. నరసాపురంలో ఇది ప్రాచీన సంస్థ. కొన్నాళ్ళు పాలకొల్లులోకూడా సాహితీ నికుంజ కార్యక్రమాలు బొండాడ వేంకట రాధారమణగుప్త గారి సహకారంతో జరిగేవి. 11-11-1981న వేమన జయంత్యుత్సవం జరిపి "వేమన కవితా ప్రశస్తి" అనే గ్రంథం ప్రచురించింది: ఇందులో కవితలు, వ్యాసాలు ఉన్నాయి. ఈ సంస్థ తర్వాత అంతరించిపోయింది.

## పెనుగొండ :

పెనుగొండలో 'సరసభారతి', రమ్యసాహితీ సమితి అనే రెండు సంస్థలున్నాయి. కొన్నేళ్ళపాటు సాహిత్య కార్యక్రమాలు నిర్వహించి పెనుగొండ వాసులకి సాహితీ విందు చేసిన ఈ సంస్థలు రెండూ నేడు మూతబడ్డాయి.

## సరస భారతి :

23-11-1975న ఆచార్య సి. నారాయణరెడ్డిగారు సరస భారతిని ఆవిష్కరింపజేశారు. శ్రీయుతులు వారణాసి శివరామకృష్ణయ్య, నడుపల్లి శ్రీరామరాజు మొదలైనవారు ఈ సంస్థను స్థాపించారు। చాలాకాలం వదాన్యులవల్ల, రామకృష్ణయ్యగారి సొంతసొమ్మువల్ల 'సరసభారతి' నడిచింది ఈ సంస్థ 'సరస భారతి అనే సాహిత్య పత్రికను ప్రచురించటం చెప్పుకోదగిన అంశం. డెమ్మీ సైజులో పది – పదిహేనుపుటల్లో వెలువడినా పలువురి ప్రశంసలు పొందింది. మంచివ్యాసాలు, కవితలతో 'సరసభారతి' ప్రాచీన, ఆధునిక సాహిత్యాలకి వారధిగా వుండేది. మూడున్నర సంవత్సరాలపాటు సాహితీ సుగంధాలను పెదజల్లి 'సరస భారతి' మరుగునపడిన సంస్థలలో చేరిపోయింది.

## రమ్యసాహితీ సమితి

యువకులు ఏమ్. ఆర్. వి. సత్యనారాయణమూర్తి, జి. వి. ఎస్. సుబ్రహ్మణ్యం, ఎన్. కె. నాగేశ్వరరావు, కె. సుధాకర్, యమ్. లలితా సూర్యకుమారి కలసి 12-7-1986న "రమ్య సాహితీసమితి"ని స్థాపించారు. ప్రతి ఉగాదికి రాష్ట్రస్థాయిలో కవితలు, కథానికల పోటీలు నిర్వహించటం, కవిసమ్మేళనాలు, యువకులకి ప్రోత్సాహం కల్పించటం మొదలైన కార్యక్రమాలవల్ల కొంత చైతన్యం కలిగించింది. స్పందన (కవితలు, కథల సంకలనం), నీరాజనం (వ్యాససంపుటి), ముత్యాలసరం (కథా

సంపుటి( అనే మూడు మంచిపుస్తకాలు ప్రచురించిన ఈ సంస్థకూడా ప్రస్తుతం పనిచేయ్యడం లేదు.

## నిడదవోలు :

నరసాపుర ప్రాంతంలోని సాహిత్య సంస్థలలో నిడదవోలులో రెండు సాహిత్య సంస్థలు ఉన్నాయి.

1) అభ్యుదయ సమితి

2) చైతన్య సాహితీ సమాఖ్య

## అభ్యుదయ సమితి *

1950_51 ప్రాంతాలలో రాష్ట్రంలో కమ్యూనిస్టుల అలజడి బాగా ఉండేది. భూస్వాములను బెదిరించడం, హత్యచేయడం, వరికుప్పలు తగులబెట్టడం వంటి చర్యలను కమ్యూనిస్టులు చేసేవారు. ఆదాడినుండి రక్షించుకోవడానికి పోలీసులకు సహాయంగా కొంతమంది యువకులుకలసి 'స్వయం సేవక సంఘం'గా ఏర్పడి గస్తీ తిరిగేవాళ్ళు. ఆవిధంగా కలిసిన యువకులే తర్వాత ఒక సంస్థగా ఏర్పడి సాహిత్య అర్థికరంగాలలో కార్యక్రమాలు చెయ్యాలని నిర్ణయించుకోగా _ 'అభ్యుదయసమితి' ఏర్పడింది

స్వాతంత్ర్య సమరయోధులు, ఆంధ్రగీర్వాణవిద్యాపీఠం కులపతి శ్రీ కేశిరాజు వేంకటనృసింహ అప్పారావుగారిచేత 15_8_50న ఈసంస్థ ప్రారంభించబడింది. కాశీపట్నపు శేషశాయిగారు అధ్యక్షులయ్యారు. గోపరాజు వెంకటానందంగారు కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

* సంస్థ కార్యదర్శి శ్రీ జి.పి.యం. రెడ్డిగారి 16_5_88 నాటిలేఖ ఆధారంగా

27-8-1950న అప్పటి ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారిని సన్మానం చేసిన కార్యక్రమం ఇప్పటికీ ఆ తరంవారు చెప్పుకుంటు న్నారు. విశ్వనాథ, జాషువా, కాటూరి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, వేదుల, ఇంద్రగంటి, అడవి బాపిరాజు, దాశరథి, కవికొండల వెంకటప్రావు, ముని మాణిక్యం వంటి సాహితీ మూర్తులు 'అభ్యుదయసమితి' సాహిత్య సభలలో పాల్గొన్నారు. కనుపర్తి వరలక్ష్మమ్మగారు, అద్దేపల్లి వివేకానందదేవి వంటి మహిళా రచయితలను ఆహ్వానించి మహిళలకు ప్రాధాన్యత ఇచ్చిన సంస్థ అనికూడా చెప్పవచ్చు.

కేంద్రప్రభుత్వ ఆర్థిక సహకారంతో 'బాలభారతి' అనే అనుబంధ సంస్థలను ఏర్పాటు చేసి బాలల వికాసానికి, బాలసాహిత్యానికి కృషిచేసింది ఒక గ్రంథాలయాన్ని నిర్వహించటంకూడా చెప్పుకోదగినదే. అయితే సభ్యుల అనైక్యతవల్ల రాజకీయాలవల్ల 1961 తర్వాత సంస్థ మూత పడింది. ఈ సంస్థ నిర్వహణలో శ్రీ గోపరాజు వెంకటానందంగారి కృషి ప్రశంసనీయం.

## చైతన్య సాహితీ సమాఖ్య

'అభ్యుదయసమితి' లేకపోవటంతో నిడదవోలులో సాహిత్య కార్యక్రమాలు జరగటంలేదు. కొంతమంది సాహితీ ప్రియులు కూడి 15-1-1884న సంక్రాంతినాడు స్థాపించిన సంస్థ - చైతన్య సాహితీ సమాఖ్య. ప్రాచీన, ఆధునిక సాహిత్య ప్రక్రియలను ఆదరించటమే ప్రధానధ్యేయంగా కొన్ని మంచికార్యక్రమాలను నిర్వహించింది.

శ్రీ ఎమ్.ఎస్. దీక్షితులు, శ్రీ పొన్న కృష్ణబాబు, శ్రీ జి.పి.యం. రెడ్డి, శ్రీ గోపరాజు వెంకటానందం, శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావులు సభ్యులుగా సంస్థ కార్యక్రమాలు చేపడుతోంది. ప్రతి ఉగాదికి వార్షిక మహోత్సవం బాగా నిర్వహిస్తుంది. శ్రీయుతులు సుంకవల్లి గణేశ్వర

రావు, శ్రీకాకుళపు సత్యనారాయణమూర్తి, ఆదూరి సీతారామయ్య, సత్తి రాజు విశ్వనాథంగార్లు ఈ సంస్థకి సహకరించారు.

## పశ్చిమగోదావరిజిల్లాలో మరికొన్ని సంస్థలు

### సాహితీ సుధ :

ఏలూరుకు సమీపానగల పెదపాడు గ్రామంలో 1981 డిశెంబరు 13న స్థాపించబడిన సంస్థ – సాహితీసుధ కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు గారు శ్రీ అక్కినేని సంజీవరావు, శ్రీ పిరాట్ల వెంకట సీతారామయ్య, ప్రతాప కనకశ్రీరామశాస్త్రి, నేలూరి శేషగిరిరావు మొదలైనవారి సహకారంతో సాహితీ సుధను ప్రారంభించారు.

సాహితీసుధ కార్యక్రమాలలో 1972లో జరిపిన బమ్మెరపోతన పంచశతజయంత్యుత్సవాలు చెప్పుకోదగినవి. ఒకే సంవత్సరంలో 1982 లో - మూడు కవితా సంకలనాలను ప్రచురించటం విశేషం!

1. వసంతోదయం – 2. సేసలు – 3. మనిషొక్కడే

### సాహితీ కళాసంసత్ :

కొవ్వూరులోగల ఈ సంస్థ ప్రాచీన సాహిత్య ప్రచారానికి, ఆధ్యాత్మిక సాహిత్యాభివృద్ధికి కృషి చేస్తోంది. ఒకసారి పశ్చిమగోదావరి జిల్లా రచయితల సభలుకూడా నిర్వహించినట్టు తెలుస్తోంది. వారణాసి వేంకటేశ్వరశాస్త్రి, గంగాధరశాస్త్రి గార్లు ప్రభృతులు ఈ సంస్థద్వారా అప్పుడప్పుడు సభలను నిర్వహిస్తున్నారని తెలిసింది. 'మోక్షకల్పద్రుమము' అనే ఆధ్యాత్మిక గ్రంథాన్నికూడా ఈ సంస్థ ప్రచురించింది.

### కౌముదీ కళానికేతన్ :

సర్వశ్రీ చదువుల సుబ్రహ్మణ్యం, పడాల ప్రహ్లాదరెడ్డి, పోడూరి రామచంద్రరావు, వడగం నరసింహం, బి. రమేష్, ఎల్. వి. ఎస్. ఎన్.

మూర్తి మొదలైనవారు 1988 – అగస్టు 15న 'కౌముదీకళానికేతన్' ను ప్రారంభించారు. గత సంవత్సరం రాష్ట్రస్థాయిలో "కార్డుకవితలపోటీ" నిర్వహించారు. ఆపోటీలో గెలుపొందిన కవితలు, మరికొన్ని మినీకవితలు కలిపి "కవితా కుసుమాలు"గా ప్రచురించారు. ఈ కవితల పోటీకి న్యాయ నిర్ణేతగా ఉన్న ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు – "కవిత లన్నింటి లోనూ సామాజికస్పృహ స్పష్టంగా కనిపిస్తోంది" అంటూనే పదసంయోజ నాశక్తి కి కవితా పఠనాశక్తి ఉండాలని సలహాకూడా ఇచ్చారు. ఈ సంస్థ ముమ్మందు అభివృద్ధి చెందగలదని ఆశిద్దాం.

## సాహిత్య కళాసమితి :

నూరుమంది సభ్యులచే 1960 లో పడాల రామకృష్ణారెడ్డిగారు వ్యవస్థాపకులుగా కొంకుదురు లో స్థాపించబడిన సంస్థ – సాహిత్యకళా సమితి: సత్కారాలు, కవి సమ్మేళనాలతోపాటు బుర్రకథా ప్రదర్శనలకు ప్రాముఖ్యమిచ్చిన సంస్థ. ఈ సంస్థ కాలగర్భంలో కలిసిపోయింది.

ఇంకా గంపలగూడెం దగ్గర అర్లపాడు గ్రామంలో 'సారస్వత చంద్రికామండలి' ఒకప్పుడు కార్యక్రమాలనునిర్వహించినట్టు తెలుస్తోంది.

నరసాపుర ప్రాంతంలో సాహిత్యసంస్థలు తక్కువే. చైతన్యం కూడా తక్కువే.

పశ్చిమగోదావరిజిల్లాలో సాహిత్య సంస్థల సంఖ్య తూర్పుగోదావరి జిల్లా కంటె తక్కువ. సంఖ్యలోనేకాదు సాహిత్య కార్యక్రమాలను ఎక్కువగా నిర్వహించేశక్తి గల సంస్థలు, రచయితలు కవులు నిర్వహించే సంస్థలుకూడా తూర్పుగోదావరిజిల్లాలోనే ఎక్కువ. పశ్చిమగోదావరిజిల్లా కూడా ఒకప్పుడు సాహిత్యానికి ఆటపట్టుగా ఉండేది. ఆధునిక కాలంలో – గడచిన మూడు దశాబ్దాలుగా సాహిత్య సంస్థల చైతన్యం కనిపించదు.

ఏలూరులోని 'సాహిత్యమండలి' ఒకప్పుడు ఎంత సాహితీ చైతన్యాన్ని కలిగించిందో — ఈనాడు భీమవరంలో శ్రీ రామరాజభూషణ సాహిత్య పరిషత్ అంత చైతన్యాన్ని కలిగిస్తోంది. అయితే సాహిత్య మండలి నిర్వాహకులు, సాహితీవేత్తలు, కవులు రచయితలు! తర్వాత పేర్కొనదగిన సంస్థ తణుకులోని శ్రీ నన్నయభట్టారక పీఠం.

అభ్యుదయ రచయితల సంఘం, విప్లవ రచయితల సంఘంవంటి సంస్థల శాఖలున్నట్టు వినికిడి తప్ప వాటి కార్యకలాపాలు ఈజిల్లాలో చెప్పుకోదగినంత లేవు. ఆధునిక సాహిత్యానికి కట్టుబడిన సంస్థ అంటూ ప్రత్యేకంగా పశ్చిమగోదావరిజిల్లాలో లేదు. (రాజమండ్రిలో చైతన్య వేదిక మాదిరి). జాషువాపై ఈ జిల్లాలో రెండు సంస్థలున్నాయి. (తూర్పుగోదావరిలో — కాకినాడలో ఒకటి ఉంది). పశ్చిమగోదావరిజిల్లాలోని సాహిత్య సంస్థలు మరింత చైతన్యవంతంకావలసిఉంది. నడుస్తున్న సంస్థలకంటె కాలగర్భంలో కలిసిపోయిన సంస్థలే ఎక్కువ అనే విషయం ఉభయగోదావరి జిల్లాలకూ వర్తిస్తుంది.



## ఐదవ అధ్యాయం

# సాహిత్య సంస్థలు : నాడు - నేడు

"కవితా వ్యాసంగంలో ముఠాలు ఏర్పడటం అంత శ్రేయోదాయకం కాదు. ఉత్తమ సాహితీ రచనల్లో సంఘాలకు ప్రాధాన్యంలేదు. రచయితల సహకార సంఘాలలాంటివి వ్యాపారదృష్టిలో ప్రచారానికి పనికివచ్చేవే గాని ఉత్తమ సాహిత్యసృష్టికి సంబంధించినవికావు."♦

_ అని పలికిన అబ్బూరి రామకృష్ణారావుగారే స్వయంగా "ఆంధ్ర వర్ధమాన లేఖకసంఘం" స్థాపించారు అంటే_సంఘాల ప్రభావం సాహితీవేత్తలపై ఎంత గాఢంగా వుందో తెలుసుకోవచ్చు- 'సంఘాలు ఉత్తమ సాహిత్య సృష్టికి సంబంధించినవి కావు' అని అబ్బూరివారు అనటం

♦ 'అబ్బూరి సంస్మరణ' ! సం, అబ్బూరిగోపాలకృష్ణ. పుట 264

సముచితం కాదనిపిస్తుంది. ఆంధ్ర సాహిత్య పరిషత్, సాహితీ సమితి, సాహిత్యమండలి, అరసం వంటి సాహిత్య సంఘాలవల్లనే ఉత్తమ కవులు వెలుగులోకి రావడం–ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించడం జరిగిందని ఆయా సంస్థల చరిత్రనుబట్టి తెలుస్తుంది. సంస్థలవల్లమాత్రమే ఉత్తమ సాహిత్య సృష్టి జరుగుతుందనికానీ, సంస్థలు లేకపోతే ఉత్తమ సాహిత్యసృష్టి జరగదనికానీ నా అభిప్రాయంకాదు. కావ్యహేతువులలో – ప్రతిభ ఉన్నప్పుడు మిగిలిన పాండిత్యం, అభ్యాసాలు సంఘాలవల్ల జనించడానికి – ఎక్కువ అవడానికీ అవకాశం ఉంటుందనే అభిప్రాయపడుతున్నాను.

అబ్బూరి రామకృష్ణారావుగారు చెప్పినట్టు కవితా వ్యాసంగంలో ముఠాలు ఏర్పడటం మాత్రం అంత శ్రేయోదాయకంకాదు. ప్రాచీన సాహితీ సంస్థలలో ఈ విధమైన ముఠాలు ఏర్పడ్డాయి. భావకవిత్వం వెలువడిన కాలంలో ఇది మరీ ఎక్కువగా కన్పిస్తుంది. ఈనాటి సంస్థలలో ముఠాలు కవితావిషయంపై కంటె రాజకీయ విషయాలపై ఏర్పడుతూండటం గమనిస్తున్నాం.

ఆనాడు సాహిత్య సంస్థలకు సాహిత్యేతరులు పోషకులుగా ఉన్న సమయాలున్నా అధికశాతం సాహితీవేత్తలు, సాహితీ పరిశోధకులు, కవులు నడిపినవే. అందువల్ల సంస్థలు సాహిత్యంకోసం ఆవిర్భవించాయి. సాహిత్యంవల్ల బతికాయి. సాహిత్యాన్ని ప్రచారం చేశాయి. ఆనాటి సంస్థలకు స్పష్టమైన ధ్యేయం ఉండేది. 'రిజిష్టరు చేసినా చేయకపోయినా సాహిహిత్యాభివృద్ధికోసం కొన్ని నియమాలు ఆచరించేవారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు, సాహితీ సమితి, ఆంధ్ర సారస్వత పరిషత్తువంటి సంస్థలు ఒక లక్ష్యం ఆధారంగా పనిచేశాయి. ఆ లక్ష్యం నెరవేరగానే – ఆ తరంవారు కీర్తిశేషులవగానే – కొత్తతరంవారికి ఆ లక్ష్యాల అవసరం లేకపోవడంవల్ల ఆ సంస్థలు మూలపడ్డాయి. అంటే ఒకవిధంగా వాటి అవసరం తీరిపోయిందన్నమాట.

ఆ నాటి సాహిత్య సంస్థలవల్ల కవులు, కథకులు, నాటకకర్తలు, ఉపన్యాసకులు తయారయ్యారు. ప్రతిభ పుట్టుకతో లేకున్నా కృషివల్ల, సాంగత్యంవల్ల అలవడుతుందని ఆ సంస్థలు ఋజువుచేసాయి. కొన్ని సంస్థలు (సాహితీసమితి) రచయితలు మాత్రమే సభ్యులు కావటానికి యోగ్యులనే నిబంధనను అమలు చేయడంవల్ల 'బలవంతపు రచయితలు' పుట్టుకొస్తే పుట్టుకురావచ్చు. కాలక్రమేణా వాళ్ళే రచయితలుగా స్థిరపడి ఉండవచ్చు "స్పర్థయా వర్థతే విద్యా" అనే సూక్తిని అక్షరాలా పాటించిన సంస్థలివి.

ప్రాచీన సాహిత్య సంస్థలు కార్యక్రమాలకు, రచయితల ఉపన్యాసాలకు ఎంత ప్రాముఖ్యం ఇచ్చాయో గ్రంథ ప్రచురణకు అంతగాను ప్రాముఖ్యం ఇచ్చాయి. ఆ సంస్థలు కొన్ని గ్రంథాలు ప్రచురించకపోతే తెలుగులో ఎంతో ఉత్తమ సాహిత్యాన్ని కోల్పోయేవాళ్ళం. (కవితాసమితి ప్రచురించక పోవటంవల్ల మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి 'నుడికడలి' నిఘంటువును పోగొట్టుకున్నాం)- ఆంధ్ర సాహిత్యపరిషత్, సాహితీసమితి నవ్య సాహిత్యపరిషత్, ఆంధ్ర సారస్వత పరిషత్‌వంటి సంస్థలు ప్రచురించిన గ్రంథాలు, కావ్యాలు, ఉత్తమ సాహిత్యానికి చెందినవి. సార్వకాలికమైనవి.

నాటి సాహిత్య సంస్థలు పోటీలు నిర్వహించి ప్రభావంతుల్ని ప్రోత్సహించాయి. కావ్యాలు, గ్రంథాలు ప్రచురించి వెన్నుతట్టాయి. కళాసమితి సంస్థ 'ప్రభవ'ను ప్రచురించి శ్రీశ్రీని ప్రోత్సహించింది. బిరుదురాజు రామరాజు, నారాయణరెడ్డి, దాసరివంటివారికి తెలంగాణా రచయితల సంఘమే స్ఫూర్తినిచ్చింది. అందుకనే ఆనాటికవులు, విమర్శకులు రచయితలు తమరచనలలో పేరుప్రక్కన "బ్రాకెట్టు"లో సంస్థపేరుకూడా వేసుకొనేవారు. ♦ ఆ విధంగా వేసుకోవటం 'అదనపుయోగ్యత'గా

---

♦ శ్రీశ్రీ కూడా శ్రీరంగం శ్రీనివాసరావు బి.ఏ. (కవితాసమితి) అని వేసుకొనేవారు.

భావించేవారు. "నేను ఫలానా సంస్థ సభ్యుడ్ని" అనిచెప్పుకోవటం గొప్పగా ఉండే పరిస్థితిని సాహిత్య సంస్థలు తీసుకొన్నాయి.

ప్రాచీన సాహిత్యసంస్థలు ఏర్పాటుచేసిన సాహిత్యసభలు పూర్తిగా సాహిత్య వాతావరణంతో కూడుకొని ఉండేవి. సభాధ్యక్షులుగా సాహితీ మూర్తులనే నియమించేవారు. ఆనాటి సభల అధ్యక్షోపన్యాసానికి ఎంతో విలువ ఉండేది. ఆంధ్ర సాహిత్య పరిషత్తు, సారస్వతపరిషత్తులలోని అధ్యక్షోపన్యాసాలు ప్రామాణికంగా, చారిత్రకాంశాలతో - ఒక్కొక్కటి ఒక పరిశోధనా గ్రంథంగా ఉండేవి. సభల నిర్వహణలో పెద్దలమాటకు బదులు చెప్పే స్థితి లేకపోయినా నియమ నిబంధనలమేరకు సభలు జరిగేవి సన్మానాలకోసం, బహుమానాలకోసం ఆశపడి సభలుచేసిన సంస్థలులేవనే చెప్పవలసి వుంటుంది. సాహితీవేత్తలు 'గొంతెమ్మకోర్కెలు' కోరకుండా సాహిత్యంపట్ల గల అభిమానంతో సభలకు వెళ్ళేవారని తెలుస్తుంది. సాహిత్య సభలలో తమకు నచ్చాని విషయంపై ఉపన్యాసం చేస్తున్నా - సభలకు వెళ్ళి ప్రత్యర్థుల వాదనలోని అంశాలను, గమనించేవారట (గ్రాంధికవాదులు వ్యావహారిక భాషాసదస్సులకు, వ్యావహారిక వాదాలు - గిడుగు వారు కూడా - గ్రాంధికవాదాల సభలకు వెళ్ళేవారట!). భేదాభిప్రాయాలున్నా విషయగ్రహణపట్ల శ్రద్ధకనబరచటం సంస్థలలోని వ్యక్తులకు అలవాటు చేసేవారు.

సాహిత్యపత్రికలను నిష్పక్షపాతముగానూ, సిద్ధాంతాలకు అనుకూలంగానూ నడిపిన సంస్థలు ఆనాడూ ఉన్నాయి. మొత్తంమీద ఆ సంస్థలు పత్రికలద్వారా ఎనలేని సాహిత్య సేవచేశాయి.

ప్రాంతాలవారీగా పరిశీలించినప్పుడు సాంస్కృతిక రాజకీయ, వాణిజ్యాలకు కేంద్రమైన కోస్తా ప్రాంతాలలోనే సాహితీ సంస్థలు ఎక్కువగా ఉండటం కనిపిస్తుంది. ఈ ప్రాంతంలోని సాహితీ సంస్థలే ప్రాచుర్యం కూడా వహించాయి. తెలంగాణా, రాయలసీమలలో ప్రతిభావంతులైన

సాహితీవేత్తలు కవులున్నా - అక్కడి చారిత్రక సాంఘిక పరిస్థితులవల్ల సాహిత్య సంస్థలకు పోషకులు తక్కువగా ఉండటంవల్ల చెప్పుకోదగిన సాహిత్య సంస్థలు నాలుగైదుకంటె మించవు.

ఆనాటి సాహిత్య సంస్థలపై రాజకీయాల ప్రభావంలేదు. సాహిత్య పరిణామాలు చాపక్రింద నీరులాగా జరుగుతూండేవి. భేదాభిప్రాయాలున్నా పత్రికలలో వాదించుకొనేవారు. అయితే సాహిత్యసభలో కూడా వాదవివాదాలు జరిగేవి. కొన్ని సాహిత్య సంస్థలు కొందరి పక్షం వహించేవి. ముఖ్యంగా నియోగి, వైదీక వర్గాలు ఏర్పడినపుడు ఈ పక్షపాతం కనిపించేది. ఏమైనా మొత్తంమీద ప్రాచీన సాహిత్య సంస్థలు కొన్ని లోపాలున్నా - సాహితీ సమారాధనే ధ్యేయంగా కొనసాగాయి. సాహిత్యం కోసమే స్థాపించబడ్డాయి. సాధ్యమైనంతవరకు సాహిత్యేతరశక్తులను సంస్థలలోకి ప్రవేశింపనీయలేదు.

ప్రాచీన సహిత్యసంస్థలలో కొన్నిదోషాలుకూడా లేకపోలేదు. ఆ సంస్థలు పండితులకే పరిమితమయ్యాయి. సామాన్య ప్రజలకి సన్నిహితంకాలేకపోయాయి. పండితులకే పరిమితమైపోవడంవల్ల పండితులు కాని సాహిత్యాభిలాషులకు ప్రవేశం దొరకలేదు. ఆ సంస్థలలోకూడా కొద్దిగానో గొప్పగానో మనస్పర్థలు ఏర్పడిన సంస్థలూ లేకపోలేదు. గుణాలతో పోల్చినప్పుడు ఈ దోషాలు చంద్రునిలో మచ్చాలవంటివని చెప్పవలసి వస్తుంది. ఆనాటి సాహిత్య సంస్థలు సాహిత్య సంపదకు కృషిచేశాయి తప్ప, సాహిత్య ప్రచారానికి కాదని అనుకోవలసివస్తుంది.

నేటి సాహిత్య సంస్థలకు ఆనాటి సాహిత్య సంస్థలకు పోలిక పొసగదనే చెప్పవచ్చు. చారిత్రక, సామాజిక వాతావరణంబట్టి పరిశీలించినప్పుడు 'నేటి ప్రాధాన్యత వాటిది' అనిపిస్తుంది. అయితే - ఆనాటి సాహిత్య సంస్థలు సాహిత్యానికి అంకితమైనట్టుగా నేటి సంస్థలు అంకితం కావటంలేదనే చెప్పవలసివస్తుంది. నేటి సాహిత్యసంస్థల స్వరూపస్వభా

వాల్ని పరిశీలించగా – ఆయా సంస్థల కార్యక్రమాల్ని నిశితంగా నిష్పక్షపాతంగా అనుశీలించగా – సంస్థ నిర్వాహకులతో ముఖాముఖిసంభాషించగా ఈనాటి సాహిత్య సంస్థల తీరుతెన్నులను ఈ క్రింది విధంగా అంచనా వేయవచ్చు.

1. రాజకీయ సిద్ధాంతాలు ప్రాతిపదికగాగల సంస్థలు
2. ప్రక్రియలకోసం ఏర్పడిన సంస్థలు
3. స్వప్రయోజనాలకోసం ఏర్పడిన సంస్థలు
4. అభిమానంతో ఏర్పడిన సంస్థలు
5. ఆర్థిక ప్రయోజనా దృష్టితో ఏర్పడిన సంస్థలు

రాజకీయ సిద్ధాంతాలు ప్రాతిపదికగా ఏర్పడిన సాహిత్య సంస్థలలో సాహిత్యంపాలు తక్కువ – రాజకీయంపాలు ఎక్కువ. రాజకీయసిద్ధాంతాల ప్రచారానికి మక్కువచూపటం కనబడుతుంది. 'కేవల కల్పనాకథల' మాదిరి 'కేవల రాజకీయ సాహిత్యం' కూడా వాంఛనీయంకాదు. 'రాజకీయ' సాహిత్య సంస్థలవల్ల బాగోగులు లేకపోలేదు.

రాజకీయాలకీ సాహిత్యానికీ పొంతనలేదనీ – ఉండకూడదనీ వాదించేవారున్నారు. అయితే ఇది చారిత్రక పరిణామంగా గుర్తించవలసివుంటుంది. ఒకసారి టి. ఎల్. కాంతారావుగారు భారతిలో రాజకీయాలకు సాహిత్యానికి నన్నయనుంచి అవినాభావ సంబంధమున్నదని వివరిస్తూ వ్యాసం రాశారు. పాలకులనుబట్టి, పాలననుబట్టి సాహిత్యం ఉంటుందనే అభిప్రాయం కొంతవరకు సమంజసమే. ఈ సందర్భంగా శ్రీశ్రీ మాటలు ఉదహరించదగినవి.

"మేము సాహిత్యవేత్తలం మాకూ రాజకీయాలకీ సంబంధంలేదు. – అనేవాళ్ళ సంకుచిత దృష్టికి నేను జాలిపడటం మానలేను. సాహిత్యా

నికీ రాజకీయాలకీ అవినాభావ సంబంధం ఉంది. ఈ సంగతి ఎంత పెందరాళే గుర్తిస్తే అంతమంచిది. రాజకీయ సమస్యలంటే జీవిత సమస్యలు, సాహిత్య సమస్యలుకూడా అంతే ♦

రాజకీయ సిద్ధాంతాలకు కట్టుబడిన సంస్థలవల్ల సాహిత్యప్రజల దగ్గరకు వెళ్ళేఅవకాశం ఏర్పడుతుంది. ప్రజల సమస్యలను చిత్రీకరించే రచయితలకు 'సమాజానికి సాహిత్య ప్రతిబింబం' అనేమాట నిజమవుతుంది ఆ రీత్యా ఈ సంస్థలు చాలామటుకు విజయవంతమయ్యాయి. ఈ రాజకీయ సంస్థలప్రభావం ఎంతగాఉందంటే ఆ సంస్థలతో సంబంధం లేకపోయినా ఆ సంస్థల ఆశయాలకు అనుగుణంగా రచించేవారున్నారు. 'అభ్యుదయవాది', విప్లవకవి' అనిపించుకోవాలనే తపనకూడఎక్కువైంది.

మరో కోణంనుంచి చూసినప్పుడు – రాజకీయ సిద్ధాంతాల నేపథ్యంలో ఏర్పడిన సంస్థలలోగల లోపాలుకూడా బహిర్గతమవుతాయి. ఈసంస్థలు "బద్ధత" (కమిట్‌మెంట్) తో పనిచేస్తాయి. కాబట్టి ఆమేరకు వెలువడిన సాహిత్యాన్ని మాత్రమే గుర్తిస్తారు. రాజకీయ సిద్ధాంతాల ప్రచారానికి అనుగుణమైన సాహిత్యమే సాహిత్యమంటూ సాహిత్యానికి గల విశ్వసృత శక్తిని సంకుచితబరుస్తారు. నిబద్ధతగల సాహిత్య స్రష్టలే గౌరవించి తక్కినవారిని నిరసించడమే కాదు – కొండొకచో దూషించటంకూడా జరుగుతుంది.

మరొక పెద్దలోపంకూడా వుంది. రాజకీయ సిద్ధాంతాలు భారతీయమైనవి కావు. విదేశాలలోని "పార్టీల" సిద్ధాంతాలను మన సమాజానికి అన్వయించటానికి పాటుపడుతూ ఉంటారు. ప్రపంచ వ్యాప్తంగా జరిగే రాజకీయ పరిణామాల దృష్ట్యా – భారతదేశ రాజకీయ వ్యవస్థలో ఏర్పడే విపరీత పరిణామాలదృష్ట్యా ఆ సిద్ధాంతాలు మారుతూంటాయి. లేదా

♦ ఆంధ్రదేశంలో సాహిత్యసంఘాలు: సారస్వత వ్యాసాలు (ఆం.ప్ర.సా. అకాడమి) 1981 పుట 210

రాజకీయ వర్గాలలో వైవిధ్యాలు – వైరుధ్యాలు – వైషమ్యాలు ఏర్పడుతుంటాయి. రాజకీయ సిద్ధాంతాలలోగల ఈవైరుధ్యాలకు-వైషమ్యాలకు అనుగుణంగా ఏర్పడిన సంస్థలలోకూడా ముఠాలు - వర్గాలు ఏర్పడి చివరకు చీలికలకు దారితీస్తాయి–దారితీశాయికూడా. రాజకీయ పార్టీలలో మాదిరిగా ఈ రాజకీయ సంస్థలు కూడా ఛిన్నాభిన్నమైపోయాయి. రాజీనామాలు – బహిష్కరణలు చోటుచేసుకొని మరోపార్టీ పుట్టిన విధంగా - మరో 'సాహిత్యసంస్థ' వెలుస్తుంది. ఇవన్నీ 'ప్రజా, జన' వంటిపేర్లు పెట్టుకుంటాయి. వారే ఏకతాటిపైన నడవలేనిదే – సమైక్యంగా లక్ష్యసిద్ధిని సాధించే ప్రయత్నం చేయలేకపోతే – ప్రజల్ని– సమాజాన్ని అభ్యుదయ విప్లవపథంవైపు ఏవిధంగా నడిపిస్తారనే ప్రశ్నకు సరైన సమాధానం దొరకవలసివుంది.

ప్రక్రియపరంగా ప్రాధాన్యమిచ్చే సంస్థలు కొన్ని లేకపోలేదు. అంటే ప్రాచీన సాహిత్యం ఉదాత్తమైనది, సార్వకాలికమైనది, సార్వజనీనమైనది అని ప్రగాఢంగా విశ్వసిస్తూ – ప్రాచీన సాహిత్యంలో లేనిది మరెక్కడా లేదనీ అభిప్రాయపడుతూ ప్రాచీన సాహిత్యవైభవ పునరుద్ధరణకోసం [illegible]ంచబడుతున్న సంస్థలున్నాయి. ప్రాచీన సాహిత్యంపైనమాత్రమే కార్యక్రమాలను నిర్వహించటం - అష్టావధాన శతావధానాలను నిర్వహించటం – పురాణ సాహిత్యానికి, ప్రబంధసాహిత్యానికీ ప్రాముఖ్యంఇవ్వటం ఈ సంస్థల ఆశయాలు. ఛందోబద్ధ కవితావ్యాప్తికి కృషిచేస్తూ – పద్యపఠన పోటీలు - పద్యరచన పోటీలు నిర్వహిస్తూంటాయి. లక్షణబద్ధమైన రచనలే సాహిత్యమని భావించేసంస్థలు రెండుమూడు లేకపోలేదు. ఈసంస్థలు ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన రచనలను ప్రోత్సహిస్తూ - ప్రాచీన సాహిత్యాన్ని ఆదరించేవారిని మాత్రమే సభలకు ఆహ్వానిస్తూంటారు. ఆధునిక సాహిత్యం సాహిత్యం కాదని కొన్ని సంస్థలు తీవ్రవాదం చేస్తే–

మరికొన్ని సంస్థలు కరుణశ్రీ వరకు (భావకవిత్వం వరకు) గల సాహిత్యాన్ని ఆదరిస్తూంటాయి వచన కవితలను నిరసించే సంస్థలుకూడా లేకపోలేదు.

మరో ప్రక్క ప్రాచీన సాహిత్యానికి కాలం చెల్లిందనీ – ఈనాడు పద్యాలలో కావ్యాలు రచించే అవసరంలేదనీ–ఆధునిక సమాజంలో ఆధునిక ప్రక్రియలకే పట్టంకట్టాలనీ – ఈనాటి కవితారూపం 'వచనకవిత' ఒక్కటే అనీ – భావించే సంస్థలు ఉన్నాయి. "ప్రాచీన సాహిత్యం మ్యూజియంలో భద్రపరచవలసినది" అని వక్కాణిస్తూంటాయి. ఆధునిక సాహిత్యంపై మక్కువ గలవారినే ఆహ్వానించే సంస్థలివి- ఈ సంస్థలు వచన కవితల పోటీలు నిర్వహిస్తుంటాయి. ఉత్తమకవితా సంపుటులకు, ఆధునిక సాహిత్య ప్రక్రియలకు బహుమతులిస్తూంటాయి. ఈ ఆధునిక సాహిత్యానుగుణమైన సంస్థలుకూడా ఆధునిక కవులందర్ని ఆమోదించక పోవటం కద్దు.

ప్రాచీన సాహిత్యానికి అంకితమైన సంస్థలలో కొన్ని ఆధునిక సాహిత్యంపట్ల ముఖావంగా ఉండేవికూడా ఉన్నాయి. ఆదేవిధంగా ప్రాచీన సాహిత్యంపట్ల ముఖావంగా ప్రవర్తించే ఆధునికసాహిత్యసంస్థలూ ఉన్నాయి. ప్రాచీన – ఆధునిక సాహిత్యాలు రెండింటిని సమాదరించే సంస్థలు ఎక్కువగా ఉన్నాయి.

మానవుడు సామాన్యంగా 'తన్నుమాలిన ధర్మం' ఆశించడు. అంతో ఇంతో 'స్వార్థచింతన' తప్పదు. ఆ స్వార్థంలోంచే 'స్వప్రయోజనం' పుట్టుకొస్తుంది. కీర్తి, పరిచయాలు, సన్మానాలు, ప్రశంసలు...ఇవన్నీ స్వప్రయోజనాలే. పేరు సంపాదించటానికిగాని, పదిమందిని పరిచయంచేసుకొని ఒక 'స్థాయి'ని (Status) పొందాలనిగాని, సత్కారాలకు, ప్రశంసలకు ఆశపడిగాని సంస్థలు స్థాపించటమో – సంస్థలలో జేరటమో జరుగుతుంది. అటువంటివారుగల సంస్థలు సాహిత్యనికి పెద్దగా ప్రయోజనకరంగాఉండవు

గదా! 'స్వప్రయోజనం'తో సంస్థ అధ్యక్ష, కార్యదర్శివంటి పదవులకు ఆశ పడతారు. ఎన్నికలుకూడా జరగవలసి ఉంటాయి- అప్పుడు వర్గాలుతప్పవు గదా! సాహిత్యంగురించి తెలీకపోయినా సాహిత్యసంస్థ పదవులను అధిష్టిస్తుంటారు. వీరు కొన్నాళ్ళు ఆ పదవులలో కొనసాగుతారు. సాహిత్యేతర శక్తులు సంస్థలోకి ప్రవేశించటంవల్ల కొందరు సంస్థనుంచి వైదొలగుతారు. తర్వాత ఆ సంస్థ మరుగున పడిపోతుంది. ఈ విధంగా స్వప్రయోజనాలు ఆశించి పదవులపై ప్రాకులాడే వారివల్ల చాలా సంస్థలు మూతపడటమో_నిద్రాణస్థితికి జారుకోవటమో జరిగింది. కొందరు సొంతపుస్తకాల ప్రచురణకోసం, సొంతకీర్తికోసం _ 'ఫొటో'లకోసం _ 'అకాడమీ' (పూర్వం)లో సభ్యత్వంకోసం – ఇటువంటి అవసరాలకోసం స్థాపించబడిన సంస్థలు ఉన్నాయి.

అయితే స్వప్రయోజనాలు నేపథ్యంగా ఏర్పడిన సంస్థలవల్ల సాహిత్యానికి ప్రయోజనం లేదని చెప్పలేం. స్వప్రయోజనం కోసమైనా సాహిత్యసభలు నిర్వహించటం - పద్ధతిమ్మంది ప్రోత్సహించడం _ అంకితోత్సవాలద్వారా రచయితలను ప్రోత్సహించటంవంటివి కూడా జరుగుతాయి కాబట్టి కొంతయినా సాహిత్యకృషి చేస్తున్నట్లేగదా!

ఇక అభిమానంతో ఏర్పడిన సంస్థలగురించి చెప్పుకుంటున్నప్పుడు కొన్ని అప్రియాలు కూడా చెప్పవలసి వస్తుంది. ఈ అభిమానం కులాభిమానం కావచ్చు. ప్రాంతీయాభిమానం కావచ్చు. కవిపై అభిమానం కావచ్చు. చాలా కొద్దిగాఉన్నా _ మతాభిమాన సంస్థలూ లేకపోలేదు. ఈ విధంగా అభిమానంతో సంస్థలు ఏర్పడటం సముచితమా అనే ప్రశ్న జనించవచ్చు. ఏ అభిమానమైనా _ "దురభిమానం"గా మారనంత వరకు సముచితమే అని సమాధానం చెప్పవచ్చనుకుంటాను! అంటే ఒక అభిమానం మరొకవిషయంపై దురభిమానంగా పరిణమించకూడదు, అలాగే వల్లమాలిన (మితిమీరిన) అభిమానంకూడా సమంజసంకాదు.

తమ కులానికి సంబంధించిన కవి కాబట్టి — ఆ కవి పేరుమీదుగా సంస్థ నెలకొల్పుతారు. ఆ కులానికి సంబంధించినవారే ఎక్కువగా ప్రోత్సాహిస్తూ ఉంటారు. అయితే ఈకులాభిమాన సంస్థలవల్ల మేలుజరగకపోదు. మరుగున పడిన కవులు, మరుగునపడిన గ్రంథాలు వెలుగులోకి రావటం గమనిస్తాం. ఆయా కవులు — కవితా ప్రతిభకూడా గుర్తించకలుగుతాం. తద్వారా ఆకవులు ప్రచారంలోకి వస్తారు. తమ కులాభిమానంతో ఇతర కులాల కవులపై ధ్వజమెత్తనంతవరకు ఇటువంటి సంస్థలవల్ల పెద్దనష్టమేమీ ఉండదు.

ప్రాంతీయాభిమానంతో ఏర్పడిన సంస్థలు మనకు ఎక్కువగానే ఉన్నాయి. జిల్లాపరంగా, తాలూకాపరంగా కూడా సంస్థలు ఉండటం మనకు తెలిసిందే. తమప్రాంతపు రచయితలకు, సాహిత్యానికి గుర్తింపు లభించాలని ఈ సంస్థల ధ్యేయంగా చెప్పుకోవాలి. సువిశాలమైన రాష్ట్రములో — పరిమితులకు లోబడి ప్రచారసాధనాలు పనిచేస్తున్నప్పుడు ప్రాంతీయ అభిమానసంస్థలు ఏర్పడటం వాంఛనీయమే అనిపిస్తుంది. పైగా ఆప్రాంతపు రచయితలు సమిష్టిగా సాహిత్యాభివృద్ధికి పాటుపడే సదవకాశం లభిస్తుంది. అంతేకాదు — ఇతరప్రాంతాలవారికి ఆ ప్రాంతపు సాహిత్యస్థితిగతులు తెలుసుకొనేఅవకాశంకూడా ఏర్పడుతుంది. ఒక్కొక్కసారి సామాజిక పరిస్థితులను బట్టి రచయితలను ప్రోత్సహించడానికి సాహిత్యాభిమానం రేకెత్తించడానికి ప్రాతీయ సంస్థలు అవసరమేమో అనిపిస్తుంది. శైవ, వైష్ణవ, క్రైస్తవ మత సాహిత్యాల వ్యాప్తికోసం ఏర్పడిన సంస్థలు వ్రేళ్ళమీద లెక్కపెట్టవలసినవి మాత్రమే. చలనచిత్రాలలోని 'నటుల అభిమాన సంఘాలు'గా మారనంతకాలం — హద్దులలో అభిమానం ఉన్నంతకాలం — ఈ రకమైన సంస్థలవల్ల ప్రయోజనం ఉందని చెప్పవచ్చు.

ఆర్థిక పుష్టిలేక పోవటంవల్ల కొన్ని మంచి సంస్థలు మూలపడుతుంటే ఆర్థిక ప్రయోజనాన్ని ఆశించి కొన్ని సంస్థలు ఏర్పడుతున్నాయి. ఇటు

వంటివి తక్కువైనా ఉన్నాయని చెప్పడమే నాఉద్దేశం కొన్ని సంస్థలు "ప్రవేశరుసుం"తో కథలపోటీలు, కవితల పోటీలు నిర్వహిస్తారు. అంటే "లాటరీ"ల మాదిరి పోటీలో పాల్గొనేవారి నుంచి వసూలు చేసిన సొమ్ము తోనే ఆబహుమతులు పంచిపెడ్తారు. కొందరు అదికూడా చేయరు. ముందుగానే 'ఒప్పందం' కుదుర్చుకొని డబ్బు ఇవ్వకుండానే బహుమతిప్రదానం చేసే సంస్థలు కూడాఉన్నాయి. బహుమతి ప్రదానం అయిన తరువాత ఆసొమ్మను సంస్థకు విరాళంగా ఇమ్మని అడిగే సంస్థలూ ఉన్నాయి. ఇతరుల గ్రంథాలు ప్రచురించి ఆరచయితలను మోసంచేసే సంస్థలూ లేక పోలేదు. 'రచయితలు కావడమెలా?' మీరు కథారచయితలు అవ్వాలని ఆశిస్తున్నారా?' వంటి ప్రకటలనతో 'ఫీజులు' వసూలుచేసి– సమావేశాలు నిర్వహించకుండా లేదా నామకః నిర్వహించి లాభపడే సంస్థలు కూడా (తక్కువే కావచ్చు) ఉన్నాయి.

ఈ విధంగా ఆర్థికంగా లబ్ధపొందడానికి లేదా ఆర్థికంగా తనజేబు లోది ఖర్చు చేయకుండా 'హంగామా' చేయడానికి సంస్థలు ఏర్పడ్డాయి. అయితే ఆవిధంగా వచ్చిన సొమ్ము సంస్థ కార్యకలాపాలకు వినియోగించి నట్లయితే అనుచితం కాబోదు. వ్యాపార సంస్థలుగా మారితే సాహిత్యానికి ప్రయోజనం చేకూరకపోగా - కీడు చేకూరుతుంది.

నేటి సాహిత్య సంస్థలన్నీ పైన పేర్కొన్న సంస్థలవంటివని చెప్పటం నా ఉద్దేశంకాదు. చాలా సంస్థల విభజనలలోకి చెందుతాయి. అయితే పైన చెప్పిన ఏ విభజనకు చెందకుండా అన్ని ప్రక్రియలను అన్నివర్గాలను కలుపుకొని సాహిత్య కార్యక్రమాలుచేసే సంస్థలుకూడా ఉన్నాయి. గురజాడ అడుగుజాడలో 'పాత కొత్తల మేలుకలయిక'గా నడుపబడుతున్న సంస్థలున్నాయి. అవి ఆచార్య నారాయణరెడ్డి గారన్నట్టు –

''గతమనెడు వజ్రంపు గోడల
కట్టడముపై నిట్ట నిల్వున
శిరసునెత్తిన స్వర్ణమయగో
పురము సుమ్మీ వర్తమానము'' ♦

అనే సమన్వయ దృష్టిగల సాహిత్యసంస్థలు ప్రాచీన ఆధునికసాహిత్యాలపై కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి. సంప్రదాయ సాహితీ వేత్తనూ ఆహ్వానిస్తాయి_విప్లవ సాహితీ వేత్తనూ ఆహ్వానిస్తాయి. ఇదీ, ఈనాటి సాహిత్య సంస్థలకు కావలసినది.

అసలు సాహిత్య సంస్థల చరిత్రను పరిశీలించినప్పుడు ''ఆంధ్రుల ఆరంభ శూరత్వం'' వెంటనే స్ఫురిస్తుంది. అట్టహాసంగా సాహిత్య సంస్థను ప్రారంభించేటప్పుడున్న ఉత్సాహం ఆసక్తి క్రమేణా సన్నగిల్లి _ పూర్తిగా నశించిపోతాయి. అందువల్లనే ''మఖలో పుట్టి పుబ్బలో మాడినట్లు'' ఎన్నో సంస్థలు పుట్టడం _ గిట్టడం జరిగాయి. సాహిత్యసంస్థలు మూలపడడానికి నిద్రాణస్థితిలో ఉండడానికి _ నూనెలేని దీపంలో మినుకు మినుకుమంటూ వెలగటానికి _ కారణాలు అన్వేషించవలసివుంది. 'కర్ణుడి చావుకు 'అనేక కారణాలు' అన్నట్లుగా సాహిత్య సంస్థల వైఫల్యాలకు _ సాహిత్య సంస్థల పతనానికి కారణాలు చాలాఉన్నాయి. ఈ సందర్భంలో బులుసు వేంకట రమణయ్యగారి మాటలు స్మరించుకోవడం సముచితంగా ఉంటుంది. ♦♦

'' అదేమి విచిత్రమోగాని, మనదేశంలో మొదట్నుంచీ ఏ కార్యమన్నా సంఘం కంటే ప్రత్యేక వ్యక్తులు తలపెట్టితినే నెరవేరినట్లూ, సంఘం మీద ఆధారపడినవి నీళ్ళు కారుతున్నట్లూ కనబడుతుంది. దీనికి

---

♦ 'సమదర్శనం' ఖండికనుంచి

♦♦ 'మనసాహిత్య సంస్థలు' (వ్యాసం) _ కిన్నెర _ 1951, జనవరి

కారణం యేమిటంటే – సంఘంలో చేరిన వ్యక్తులు ఆయాకార్యాలలో తమకే కాకుండా తతిమ్మా వారికికూడా బాధ్యతఉందని అలసభావం వహించడం కాని, 'నాకేం పోయింది?' అనే తత్త్వాన్ని అవలంబించినవారుగాని – చెయ్యకపోతే మనని అడిగేవాడెవడు ?' అనేధీమా కలవారుగాని అయి ఉండడమే !

ఒకవేళ ఏ సంస్థ అయినా పనిచేసింది – లేదా చేస్తున్నది అని అంటే దానికి 'నాఖందో' అని తన జీవితాన్ని దానికోసం ధారపోస్తే వ్యక్తి ఉండడమే కారణమని మనం నిశ్చయించాలి''.

ఈ నిశ్చయాన్ని సుమారు నలభై సంవత్సరాల తర్వాతకూడా మనం మార్చుకోవలసిన అవసరం ఏర్పడలేదు. సాహిత్యసంస్థల పతనానికి వేంకట రమణయ్యగారు చెప్పినకారణాలు వాస్తవమైనవి. నిర్వాహకుల ఉదాసీనత, ఒకరిద్దరి నిరుత్సాహంలేదా మరణం లేదా ఉద్యోగరీత్యా 'బదిలీ' – వంటి వాటివల్ల చతికిలపడిన సాహిత్య సంస్థలున్నాయి.

సాహిత్య సంస్థలు 'అకాల మరణం, చెందడానికి మరో కారణం– 'పదవులకోసం ప్రాకులాట'. కొంతమంది కలిసి సదుద్దేశంతో సంస్థను స్థాపిస్తారు. ఆ వ్యవస్థాపకులు సంస్థను బాలారిష్టాలనుంచి కాపాడి బలాన్ని చేకూర్చి పెడతారు. అంటే ఆర్థికంగా పుష్టిని చేకూర్చి సంస్థకు పేరు తీసుకొస్తారు. అప్పటినుంచి పదవులకోసం తాపత్రయాలు మొదలవుతాయి. 'పదవీ కాంక్ష అవసరమేముంది?' అనుకోవటం సరికాదు. అధ్యక్ష, కార్య కార్యదర్శి పదవులవల్ల సభావేదికను అలంకరించవచ్చు. పెద్దలతో – అధికారులతో పరిచయాలు ఏర్పరచుకోవచ్చు. పత్రికలలో పేర్లు, ఛాయా చిత్రాలు ప్రచురితమయ్యేలా చూసుకోవచ్చు. అవకాశముంటే ఆకాశవాణి దూరదర్శన్‌లలో పాల్గొనే సదవకాశం ఏర్పడవచ్చు. పరిచయాలవల్ల స్వార్థ ప్రయోజనాలు చేకూరవచ్చు. ప్రపంచ – అఖిలభారత మహాసభ

లకు వెళ్ళవచ్చు (అహ్వానితులుగా). ఇన్ని లాభాలుగల పదవులకోసం – కీర్తికాంక్ష గలవారు ప్రాకులాడటంలో ఆశ్చర్యం ఏముంది?

పదవులకోసం ఎన్నికలు నిర్వహించబడతాయి. సభ్యుల్ని జేర్పించే ప్రయత్నాలు ముమ్మరమవుతాయి. వర్గాలు, పరస్పర ద్వేషాలు... మొదలైనవి సామాన్యమే! అప్పుడా సంస్థలపట్ల ప్రజలకు, సాహితీవేత్తలకు గౌరవభావం ఉండదు. వాళ్ళ సహకారం లభించదు. అటువంటి సంస్థల కార్యక్రమాలు అందర్నీ ఆకర్షించలేవు. అందుకనే 'సాహితీ సమితి' సభాపతి తల్లావజ్ఝల శివశంకర శాస్త్రిగారొకసారి 'తరుణ సాహితీ సమితి' (బాపట్ల) సభలో ఈ విధంగా చెప్పారట♦ –

"సాహితీ సంస్థలకు ఎన్నికలు జరపకూడదు. రిజిష్టరు చేయకూడదు. మూలనిధి పోగుచేయకూడదు. అప్పుడే సాహిత్య సంస్థ సాహిత్య సంస్థగా పనిచేస్తుంది.

ఆర్థికంగా బలహీనమైన సాహిత్య సంస్థలలో వర్గాలకు, పదవుల ప్రాకులాటకు అవకాశం చాలాతక్కువ. 'మూలనిధి' ఉన్నప్పుడు అందరి దృష్టి పదవులమీదనే ఉంటుంది. కష్టపడకుండా పేరు సంపాదించడానికి వీలుంటుందికదా! సంస్థ 'రిజిష్టరు'చేయబడితే విరాళాలు సంపాదించటాన్కి వీలు ఏర్పడుతుంది. సంస్థపై సదభిప్రాయం ఏర్పడుతుంది. నిజమేకావచ్చు గానీ – నష్టాలు లేకపోలేదు. 'రిజిష్టరు' కాకపూర్వం ఉన్న 'స్వేచ్ఛ' 'రిజిష్టరు అయినతర్వాత ఉండదు. కార్యనిర్వాహకవర్గం కొన్ని నియమ నిబంధనలకు లోబడి పనిచేయవలసి వుంటుంది. సభ్యుల సమావేశాలను చేసి అందరి ఆమోదమూ పొందవలసి వుంటుంది. ప్రతి పని నియమానుసారంగా, 'శాస్త్రీయంగా' చేయవలసివుంటుంది. అప్పుడు సాహిత్య కార్యక్రమాలకంటె ఈ తక్కిన పనులపై శ్రద్ధ ఎక్కువగా చూపవలసివుంటుంది. ఏ పర్యక్రమానికైనా అందరి ఆమోదం లభించ

♦ పోలాప్రగడ సత్యనారాయణమూర్తిగారు తెలిపారు

టం కష్టం కాబట్టి కార్యక్రమ నిర్వహణలో జాప్యం జరగవచ్చు—విభేదాలు తలఎత్తి అసలు కార్యక్రమాలే ఆగిపోనూవచ్చు.

సాహిత్య సంస్థలు కార్యక్రమాల నిర్వహణలో ఎన్నో అవక తవ కలకు పాల్పడుతూ ఉండాయి. ఎన్నో అనుచిత పద్ధతులకు ప్రోత్సాహిస్తూం టాయి. అందువల్లనే సాహిత్య కార్య క్రమాలపట్ల ప్రజలకు ఆసక్తి సన్నగిల్లిపోతోంది. అప్పుడు సంస్థకు ప్రజల సహకారం కూడా లభించదు.

చాలా కార్యక్రమాలకు 'అధ్యక్షులు' తప్పని సరిగా ఉంటారు. సభానిర్వహణ అధ్యక్షుని ప్రధానధ్యేయం. అది ఈ తరం అధ్యక్షులలో చాలామందికి లోపిస్తుంది. అధ్యక్షులవారే 'ప్రధానవక్త' గా భావించు కుంటారు. పైగా నిర్వహకులు కార్యక్రమంలో 'తొలిపలుకులు'— 'మలిపలుకులు' అని అధ్యక్షులవారికి రెండుసార్లు మాట్లాడే అవకాశం (ఛాన్స్!) కల్పిస్తారు సామాన్యంగా అధ్యక్షులుగా సాహితీవేత్తలను నియమించరు. ఇతర ప్రయోజనాకోసం ఒక రాజకీయనాయకుడినిగాని, ఒక వాణిజ్యవేత్తనుగాని లేదా ఒక ప్రభుత్వాధికారినిగాని 'సభాధ్యక్షులు, గా ఆహ్వానిస్తారు. సాహిత్యపరిజ్ఞానం లేకున్నా సదరు అధ్యక్షులవారు ఉప న్యాసం ఇస్తూనే ఉంటారు. సమయాసమయాలు — ఉచితానుచితాలు ఆయ నకు పట్టవు. ఆయన ఉపన్యాసధాటికి శ్రోతలు బిత్తరపోయి మెల్లగా జారు కుంటారు. ప్రధానమైన సాహిత్యోపన్యాసానికి శ్రోతలు పలచబడిపోతారు. పిలువబడిన అధ్యక్షులవారు నాయకుడో — అధికారో అయితే ముందు ఆయన మాట్లాడి "ఇతరపనులవల్ల వెళ్ళవలసి వచ్చినందుకు క్షమించ ఖాంటూ" సభ వదిలేసి వెళ్ళిపోతారు. ఆయనకోసం (పనులుండి) వచ్చిన వారంతా సభనుంచి వెళ్ళిపోతారు. అప్పుడు సభ పదిమందితో 'ఇష్టాగోష్టి'గా జరుగుతుంది. పత్రికలలో మాత్రం ఆ అధ్యక్షులవారి 'చిత్రం'తో వైభ వంగా జరిగినట్లు వార్త వెలువడుతుంది. ఇటువంటి కార్యక్రమాలవల్ల

'సాహితీసేవ' జరుగుతుందా? ప్రజలలో సాహిత్యాభిలాష ఏర్పడుతుందా? అందుకే శేషేంద్ర శర్మగారు ఇలా అంటారు♦ –

"సాహిత్యసభలో ఒక సాహిత్య సమ్రాట్టు ఉంటాడు. కానీ అగ్రాస్థానంలో ఎవరో ఒక ధనికుడో ఒక అధికారో ఉంటాడు. అది చూడటానికి దుర్భరంగా ఉంటుంది"

ఈ సందర్భంలో విశ్వనాథ సత్యనారాయణగారి సభలో జరిగిన సంఘటనను పేర్కొనడం అప్రస్తుతం కాదనుకుంటాను.

– "బందరులో విశ్వనాథవారి ఉపన్యాససభకు అధ్యక్షులుగా ఒక అధికారిని కూర్చోపెట్టారు. విశ్వనాథవారు ఉపన్యాసం ప్రారంభించారు. అనర్గళంగా సాగిపోతోంది. సభాధ్యక్షులవారికి విశ్వనాథవారంటే భయం. ఎక్కడ ఏమాట అంటారోననే ఆందోళనతో ఆయన ప్రతి పదినిమిషాలకు విశ్వనాథవారివంకచూస్తూ 'బాగుంది' అంటూ చప్పట్లు కొడుతున్నారట. విశ్వనాథవారు మూడుసార్లు చూశారు. నాలుగోసారి చూసిన తర్వాత అధ్యక్షులవారితో "అయ్యా మీకంతగా చప్పట్లు కొట్టాలనిపుంటే ఎక్కడ కొట్టాలో అక్కడ నేను చేత్తో 'సిగ్నల్' ఇస్తాను. అప్పుడు చప్పట్లు కొట్టండి అన్నారట"

సాహిత్య సంస్థల నిర్వహణలో మరొకలోపం – సమయాన్ని పాటించకపోవడం. 'సమయపాలన' సంస్థకార్యవర్గంగానీ, వక్తలుగానీ ఏమాత్రమూ పట్టించుకోరు. సభలో ఉపన్యాసకులు ఇంకా ఉన్నారన్న సంగతికానీ – శ్రోతలకు వినే ఓపికలేదనిగానీ పట్టించుకోరు. అందుకే సాహిత్యసభలో ''మైకాసురులు'' ఉంటారనే ఛలోక్తి కూడా ఉంది. (ఇందులో కూడా 'శ్లేష' ధ్వనిస్తుంది. మైకంకమ్మి మాట్లాడతారని ఒక

♦ 'మహతి' – యువభారతి ప్రచురణ (1972) పుట 78

భావం – మైక్ పట్టుకొని వదలరని మనోభావం) రెండుగంటలకంటె మించకూడని సాహిత్య సభలు గంటల తరబడి జరగటంవల్ల తీరిక, ఓపిక లేని శ్రోతలు జారుకుంటారు. మహాసభలు చప్పగా జరుగుతాయి.

సాహిత్యసంస్థలు నిర్వహించే కార్యక్రమాలనుబట్టి సంస్థ మనుగడ ఆధారపడివుంటుంది. సత్కారాలకు, బిరుదుప్రదానాలకు, అంకితోత్సవాలకు అంకితమైపోయిన సాహిత్యసంస్థలపట్ల గౌరవభావం ఏర్పడేఆస్కారం లేదుకాథా! అటువంటి సంసంస్థలను శ్రోతలు 'పరస్పర భజన సంఘాలు'గా కీర్తిస్తూంటారు. 'ఇచ్చిపుచ్చుకొనే ధోరణి'గా వ్యాఖ్యానిస్తూంటారు. ఇటీవల ఈ సత్కారసభలు – సన్మాన పత్రాలు మితిమీరిపోవటంవల్ల ప్రజలలో 'సహృభావనం' నశిస్తోంది.

ఆర్థికంగా పుష్టివంతమైన సంస్థలకు 'అధిపతి'గా 'పోషకులు'గా కొందరుంటారు. వారిఇష్టానుసారమే కార్యక్రమాలను నిర్వహించాలి. ఆయనకు విధేయులైన కార్యవర్గం పనిచేయవలసివుంటుంది. అంతా 'ఏకవ్యక్తిపాలన' (one Men show)గా కొనసాగుతుంది. ఇటువంటి సంస్థలవల్ల సాహిత్యానికీ లాభంవుండదు– ప్రజలకూ ప్రయోజనం ఉండదు 'ఏదో చేస్తూఉంటారు – పత్రికలలో ఏవో పడుతూండాయి' అని వాటిని పట్టించుకోకపోవడం కనబడుతుంది.

సాహిత్య సంస్థల పతనానికి సంస్థ నిర్వాహకులే కాదు–సాహితీవేత్తలుకూడా కొంతవరకు బాధ్యులే. సంస్థల కార్యక్రమాలకు అహ్వానించినప్పుడు అంగికారం తెలిపి – కరపత్రాల ప్రచురణ కూడా అయిన తర్వాత ఆ కార్యక్రమాలకు వెళ్ళని సాహితీవేత్తలు ఉన్నారు. 'వెళ్ళలేని సాహితీవేత్తలు' ఉండవచ్చు. అనివార్యమైన అత్యవసరమైన కారణాలవల్ల వెళ్ళలేకపోవచ్చు. ముందుగా ఆమోదం తెలిపి 'బద్ధకంవల్లనో – అంతకంటే లాభదాయకమయిన కార్యక్రమం ఉండటంవల్లనో అశ్రద్ధవల్లనో కార్యక్రమాలకు వెళ్ళరు. ఆ సాహితీవేత్తలవల్ల సంస్థకు'

సంస్థ కార్యవర్గానికి అపకీర్తి వస్తుంది. ప్రజలలో నమ్మకం పోతుంది. సంస్థపట్ల 'అన్యమయిన' ఆలోచన జనిస్తుంది. మరికొందరు సాహితీ వేత్తలు, కవులు సాహిత్య కార్యక్రమాలలో పాల్గొనడానికి 'నియమ నిబంధనలు' పెడుతూంటారు. 'సకల సౌకర్యాలు' ఏర్పాటు చేయాలని కోరుతూంటారు. అభ్యుదయాన్ని ఆకాంక్షించేవారు కూడా ఈ విధంగా ప్రవర్తించడం జరుగుతోంది. నా పరిశోధనా శక్తి మేరకు సంప్రదాయ పండితులే సంస్థల కార్యక్రమాలకు సంపూర్ణ సహకారం అందిస్తున్నారని తెలిసింది. ఆచార్య చేకూరి రామారావుగారు ముఖాముఖిగా అన్నట్టు – "వస్తానని రాకపోవటం అన్యాయం. దారిఖర్చులివ్వాలి చేబాలు. వక్త జేబులోకి రాక పోయినా జేబులోంచి ఖర్చవకుండా ఉంచేచాలు" అని సాహితీవే త్తలు, కవులు భావించి సాహితీ సేవలో, సాహిత్య కృషిలో తామూ భాగస్వాములే అని గుర్తించి సహకరించినప్పుడు సాహిత్య సంస్థలకు కొంత ఊపిరి వచ్చినట్లే.

సాహిత్య సంస్థలవల్ల ప్రయోజనాలతోపాటు నష్టాలున్నాయా? అనే ఆలోచన రావచ్చు. 'లేకపోలేదు' అనే సమాధానం చెప్పవలసి వుంటుంది. ఈ సందర్భంగా కుందుర్తిగారి మాటలను ఉదాహరించవలసి వుంటుంది. ♦

రచయితల సంఘాలలో సభ్యులుగాఉండే రచయితలకు ఇచ్చిన సలహా ఇది "బాబూ జాగ్రత్త. ఈ సంస్థానిర్మాణ కృషివల్ల నీ సృజనాత్మక శక్తి సాధన – దెబ్బ తింటుందేమో చూసుకుంటూ ఉండు".

ఈ మాటలలో నిజంలేకపోలేదు. కవులు, రచయితలు సంస్థ కార్యవర్గంలోఉంటూ సంస్థ కృషిలో తలమునకలైపోతే రచనాశక్తి సన్నగిల్లటమో – పూర్తిగా అంతరించిపోవటమో జరుగుతుంది.

---

♦ 5–11–90 నాటి ఆంధ్రప్రభ దినపత్రిక – సాహిత్యప్రభ.

క్రొత్త రచయితలు, యువకులు స్ఫూర్తిపొంది రచనారంగలో పేరుప్రఖ్యాతులు తెచ్చుకోవడానికి ఉపకరించే సంస్థలో – ఒక రచయిత సంస్థ భారాన్ని మోస్తున్నప్పుడు రచనలకు తగిన తీరిక, ఓపిక ఉండదు. ఆవాతావరణం వేరుగా ఉంటుంది. ఇది అందరకూ వర్తించకపోవచ్చు. ఎక్కువమందికి వర్తిస్తుంది. ఆ విధంగా సంస్థల భారం తలపైవేసు కొని రచనా రంగంనుంచి నిష్క్రమించినవారూ ఉన్నారు.

సాహిత్యసంస్థలవల్ల మరొక నష్టం ఏమిటంటే – యువకుల్ని, వర్ధమాన రచయితల్ని ప్రోత్సహించడనికి సంస్థలు వారిని సత్కరిస్తాం టాయి. బహుమతులతో ప్రశంసిస్తుంటాయి, వారి రచనలను సభల ద్వారా ఆవిష్కరిస్తూఉంటాయి. ఆ ఆవిష్కరణ సభలలో పలువురు పెద్దలు ఈ యువకుల్ని ప్రోత్సాహ సూచకంగా ప్రశంసిస్తూంటాయి. ఈకొందరకుకొన్నిసంస్థలు బిరుదులుకూడాఇస్తూంటాయి. కార్యక్రమాలలో పాల్గొన్న వర్ధమాన రచయితలు తామింకా సాహిత్య విద్యార్థులమనే సంగ తిని విస్మరిస్తూంటారు. ఈ ప్రశంసలూ – సన్మానాలూ నిజంగా ప్రతి భావంతుడ్ని కాబట్టే లభించాయని భావిస్తారు. సాహిత్యాధ్యయనం విడిచి పెడ్తారు. గొప్పరచయితలమనీ, కవులమనీ భావించుకుంటారు. ఎదగ వలసిందిపోయి చతికిలబడతారు.

సాహిత్యసంస్థలు నిర్వహించే ఆవిష్కరణ సభలు ఒక 'ప్రహస నంలా కొనసాగుతాయి. ఒక రచనగురించి పదిమందికి తెలియజేయటానికీ రచయితను లోకానికి పరిచయం చేయటానికి 'ఆవిష్కరణసభలు' అవస రమే. అయితే ఈ సభలవల్ల ఆశించిన ప్రయోజనం చేకూరదంలేదనే చెప్పాలి. అయా రచనలలోని బాగోగుల్ని పరామర్శించే సభగా అది నిర్వహింపబడాలిగానీ 'భజనసభ'గా ఉండకూడదు. [illegible]తోపాటు ఆ రచయిత మరింత మంచిరచనలు చేయడానికి సూచనలుఇచ్చే అలవాటు వక్తలలో అలవడాలి. అందుకు సంస్థ కార్యకర్త లేకాదు – రచయితలు కూడా సహకరించాలి. అలా జరగనినాడు ఆవిష్కరణసభలు – మొక్కు బడిగా జరుగుతాయి !

సాహిత్య సంస్థలపట్ల ప్రజలలోగల నిర్లక్ష్యభావానికి మరొ[illegible]ణం కూడా ఉంది. సాహిత్యసంస్థలు వర్గాలనుబట్టి ఏర్పడినవి ఉంటాయని సిద్ధాంతాలనుబట్టి ఎర్పడినవి ఉంటాయని, ప్రక్రియలనుబట్టి ఏర్పడినవి ఉంటాయని చెప్పుకున్నాంగదా! ఒకే పట్టణంలో ఇన్నిరకాల సాహిత్య సంస్థలున్నాయి. అప్పుడు ఒక సాహిత్యసంస్థ నిర్వహించిన కార్యక్రమాలకు మరొక సాహిత్యసంస్థవారు పాల్గొనరు. ఎవరివర్గం వారిదే! ఎవరి కార్యక్రమాలు వారివే! సాహిత్యసంస్థలలోనే – సాహితీవేత్తలలోనే ఈ విధమైన భేదభావాలు – ద్వేషాలున్నప్పుడు ప్రజలలో ఆయా సంస్థలపట్ల ఆదరణభావం ఎలా ఉంటుంది? ఏవిధంగా ప్రజల సహకారం లభిస్తుంది?

ఇన్ని లోపాలు సాహిత్యసంస్థల కార్యవర్గంలో – సాహితీవేత్తలలో కనిపిస్తూండగా సాహిత్య సభలకు జనంరారనీ – సాహిత్య సంస్థలకు ప్రజల సహకారం లభించడంలేదనీ వ్యాఖ్యానించడం సముచితమేమో ఆలోచించవలసివుంటుంది.

సాహిత్య సంస్థలకు ఆర్థికసహాయం అవసరమన్నది వాస్తవమే. అయితే ఆర్భాటాలులేకుండా సాహితీ ప్రియులు స్థానిక సాహితీమిత్రులు ఒకచోట (ఇల్లుకావచ్చు – కళాశాలకావచ్చు – పాఠశాలకావచ్చు) సమావేశమై సాహిత్య కార్యక్రమాలు నిర్వహించవచ్చు. ఎవరైనా సాహితీవేత్త వచ్చినప్పుడు – వస్తానన్నప్పుడు పెద్ద కార్యక్రమం నిర్వహించవచ్చు. అసలు సాహితీ సంస్థలకు ఆర్థికభారం ఎక్కువవుతోంది. ఒక విధంగా సొమ్మును దుర్వినియోగం చేసే సంస్థలు కూడా లేకపోలేదు.

విలాసవంతమైన, 'ఖరీదైన' భవనంలో కార్యక్రమం నిర్వహించడం – సంస్థ ఆర్థిక స్తోమతకుమించి అధికారులను ఆహ్వానించటం – అలంకరణకు, ఛాయాచిత్రాలకు (ఫొటోలకు) ప్రాధాన్యం ఇవ్వడం – ఇటువంటి వాటివల్ల వ్యయం ఎక్కువైపోతోంది. అసలు వీటికే ప్రాధాన్యం ఇస్తున్నారని చెప్పినా తప్పులేదేమో ! సాహిత్యోపన్యాసకులకు

లభించేది తక్కువే అయినా ఇతర ఏర్పాట్లకు ఎక్కువ ఖర్చు పెట్టవలసి వస్తోంది.

సాహిత్య సంస్థలు ఆర్థికంగా నిలబడాలంటే ప్రభుత్వం సహాయం చేయవలసివుంది. సాంస్కృతిక వ్యవహారాలశాఖ అప్పుడప్పుడు సహాయం చేస్తూ వుంటుంది. అయితే ఆ సహాయంలోకూడా ఆశ్రిత పక్షపాతం, రాజకీయాల ప్రభావం చోటుచేసుకుంటోంది. ఇక సంపన్నులపై ఆధారపడాలి వదాన్యులు ఎంతకాలం సహాయం చేస్తారు? కాబట్టి ప్రజల సహాయ సహకారాలమీద – సాహితీప్రియుల, సాహితీవేత్తల, రచయితల సహకారం మీదనే ఆధారపడవలసి వుంటుంది. వీరు చందాలతో సంస్థలను నిలబెట్టవచ్చు. అయితే – సాహిత్యవేత్తలలో, రచయితలలో సాహిత్యంకోసం వెచ్చించేవారు ఎంతమంది ఉంటారు? తన రచన పడిన పత్రికనుకూడా కొనకుండా మరొకచోట నుంచి తన రచనను కత్తిరించుకొనే రచయితలున్నప్పుడు – చందాలవల్ల సంస్థలు నిలదొక్కుకుంటాయా? చందాఇస్తే నాకేమిటి లాభం? అని ప్రశ్నించే కాలమిది. కాబట్టి సంస్థ సభ్యులు, రచయితలు, సాహితీవేత్తలు 'సొంతలాభం కొంతమానుకొని' – చందాలతో సంస్థకు సహకారం అందజేసినప్పుడు ప్రజల, వదాన్యుల, సంపన్నుల సహాయం లభిస్తుంది. ఇప్పటికీ డబ్బయి – ఎనభై సంవత్సరాలుగా సాహిత్యకృషి చేస్తున్న సంస్థలు సజీవంగా వున్నాయంటే వదాన్యుల' ప్రజల సహకారమే కారణం. ప్రజల, సంపన్నుల ఆర్థిక, హార్థిక సహకారం లభించాలంటె – వారి ప్రశంసలు పొందేలా కార్యక్రమాలు నిర్వహించాలి. అందుకు దాదాపు నలభై సంవత్సరాల క్రితం బులుసు వేంకటరమణయ్యగారు చేసిన సూచనలు అనుసరించడం తప్పనిసరి. అవి – ♦

♦ 'మన సాహిత్య సంస్థలు' – కిన్నెర 1951 జనవరి

1 మనదేశంలో యిలాంటి సంస్థలు సరిగ్గా పనిచేసి, వాటివల్ల ప్రయోజనం కలగాలంటే అది ప్రాశ్చాత్య దేశాల్లో ఉండే సంస్థల పద్ధతి అవలంబించాలి. అంటే సంస్థ అన్నివిధాలా కొత్త విషయాలని కనిపెట్టడానికి సిద్ధపడి — ఆవిషయంలో తగిన కృషి జరపాలి.

2 ఎంతో పరిశీలించి అర్హతవుండేవాళ్ళనే అందులో సభ్యులుగా చేర్చుకోవాలి. కాని మొగమాటపడిగాని, ధనవంతులని ఆలోచించికాని అర్హతలేనివారికి అందులో సభ్యత్వం వుండకూడదు.

3 ప్రతి సభ్యుడు తాను చేసిన పరిశోధన సారాంశాన్ని పదిహేను రోజుల కొకసారి లేదా నెలకి ఒకసారి సమావేశమై వ్యాసరూపంగా పఠింపచేసి-ఆవిషయం చర్చించడానికి అందరికీ అవకాశంయివ్వాలి

4 జరిగేచర్చలు భాషాభేదంతోగాని, మరియే యితర భేదంతోగాని కూడి ఉండక నిష్పాక్షికంగా ఉండాలి.

5 సంస్థలోని కార్యవర్గంవారు తమ ఆశయాలను లోకానికి విన్నవిస్తూ తమకు సాయపడాలని ప్రార్థించి నిధిని వసూలు చెయ్యాలి.

6 ఇట్టి సంస్థకు ప్రభుత్వం అన్నివిధాలా సహాయంచెయ్యాలి. ఇలా జరగనప్పుడు ఏ సంస్థా పనిచెయ్యలేదు. అందులోనూ ఆంధ్ర భాషా, వాఙ్మయాలకు సంబంధించిన సంస్థ బొత్తిగాపనిచెయ్యలేదు

[illegible] ఆవేదికపై ఉపన్యసించిన [illegible] సూచనలతోపాటు, ఈ క్రింది సూచనలు కూడా గమనించదగినవే

1 సాహిత్యోపన్యాసం ఎంతముఖ్యమో సమయపాలన (Time sense) కూడా అంతే ముఖ్యంగా భావించాలి.

2 తొలిపలుకులు, తుదిపలుకులు వంటి కార్యక్రమాలుబాగా తగ్గించి ప్రధాన వక్తకి (సాహిత్యోపన్యాసానికి) ఎక్కువ సమయం కేటాయించాలి.

3 వక్తకి వచ్చిన, నచ్చిన అంశంపై ఉపన్యాసం ఏర్పాటుచేయాలి.

4 పండితులు, కవులు 'వక్తలు' కాకపోవచ్చు వక్తృత్వ లక్షణాలు గలవారిని 'వక్త'లుగా ఆహ్వానించాలి.

5 వక్తలు కూడా ఆహ్వానించగానే అంగీకారం తెలపకుండా - తన కంటె బాగా మాట్లాడేవారిని సూచించవచ్చు. 'ఫలానా అంశం మీదనే మాట్లాడతాను' అనవచ్చు. తెరియకపోయినా పిలిచిన వెంటనే అంగీకరించి ఏదో ఒకటి చెప్పాలనుకోవటం కూడదు.

6 వక్తలు మాట్లాడుతున్న అంశానికి పరిమితమై కాలాన్ని అతిక్రమించకుండామాట్లాడాలి. విషయాన్ని వదిలి ఇతర అంశాలపై మాట్లాడటం పద్ధతికాదని గ్రహించాలి.

7 సాహిత్య సంస్థలకు సహకారంఇస్తూ కార్యక్రమాలలో పాల్గొనాలి. ఆర్థికలాభాలకోసం సంస్థ నిర్వాహకులను ఇబ్బందికి లోను చేయ కూడదు.

8 సంస్థ కార్యవర్గంవారు వేదికమీద కనిపించకుండా ఎక్కువసేపు మాట్లాడకుండా ఉండాలి.

9 శ్రోతలు కార్యక్రమాల మంచిచెడులను విమర్శించే వీలుకల్పించి శ్రోతల అభిప్రాయాలను తెలుసుకొని దానికనుగుణంగా కార్యక్రమాలను నిర్వహించాలి.

10 అంకితోత్సవాలు, సత్కారాలు, బిరుదులు - మొదలైన కార్య

క్రమాలు చేయకుండా ఉండటం మంచిది. లేదా కనీసం తగ్గించాలి. సంస్థకు సంబంధించిన వారెవరైనా ఈ కార్యక్రమాలలో పాల్గొన కుండా నియమం చేసుకోవాలి.

10 సంస్థ స్థాపించినపుడు సభ్యులు ఎంతోకొంత సొమ్ము వెచ్చించ టానికి సిద్ధంకావాలి. సేవచేయటానికి వెనుకంజ వేయకూడదు.

ఇన్ని సూచనలు పాటించినా సాహిత్య సంస్థలు పాటించవలసిన పద్ధతులు కొన్ని ఉన్నాయి. సంస్థకార్యవర్గంపట్ల ప్రజలకు నమ్మకం ఏర్ప డాలి. నమ్మకం ఏర్పడేలా నిజాయితీతో, చిత్తశుద్ధితో పనిచేయగల కార్య వర్గం ఉండాలి. అన్ని సంస్థలనూ, అన్ని వర్గాలవారిని కూడగట్టుకొని పని చేయగల సామర్థ్యం ఉండాలి.

కార్యవర్గ సమావేశంలో ప్రతివారు తన అభిప్రాయాలను నిష్క ర్షగా తెలియజేయాలి. అత్యధికుల నిర్ణయాన్ని ఆమోదించాలి, అంతే కాని రెండునాల్కల ధోరణి ప్రమాదకరం. అభిప్రాయభేదాలు మంచి కార్య నిర్వహణకోసం_సంస్థ అభివృద్ధికోసం సహకరించాలిగానీ – వ్యక్తి గత వైషమ్యాలకోసంకాదు.

సంస్థ నిర్వాహకులలో పెద్దవారుమాత్రమే ఉండాలనుకోవటంవల్ల తరాల అంతరం ఏర్పడుతుంది. వయసుడిగినప్పుడు, శక్తి సన్నగిల్లి నప్పుడు యువకులకు అవకాశం ఇవ్వాలి. సాహిత్యసంస్థల నిర్వాహకు లతో, సాహిత్య సభలలో పాల్గొనే సాహితీవేత్తలలో, కవులలో 'నిజా యితీ' లేనప్పుడు ఆ సంస్థ అభివృద్ధి చెందలేదు. ఆశయాలు వల్లిస్తే వినే శ్రోతలుకాదు – ఈ తరంవారు, ఆచరణనుకూడా గమనిస్తున్నారు. ఆశయాలు వల్లించడానికి – ఆచరణకీ పొంతన ఉండాలని యువతరం –

నవతరం ఆశిస్తోంది. ఆలా ఉన్నప్పుడు సాహిత్యసంస్థలవల్ల సమాజంలో సాహిత్యాభిలాష పెంపొందుతుంది. పఠనాశక్తి పెంపొందుతుంది. అప్పుడు సమాజానికి కృషి ఫలిస్తుంది. అప్పుడు మాత్రమే సాహిత్య సంస్థలు భాషా సాహిత్యాలకు నిజమైన సాహితీసేవ చేసినట్లవుతుంది.

"క్రొత్త నీటిని జేర్చుకొని తర
గెత్తు నదివలె ఎట్టిజాతియు
ముందుకేగిన యంతకాలము
మూడు పూవులు, ఆరుకాయలు"

— ఆచార్య సి. నారాయణరెడ్డి

# ఉపసంహృతి

ఉభయగోదావరి జిల్లాలలోని సాహిత్య సంస్థల చరిత్రను, తీరు తెన్నులను నా శక్తిమేరకు పరిశీలించడమైనది. ఒకటిమాత్రం నిజం — సాహిత్యసంస్థలవల్ల సాహిత్యానికి మేలుజరుగుతోంది. రచయితలకు సహకారం లభిస్తోంది. యువకులకు ప్రోత్సాహం లభిస్తోంది. కొందరు నిస్వార్థంగా సంస్థలు స్థాపించి సాహితీసేవ చేసినవారున్నారు. కొందరు సంస్థలకు ఆర్థికసహాయం చేసిచేసి చేతులు దులుపుకొన్నవారుకూడా ఉన్నారు. కార్యక్రమాలు బాగా చేయకపోయినా 'హడావిడి' చేసే సంస్థలుఉన్నా ప్రజలు వాటిని పట్టించుకోవటంలేదు. నేటి సాహిత్య సంస్థలకంటె మరుగునపడిన సంస్థలే తెలుగుభాషా సాహిత్యాలకు చిత్తశుద్ధితో సాహితీసేవ చేసినట్లు తెలుస్తోంది. సచ్ఛీలంగల నిర్వాహకులుంటే సాహిత్య సంస్థలకు ప్రజల సహకారం తప్పక లభిస్తుందనే ఆశకూడా కలుగుతోంది. భాషా సాహిత్యాల అభివృద్ధిలో' సాహిత్యంద్వారా సమాజాన్ని చైతన్యంచేసే కృషిలో, రచయితలకు ప్రోత్సాహాన్ని కల్పించే కార్యక్రమంలో సాహిత్యసంస్థల పాత్ర ప్రముఖంగాఉందని వివరించటానికే ఈ పరిశోధనావ్యాసం ఉద్దేశింపబడింది. ఈ నా ఉద్దేశంలో ఎంతవరకు సఫలీకృతుడనయ్యానో సాహితీవేత్తలు నిర్ణయించాలి.



# అనుబంధం - 1

## సాహిత్యసంస్థలు గురించి మరికొన్ని వివరాలు :

సురవరం ప్రతాపరెడ్డిగారిచే 20-11-1941న హైదరాబాదులో స్థాపించబడిన 'విజ్ఞానవర్ధినీ పరిషత్తు' సాహిత్య, వేదాంతాది విషయాల పై కార్యక్రమాలు నిర్వహించింది. 'రామాయణ విశేషములు', 'ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము' మొదలైన గ్రంథాలను ప్రచురించిన ఈ సంస్థ శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి, శ్రీ వెలమచర్ల రంగాచార్యులు, శ్రీ ఖండవిల్లి లక్ష్మీరంజనం మున్నగువారి నేతృత్వంతో కొనసాగింది.

హైదరాబాదులో 1952లో నెలకొల్పబడిన సాహిత్యసంస్థ - 'నవ్య సాహితీ సమితి'. కురుగంటి సీతారామాచార్యులుగారు, నిడదవోలు వెంకట రావుగారు, పోతుకూచి సాంబశివరావుగారు ఈ సంస్థను నిర్వహించారు. సాహిత్య కార్యక్రమాలు, కావ్య కథా సంకలనాల ప్రచురణలతోపాటు మొదటిసారిగా అఖిలభారత తెలుగురచయితల మహాసభ (1960)ల నిర్వహణ చేపట్టిన సంస్థ ఇది.

'విశ్వసాహితి' 1960 లో పోతుకూచి సాంబశివరావుగారి సారథ్యంలో స్థాపించబడి నేటికీ సజీవంగా నిలిచిన సంస్థ. నెలనెలా గోష్ఠులు - చర్చలు ఏర్పాటుచేస్తూ - విశ్వసాహితి - Urilit అనే పత్రికలను నిర్వహిస్తూ యువకులకు ప్రోత్సాహమిస్తున్న సంస్థ ఇది.

శ్రీయుతులు ముష్టి సుబ్రహ్మణ్యశాస్త్రి, చిపురుల సుందరరామశర్మ కాపూరి పూర్ణచంద్రరావు, బాపట్ల రాజగోపాలశర్మ ప్రభృతుల నేతృత్వంలో 1983లో విజయవాడలో 'రసభారతి' సంస్థ ఆవిర్భవించింది. సాహిత్య కార్యక్రమాలను అవిచ్ఛిన్నంగా కొనసాగిస్తూ సారస్వతాభిలాషను కలిగిస్తోంది.

శ్రీయుతులు గుత్తికొండ సుబ్బారావు, డా॥ జి. వి. పూర్ణచంద్‌లు సాహిత్య సంస్థల సమిష్టి సహకారానికి, సమిష్టికృషికి ఒక వేదిక అవసర మని భావించి "సాహితీ సంస్థల సమన్వయ సమాఖ్య" సంస్థను స్థాపించి ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఆ తర్వాత సంస్థ పనిచేయలేదు.

ఇవికాక పూర్వం సాహితీసేవచేసినవి – ప్రస్తుతం చేస్తున్నవి మరి కొన్ని సంస్థలున్నాయి. అవి –

1 జ్యోతిర్మయి (1965) – తెలంగాణాలోని పాలమూరు మండలం
2 ఇందూరు భారతి – నిజామాబాదు ప్రాంతం
3 సాహితీబంధు బృందం – హనుమకొండ
4 శ్రీలేఖ సాహితి – వరంగల్లు
5 సాహితీ మేఖల – నల్గొండ
6 సాహిత్య సమితి – తిరుపతి
7 శ్రీనివాస సాహితీ సమితి – హైదరాబాదు.
8 నవోదయ – హైదరాబాదు
9 నవ్యకళారాధన – హైదరాబాదు
10 ఆంధ్ర సారస్వత సభ (1917) – కోన వెంకట్రామశర్మగారు స్థాపించారట!
11 సారస్వత సదనం (1960) – రావినూతల
12 కవిరాజాశ్రమం (1945) – నాగండ్ల గ్రామం (చీరాల ప్రాంతం
13 సరస్వతీ బాలకుటీరం (1965) – ,,
14 ఆంధ్ర గీర్వాణ సాహిత్య సమ్మేళనం – విజయనగరం
15 ప్రకాశం జిల్లా రచయితల సంఘం (1970) – ఒంగోలు

16 నవకవి మండలి – పెనుమర్తి వెంకటరత్నం మొదలైనవారి సంస్థ

17 వాఙ్మయ సమితి – నరసారావుపేట

18 కందుకూరు తాలూకా రచయితల సంఘం (1974) ఉలవపాడు

19 సూరన సారస్వత సంఘం (1978) - నంద్యాల

20 ప్రభాకర పరిశోధన మండలి (1950) - హైదరాబాదు

21 కళాభారతి – బాపట్ల

22 చిత్తూరు జిల్లా రచయితల సంఘం (1968) – చిత్తూరు

23 గంగాధరం సాహితీ కుటుంబం (1975) – చిత్తూరు

24 విద్యాధర ప్రభాస – మోదా (ప్రకాశంజిల్లా)

25 సాహిత్య సరస్వతి – గుంటూరు

26 శ్రీవాణీ కళాపరిషత్ – సోంపేట (శ్రీ॥ జిల్లా)

27 ఆంధ్ర శిల్పకళా పరిషత్(1945) – తెనాలి

28 సాహిత్య వేదిక (1981) – అనవర్తి

29 గుంటూరు సాహితి (1976) – గుంటూరు

30 సాహిత్యోద్యానము (1935) – జాంద్రపేట

31 బాలసాహితీ సమాఖ్య (1983) – అనకాపల్లి

32 సారస్వతం – రేమిడిచర్ల– (నర్సరావుపేట)

33 విజయసాహితి (1956) – విశాఖపట్నం

34 విజయసాహితి (1956) – విజయవాడ

35 కళాప్రియ – చిలకలూరిపేట

36 విజ్ఞానవేదిక – ,,

37 కళా తరంగిణి — చిలకలూరిపేట
38 కళా సదస్సు — ,,
39 కళా నిలయం — ,,
40 విశ్వభారతి — ,,
41 అభ్యుదయ రచయితల సమాఖ్య — మార్కాపురం
42 యువజన సాహితీ సమాఖ్య — ,,
43 చైతన్య స్రవంతి — ,,
44 వెలనెలా వెన్నెల — కావలి
45 అరుణ భారతి — బనగానపల్లె
46 సాహితీ భారతి — శ్రీశైలం ప్రాజెక్టు
47 విజ్ఞాన సమితి — విజయవాడ
48 వేమన సాహితీ సమితి — ప్రొద్దుటూరు
49 పాపయారాధ్య సాహితీ కేంద్రం — అమరావతి
50 కవిత్రయ జయంతుల సంఘం — నెల్లూరు
51 తిక్కన విజ్ఞాన కేంద్రం — ,,
52 స. ర. ప. ,,
53 నెల్లూరు జిల్లా రచయితలసంఘం — ,,
54 కళా మందిర్ — ,,
55 కళా సుధ — ,,
56 సాహిత్య సదస్సు — ,,
57 శ్రీకృష్ణదేవరాయ సాహిత్య పరిషత్ — కావలి
58 సాహితీ మిత్రులు — వరంగలు

59 వైతాళిక సమితి – హైదరాబాదు
60 సాహితీ మేఖల – చుండూరు (నల్గొండజిల్లా
61 జ్యోత్స్నా సమితి – గుంటూరు
62 కవిరాజ సాహిత్య విహార్ (1956) – గుడివాడ
63 యువ స్పందన – విజయనగరం
64 విజయ భావన – ,,
65 రాయల సాహిత్య పరిషత్ – ప్రొద్దుటూరు
66 మెదక్ మండల రచయితల సంఘం – మెదక్
67 మెదక్ మండల సాహిత్య పరిషత్ – మెదక్
68 సాహితీ వికాస మండలి – సిద్ధిపేట
69 మంజీరా రచయితల సంఘం – సిద్ధిపేట
70 మెదక్ స్టడీసర్కిల్ – మెదక్
71 ఆంధ్ర భారతీ తీర్థ (1924) – విజయనగరం
72 కౌముదీ పరిషత్ (1935) – విజయనగరం
73 శ్రీ విశాఖ సారస్వత వేదిక (1960) – విశాఖపట్నం
74 భాషా సేవక సమితి (1945) – విశాఖపట్నం
75 ట్వెంటీఫస్ట్ సెంచరీ రైటర్స్ (1973) – విజయనగరం
76 బాల సారస్వత కళాపరిషత్ (1969) విశాఖపట్నం
77 లలితకళా సమితి (1946) – విశాఖపట్నం
78 లహరి – ,,
79 విశాఖ సాహితి – ,,
80 ఆంధ్ర లలితకళా సుజనరంజనీ సభ – విశాఖపట్నం

81 యలమంచిలి సాహితీ సమితి (1963) – యలమంచిలి
82 కన్యకాపరమేశ్వరీ సాహిత్య సమితి – అనకాపల్లి
83 కవితా సమితి – అనకాపల్లి
84 విజ్ఞాన సమితి – ,,
85 'రంజని' సాహితీ సమితి (ఎ. జి. ఆఫీసు) – హైదరాబాదు
86 జనహిత సాహిత్య సమితి – కాశ్మీర్ గడ్డ (కరీంనగర్)
87 సింహపురి సాహితీ సమాఖ్య – నెల్లూరు
88 నెల్లూరు ఆంధ్రసభ – నెల్లూరు
89 రచన – కడప
90 సాహితీ మంజరి – ఒంగోలు
91 పింగళి - కాటూరి సాహిత్యపీఠం – హైదరాబాదు
92 సర్వారాయ ట్రస్ట్ – కపిలేశ్వరపురం

## సాహిత్య సంస్థలపై కొందరి అభిప్రాయాలు :

1 "శ్రీ గిడుగు రామమూర్తిగారిని అనుసరిస్తూ నవ్యాంధ్ర సాహిత్య పరిషత్ స్థాపితమైనది. ఈ సంస్థ శ్రీ త. శివశంకర శాస్త్రిగారు అధ్యక్షులుగా – తెలికిచర్ల వేంకటరత్నము కార్యదర్శిగా వేదుల సత్యనారాయణ, నోరి నృసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, నాయని సుబ్బారావు, దేవులపల్లి సభ్యులుగానూ స్థాపితమైంది. వీరందరూ రచనలన్నీ శిష్టవ్యవహార భాషలో నుండవలెననే ధ్యేయము కలవారే. ఈ సంస్థలో సభికుడను కాకపోయినా వీరందరూ నాకు స్నేహితులగుటవలన వీరితో కలిసి పనిచేసేవాడను. ఆ రోజులలోనే ఇంగ్లీషులో త్రివేణిపత్రిక

ప్రారంభమైంది. ఆ పత్రిక మొదట సంచికలో శ్రీ కృష్ణశాస్త్రి 'ఉకులో ఉకునై" అనే పద్యమును నేను ఇంగ్లీషులో తర్జుమా చేశాను.

— ఆచంట జానకిరామ్

2 "1923కి మా సాహితీ సమితికి నిండురూపం వచ్చింది. సాహితీ సమితి నవ్య కవిత్వాన్ని ఒక ఉద్యమంగా చేసింది. ఒకరికొకరం మా కావ్యాల్నిగూర్చి, కష్టసుఖాల్నిగూర్చి ఉత్తరాలు వ్రాసుకొనేవారు. 'అన్యోన్యము మెచ్చుకునే సంఘము వీళ్ళది' అని కొందరు మమ్మల్ని అనేవారేమో! కాని ఆ మాట అన్యాయం. నాకుమాత్రం సమితివారూ, సాటి కవులూ సాహితీపరులందరూ ఎప్పటికీ రక్త బంధువులకన్నా ప్రియులు 1925లో సఖి — అనే సాహితీ సమితి పత్రిక బయలు వెడలింది."

— దేవులపల్లి కృష్ణశాస్త్రి

3 "నేనూ ఆంధ్ర సాహిత్య పరిషత్తూ ఒక్క సంవత్సరంలో పుట్టాం. నాకు దానిమీద సోదరప్రేమ. అభిప్రాయభేదాల మాటకేంగాని- అది ఆంధ్ర సాహిత్యానికి చేసినసేవ ఏతన్మాత్రంకాదు. అపూర్వ శాసనాలు అముద్రిత గ్రంథాలు సంపాదించింది. ఆంధ్రదేశ భాషాభిమానులందరికీ భారద్వాజాశ్రమంలా పనిచేసింది. వచ్చినపని అయినట్టుంది. పటుత్వం తగ్గింది. వయసుడిగింది. క్రొత్తతరానికి భాషమీద, సాహిత్యంమీద తగిన రుచి కల్పించలేకపోయింది. వెనక్కి తిరిగింది."

— ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

4 "శ్రీరంగం శ్రీనివాసరావు (సాహితీ సమితి) అని అచ్చులో చూసుకోవాలని నాకు చాలా ఉబలాటంగా ఉండేది. నాలోనూ, పురిపండాలోనూ ఉండిన ఈ ఉబలాటమే 'కవితా సమితి' స్థాపనకి కారణమని

ఇప్పుడు వెనక్కి చూసుకొని ఆలోచిస్తే అనిపించుతోంది. శ్రీరంగం శ్రీనివాసరావు బి. ఎ. కంటె కూడా శ్రీశ్రీ (కవితాసమితి) అనుకోవడం నాకు బాగుండేది."

"అన్ని సంఘాలు మొదట సంకల్పశుద్ధితోనే ఏర్పడతాయి. యౌవనం కాలక్రమాన వార్ధక్యంగా మారకతప్పదు. రాను రాను స్వప్రయోజనాలు ఘనీభవించి, ఎదిగివస్తూన్న నూతనభావాల సౌందర్యాన్ని గుర్తించలేని గుడ్డితనం ఒకటి ఈ వార్ధక్యానికి పుట్టుకొస్తుంది.

— శ్రీ. శ్రీ.

5 "ప్రతి సంస్థకు ఒక చారిత్రక అవసరం వుంటుంది. కాలాన్ని బట్టి సంస్థలు అవసరార్థం ఏర్పడుతూ ఉంటాయి. సంస్థలు చేసిన సాహితీ సేవ అపూర్వం. కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, ఆంధ్ర సారస్వత పరిషత్తు, సాధన సమితి, తెలంగాణా రచయితల సంఘంవంటివి మాకు ప్రోత్సాహమిచ్చాయి. చైతన్యాన్ని కలిగించాయి. ఉర్దూలో చదివిన మావంటి వారికి ఈ సంస్థలవల్లనే సాహిత్యంపైపు ఆకర్షణ కలిగింది. అవి Multi – dimentional గా పని చేశాయి. తెలంగాణాలో ఆంధ్ర సాహిత్యం వ్యాపిచెందడానికి ఈ సంస్థలే ప్రాణస్నాయువులు అనటంలో అతిశయోక్తి లేదు."

— ఆచార్య బి. రామరాజు

6 "ఒక ఉత్తమమైన భావప్రసరణకు సంస్థ అవసరం. లేకపోతే 'జీర్ణమంగే సుభాషితమ్' లా ఉండిపోతుంది.. వ్యక్తిలోఉండే కవితాధోరణి భావనలు సమాజంలో వ్యాప్తి చెందడానికి సభలు, సంస్థలు అవసరమే. ప్రజలకి సాహిత్యం అందాలంటే సంస్థలు ఉండాలి. కొన్ని సంస్థలు పత్రికల నిర్వహణద్వారా కూడా సాహితీసేవ చేశాయిగదా!"

— డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి

7 "మేధావులకోసం ఏర్పడిన సంస్థలున్నాయి. సామాన్యులకోసం ఏర్పడిన సంస్థలున్నాయి. Collective Leadership అనేది సంస్థకి ఉండవలసిన ప్రధాన లక్షణం. ఇది తెలుగు సాహిత్య సంస్థలలో ఎంత వరకు సఫలమైంది? సంస్థలతో పనిలేకుండా ఉద్యమాలకోసం, మంచి సాహిత్య సృష్టికోసం ప్రయత్నించినవారూ ఉన్నారు. ఏ సంస్థ అయినా సాహిత్యసేవ చేస్తుందీ అంటే గౌణంగా సామాజికసేవ చేస్తున్నట్టే."

— ఆచార్య జీ. వి. సుబ్రహ్మణ్యం

8 "కొత్త రచయితలు పుట్టేందుకూ, సాహిత్య ధోరణుల్ని అధ్యయనం చేసేందుకూ సాహిత్య సంప్రదాయాన్ని ఆకళింపు చేసుకునేందుకూ సంస్థలు అవసరం. అయితే అవి రాజకీయ పార్టీలకు తొత్తులుగా వ్యవహరించరాదు. రాజకీయవాదుల్ని చేరనీయకపోవడం, వారిని తగు మాత్రం దూరంలో ఉంచడం అవసరం."

— ఆర్. ఎస్. సుదర్శనం

9 "సారస్వత సంఘాలు ఏర్పడడంవల్ల రచయితల్లో కొంత చైతన్యం పెరిగింది. సమిష్టిగా కలిసి కొన్ని గ్రంథాలు ప్రచురించే కృషి జరుగుతోంది. అయితే ఉత్సాహవంతులైన యువకులు అనేక చిన్న చిన్న సారస్వత సంఘాలుగా ఏర్పడే విచ్ఛిత్తిలక్షణాలు కొన్ని ప్రస్ఫుటం చేస్తున్నారు. ప్రభుత్వం, ప్రజల ఆదరణతో వివిధ ప్రాంతాలలో ఏర్పడిన రచయితల సంఘాలు రచయితలకు సమిష్టిగా సహాయం చేయడం, తరచు కలిసి మెలిసి సాహితీ విషయ చర్చలవలన సాహితీ చైతన్యం పొందడం జరుగుతోంది. రచయిత వ్యక్తిగత ప్రతిభతో రాణించవలసిందే రచయితలసంఘం ఆ ప్రతిభకు వేదిక ఏర్పరచి సమీకరించవలసిందే."

— పోతుకూచి సాంబశివరావు

10 "ఏడవయాంధ్ర సారస్వత మహాసభ వైశాఖ బహుళము నందు కోపూరునందు గూడినది. మూడునాళ్ళ ముచ్చట ముగిసినది. జ్యేష్ఠ బహుళమునందు తణుకునందు సాహిత్యపరిషత్తు మహాసభ గూడనున్నది. మూడునాళ్ళ ముచ్చట తీరగలదు. సన్మాన సంఘాధ్యక్షులు, సభాధ్యక్షులు మహా సభలయందు గంభీరోపన్యాసములు చదువగలరు. పండితులు, పరిశోధకులు, కవీశ్వరులు భావభరితములైన వ్యాసములను చదువుదురు. మహాసభలు తీర్మానములను జేయును. ఉపసంఘములేర్పడును. ఈ భాగవత మేటేటను జరుగుచుండును. ఈ మహాసభలయందు జరిగిన భాగవతమే యితర సభలయందును ఏదో విధమునను నడచుచుండును. పని మాత్రము గనబడదు."

— భారతి, జూన్ 1924

11 "తెలంగాణా రచయితల సంఘం కొందరు రచయితల కూటమి మాత్రమేకాదు. అది ఒక ఉద్యమం. సాహిత్య మహోద్యమం: దాశరధి దానికి నాయకుడు. నారాయణరెడ్డి ఆయన అనుచరుడు, ఉపనాయకుడు. ఆంధ్ర సారస్వత పరిషత్తులో ఆ నాటి పెద్దల నిరంకుశ ధోరణికి, అభ్యుదయపరులైన యువ రచయితలపట్ల నిర్లక్ష్య వైఖరికి ప్రతిఫల చర్యగా తె. ర. సంఘం ఉద్భవించింది. అయితే సారస్వత పరిషత్తును ద్వేషించ లేదు."

— వి. పి. రాఘవాచార్యులు
(ఏప్రిల్, 1988 స్రవంతి)

# అనుబంధం - 2

ముఖాముఖీలు :

1 సాహిత్య మండలి (ఏలూరు) వ్యవస్థాపకులలో ఒకరైన 'సాహితీ వల్లభ' సామవేదం జానకిరామ శర్మగారు 25-4-1989 న ముఖాముఖిగా తెలిపిన అంశాలు!

మరూరు లక్ష్మీనరసప్ప పంతులుగారు జిల్లా ట్రెజరీ ఆఫీసరుగా ఉంటూ తేటగీతుల్లో రామాయణం రాస్తుండేవారు. ఆంగ్లాంధ్రాలలో దిట్ట అయిన సోమంచి లింగయ్యగారు న్యాయవాది. ఆయన దివ్యజ్ఞాన సమాజ సభ్యుడు. బి. వి. లింగాచార్య, శ్రీనివాసాచార్య – ఈ ఇద్దరు సోదరులు సాహిత్య విషయాలపై సరియైన అవగాహన కలవారు. భోగరాజు బుచ్చి రామయ్యగారు – పట్టాభిగారికి బంధువులు, సాహిత్యపరిచయం గలవారు. ఆంధ్రపత్రిక కరస్పాండెంట్‌గా ఉండే మంగళంపల్లి చంద్రశేఖరరావు – మేము రోజూ ఒకరికొకరు చూసుకోలేకుండా ఉండేవాళ్ళం. వాళ్ళని తలుచుకుంటే గుండె ఉద్విగ్నమవుతుంది. లింగయ్యగారింటి దగ్గర సాహిత్యమండలిని స్థాపించాం. మొక్కపాటి కృష్ణమూర్తి కూడా కలిసాడు

అభిప్రాయ భేదాలు వచ్చేవి – నాకూ బొమ్మకంటి సోదరులకూ వచ్చేవి. సాహిత్యశక్తి గలవాళ్ళే సభ్యులుగా ఉండాలని వారి అభిప్రాయం డబ్బు కావాలన్నా, కార్యక్రమాలు బాగా చెయ్యాలన్నా డబ్బున్నవాళ్ళూ, పెద్దలూ ఉండాలని నేనూ వాదించేవాడ్ని.

ఒకర్ని చూసి ఒకరు రచన చేసేవాళ్ళం- మొక్కపాటి 'విరహి' కావ్యం రాసాడు. అదిచూసి నాకూ రాయాలనిపించి– 'ప్రవరుడు' రాశాను. ప్రవరుడు వరూధినికోసం బాధపడ్డట్టు రాశాను. సభలో సత్యనారాయణ గారు రాసారనిచెప్పి చదివి వినిపించాను. అంతా చాలాబాగుంది అన్నారు. చివర్లో చెప్పా – నేనే రాసానని – షాక్ తిన్నారు – అబద్దం చెప్తున్నావు

అన్నారు. జమ్మలమడకవారు సాహిత్య దృష్టితో చూడండి – ధార్మిక దృష్టితోకాదని సమర్థించారు.

ఆ రోజుల్లో మాకు సాహిత్యం నిత్యజీవితంలో ఒక భాగం అయింది సాహితీచర్చల్లోపడి సభ్యులు భోజనంకూడా చేయ్యని ఘట్టాలెన్నో ఉన్నాయి పవిత్రమైన దేవాలయంలోకి ప్రవేశించినట్టుగా 'సాహిత్య మండలి' లోకి ప్రవేశించేవాళ్ళం. నండూరివారుకూడా వస్తుండేవారు. బొడ్డు బాపిరాజు గారు మండలిలో సభ్యుడే. లాండ్ మార్టిగేజ్ బ్యాంకు ప్రెశిడెంటు అయిన కలగర నాగభూషణ చౌదరిగారు మండలికి అండగా నిలబడేవారు. ఇరవై సంవత్సరాలు తెలుగునాట సాహిత్య మండలికి అపూర్వమైన ఖ్యాతి లభించింది

2 సాహిత్య మండలి (ఏలూరు) నిర్వాహకులలో ఒకరైన డాక్టర్ శంకర శ్రీరామారావుగారితో 25–4–89న జరిపిన ముఖాముఖి.

మొదట్లో సాహిత్యమండలి బాగా పనిచేసింది. తర్వాత కొన్నాళ్ళు ఆగిపోయింది. అప్పుడు స్వాతంత్ర్య సమరయోధులు, న్యాయవాదులు ఐన రాజభూషణరావుగారు 'సాహిత్య మండలిని నీకు అప్పగిస్తున్నాను డాక్టరువి, కవివి కాబట్టి బాగుచెయ్యాలి' అని నాకు అప్పగించాడు లింగయ్య. అప్పుడు పుల్లాభొట్ల శ్రీరామమూర్తి కార్యదర్శి, అంతకుముందు కాంద్రేగుల రామచంద్రరావు కార్యదర్శిగా ఉండేవారు. అప్పట్నించి దేశంలోని కవుల్ని, పండితుల్ని పిలిపించి పెద్దఎత్తున – ఉవ్వెత్తున సభలు నిర్వహించాం. 1945-58 మధ్య అనుకుంటాను. మా ఇంట్లోనే అందరికీ భోజనాలు. ఒక సభలో ఎంకిపాటల్ని నండూరివారిచేతే పాడించాను. ఆయన బాగా పాడేవాడు. మంచి కంఠం. నండూరి అప్పట్లో లీడింగ్ లాయర్.

మంచాళ జగన్నాధరావుగారి త్యాగరాజకృతులు కచేరీ పెట్టించాం. నండూరి ఆ కచేరీ విని రెండు నెలలు ఆయనను ఉంచేద్దామన్నాడు. సరే అన్నాను. వీణ వాయిస్తూ రోజూ పాటలుపాడి వినిపించేవాడాయన. ఎంకి పాటలు రాసిన ఇరవై అయిదు సంవత్సరాలకు మంచాళవల్ల మళ్ళీ కవిత్వం రాద్దామనే Inspiration పొందాడు.

మునిమాణిక్యంవారు రిటైరై పోయి - ఆర్థికంగా బలహీన స్థితిలో ఉన్నప్పుడు సాహిత్యమండలి - కాస్మోపాలిటన్ క్లబ్‌తో కలిసి కొంత ఆర్థిక సహాయం చేసింది.

మా సాహిత్యమండలి సభలలో వక్తలకి రెమ్యూనరేషన్ ఇచ్చే వాళ్ళంకాదు. ప్రయాణపుఖర్చులు మాత్రమే ఇచ్చేవాళ్ళం. లక్ష్మణదాసు (యతీంద్రులవారు), వెల్చేరు నారాయణరావు, కార్యకర్తలుగా ఉండేవారు కొనకళ్ళ వెంకటరత్నం, సామవేదం, గరికపాటి మల్లావధాని, మొక్కపాటి కృష్ణమూర్తి, బొడ్డు బాపిరాజు, కొండముది శ్రీరామచంద్రమూర్తి వీళ్ళంతా సాహిత్యమండలి చనుబాలు త్రాగినవాళ్ళే.

నా హయాంలో రాజకీయ నాయకుల్ని, అధికారుల్ని సభలకు పిలిచేవాడ్నికాను. సాహితీవేత్తల్ని పిలిచేవాడ్ని.

కొనకళ్ళ పోలీసు డిపార్టుమెంటులో గుమాస్తాగా పనిచేసేవాడు. కోమటి. కొనకళ్ళకి సాహిత్యాభిలాష వుంది. పాండిత్యంలేదు. నండూరి, కొనకళ్ళకి కవిత్వం ప్రధానంకాదు - అనుషంగికం మాత్రమే.

సంస్థల గురించి చెప్పమన్నారు-"The History of the institutions is the History of individuals" అంటాను. Degenaration అన్నిటిలోనూ వచ్చింది. సాహిత్యంలోనూ వచ్చింది. ఇప్పుడు dedicated soul ఉన్నవారు కనబడటంలేదు. Our culture was ruined by two - Politics and Cinema. ఇప్పుడంతా ఎలా

ఉందంటే – By selection not by election. Democracy అన గానే పనికిమాలినవాడు వస్తాడు. పని జరగదు. ప్రజాస్వామ్యం, స్వేచ్ఛా సంస్థలు పాడైపోవటానికి కారణాలు. ఎవరో ఒక ధనవంతుడ్ని పట్టుకో వాలి – ఆతనికి సంస్థ అప్పగించాలి. ఒక్క మనిషివల్ల సంస్థలు ఉంటాయి ఆ ఒక్కడూ లేకపోతే పడుకుంటాయి. సాహిత్య కళారంగాల పోషణ దెబ్బ తినటానికి రాజకీయాలస్పర్ధ కారణం. రాజకీయాలపై ఉన్న మక్కువ వీటిపై లేదు. Culture అక్కరలేదు వాళ్ళకి. సాహిత్యసంస్థలో ఎవరైనా సభ్యులు కావచ్చు – ఆ పరిస్థితి ఏర్పడింది.

3 శ్రీ నన్నయ భట్టారక పీఠం (తణుకు) నిర్వాహకులలో ఒక రయిన బంధకవి సీతారామాంజనేయులుగారితో జరిపిన ముఖాముఖి విశేషాలు :

1931లో పామర్తి రమణమూర్తి (ఎలిమెంటరీ స్కూలు టీచర్) కార్యదర్శిగా, పోతాప్రగడ శ్రీరామారావు (న్యాయవాది) అధ్యక్షులుగా నన్నయభట్టారకపీఠం గ్రంథాలయం స్థాపించారు. పావలా, బేడ సభ్యత్వ రుసుం ఉండేది.

మొదట్లో ప్రైవేట్ సభల్లా – పరిమితంగా చిన్నవిగా ఉండేవి. పామర్తిగారు మంచి Worker. హేళనచేసినాసరే చందాలు పోగుచేసి పని చేసేవాడు. ఆయన మరణించినతర్వాత పీఠం మూలపడింది. ఓరియంటల్ కాలేజి ప్రిన్సిపాలు ఎమ్. వి. సూర్యనారాయణగారు సన్నిహితులై ఏదైనా సంస్థ పెడదామన్నారు. వేరే సంస్థ ఎందుకని 1966 – 1967లలో నన్నయ భట్టారకపీఠం రివైజ్ చేసాం. సూర్యనారాయణగారు అధ్యక్షులు. వేదుల సూరిగారు కార్యదర్శిగా ఉండేవారు.

రెండుమూడు సంవత్సరాల తర్వాత నేను పీఠాధిపతిని అయ్యాను. అప్పుడు మూలనిధి రూపాయిపావలా ఉండేది. సంవత్సరం – సంవత్సరం

న్నర కాలం దాదాపు నా సొంతఖర్చులతో కార్యక్రమాలుచేసి ప్రాచుర్యం తీసుకొచ్చాను.

సంస్థ అభివృద్ధి చెందాలంటే ఎవడి జేబుసంస్థ కాకూడదు. ఆలా ఉంటే కుండీలో మర్రిచెట్టు అవుతుంది. అందుకే Public ను involve చేశా. సభాధ్యక్షులుగా మరొకర్ని పెట్టేవాళ్ళం. ఇతర రంగాలలో ఉన్న వాళ్ళని attract చెయ్యాలంటే తప్పదుమరి. Publicity బాగావచ్చింది

నన్నయ్య పీఠంలో మాట్లాడటానికి కవులు, పండితులు ఉత్సాహం చూపే స్థాయికి తీసుకువచ్చాం. పదకొండు సంవత్సరాలు నేను అధ్యక్షుడ్ని సూరిగారు, సుశర్మ, రసరాజు కార్యదర్శులుగా ఉండేవారు. ప్రస్తుత పీఠాధిపతి డాక్టర్ వి. వెంకట్రాజుగారు. మూలనిధి నలభై వేల రూపాయ లుంది.

ఈ పీఠం పద్యపఠనం – పద్యరచనల పోటీలు నిర్వహించింది. స్త్రీలుకూడా సభలకు వచ్చేవారు. అందుకోసమే ఆధ్యాత్మిక సాహిత్యంపై ప్రసంగాలు ఏర్పాటు చేశాం.

సామాన్యుడికి సాహిత్యవాసన కలిగించడానికి సంస్థలు అవసరం. ఇది సమారాధన వంటిది. సభలవల్ల నిద్రాణమైనజాతికి చైతన్యంవస్తుంది కవులు, కవయిత్రులు, వక్తలు మా సంస్థనుంచి వెలుగులోకి వచ్చారు. శ్రోతలకు ఉత్సుకత కలిగించేరీతిగా క్రొత్త అంశాలతో – క్రొత్త కార్య క్రమాలు రూపుదిద్దుకుంటే – సంస్థ ప్రశంసకు పాత్రమవుతుంది,

4 'సాంస్కృతీ సమాఖ్య' అధ్యక్షులు – వివిధ సంస్థలతో సంబంధం గలవారు – విమర్శకులు శ్రీ అద్దేపల్లి శ్రీరామమోహనరావుతో జరిపిన ముఖాముఖి విషయాలు!

సాహిత్యసంస్థలు సాహిత్యానికి అవసరమే. దానివల్ల సమిష్టికృషి జరుగుతుంది. ఒకడు చేయలేనిది పదిమంది కలిసి చేయవచ్చు. ప్రచురణ, పత్రికానిర్వహణల వంటివికూడా సాధ్యపడుతుంది.

భావజాలంమీద ఆధారపడిన సంస్థయున్నాయి. అరసం – విరసం మొదలైనవి. వాటివల్ల సభ్యుడు ఆ ఆశయాలకే 'కమిట్' అయివుంటాడు. అపుడు ఆ భావాల ప్రచారానికి ఎక్కువ అవకాశం ఏర్పడుతుంది, నిబద్ధమైన భావజాలాన్ని వ్యాప్తి చేయడానికికూడా సంస్థల అవసరం బాగాఉంది ఉద్యమాలకీ సాహిత్య సంస్థలకీ అవినాభావ సంబంధం ఉంటుందనేచెప్పాలి. ప్రతి దేశంలోనూ ఉద్యమాలవెనుక సంస్థలు ఉంటాయి. ఇవి ప్రచార సంసలుగా పనిచేసాయి.

ఇప్పుడు అ.ర.సం. పాత్రగురించి చెప్పాలంటే, అరసం బలహీన పడింది. రాజకీయమైనవి కాకుండా సాంస్కృతిక సంస్థలు చేపట్టే కార్య క్రమాలే వాళ్ళు చేపడుతున్నారు. పైగా ఆ తరంవాళ్ళుతప్ప ఈ తరంలో Influenceచేసే రచయితలు, కవులు, అరసంలో లేరు. అరసం యొక్క ప్రభావం పెద్దగాఉందని నేనుఅనుకోను.

1970 నుంచి వి.ర.సం. సాహిత్యరంగాన్ని బాగా Influene చేసింది. నేటికీ మార్క్సిస్టు భావప్రచారం విరసమే ఇస్తోంది. తీవ్రమైన వర్గపోరాటాన్ని విరసమే ఇచ్చింది. విరసం ఇచ్చిన Influence తో విరసంలోలేని కవులుకూడా ఆ భావాలతో మంచి కవిత్వం రాస్తున్నారు. సాయుధపోరాటానికి నిబద్ధతగల రచయితలు విరసంలో ఉన్నట్టుగా అరసంలో లేరు. అరసంయొక్క చారిత్రక అవసరం పోయిందని చెప్ప వచ్చు.

జాతీయ సాహిత్యపరిషత్ గురించి ఆ సంస్థకు ఉద్యమలక్షణం లే రాజకీయ సాంస్కృతిక పోరాటాలపట్ల దానిపాత్ర ఏమీలేదు.

5 జాతీయ సాహిత్య పరిషత్ – రాష్ట్ర ప్రధాన కార్యదర్శి డాక్టర్ కొత్తపల్లి ఘనశ్యామలప్రసాదరావుగారితో ముఖాముఖీలోని అంశాలు :

తన ప్రవర్తన తనచుట్టూ ఉండే చరాచరవిశ్వంతో విరుద్ధం కాకుండా సమన్వయాత్మకంగా సాగే జీవనవిధానాన్ని మానవుడు ఆవిష్కరించుకోవాలి. అది వ్యక్తికీ – వ్యక్తుల సమిష్టిరూపమైన సమాజానికీ – ప్రకృతికీ సమన్వయాత్మకమైన హితాన్ని సమకూరుస్తుంది. ఇటువంటి వ్యష్టి, సమిష్టి,పరమేష్టుల సమన్వయాన్ని ఏదిప్రతిపాదిస్తుందోఅదేహితప్రదమైనదనీ – అటువంటి హితాన్ని ప్రతిపాదించేదే సాహిత్యమనీ నా అభిప్రాయం ఇటువంటి సిద్ధాంతాన్ని భారతీయ సాహిత్యంలో విశ్వశ్రేయః కావ్యమని చెప్పటం జరిగింది. అట్టి జాతీయమైనటువంటి విశ్వాసాన్ని ప్రోదిచేసే సాహిత్యాన్ని ప్రచారం చెయ్యటమే కర్తవ్యంగా భావించి కృషిచేస్తోంది జాతీయ పరిషత్.

సమాజానికి హితమైన సాహిత్యమే ఈ సంస్థకు ప్రధానం. కాలంతో కానీ ప్రక్రియతోగానీ సంబంధంలేదు. సమరసతనూ, సమన్వయాన్ని సమాజంలో ప్రోదిచేసేది – సాహిత్యపు విలువలు కలిగి ఉన్నదే జాతీయ సాహిత్య పరిషత్తు స్వాగతిస్తుంది.

రాజకీయం సమాజ జీవితంలో ఒక అంశంమాత్రమే. అది ప్రస్తుత పరిస్థితిలో ప్రభావం ఎక్కువగా చూపించి ఉండవచ్చు. అంతమాత్రాన సమాజం అంతా రాజకీయంకాదు. రాజకీయాలకు ఎప్పుడూ సాహిత్యం బానిసకాదు – కారాదు.

జాతీయ సాహిత్యపరిషత్తుకు ఉద్యమంతో సంబంధంలేదని కొందరన్నారు అంటే – ఉద్యమానికిచ్చే నిర్వచనంమీద ఆధారపడిఉంటుంది. ఒక భావాన్ని విస్తృతంగా వ్యాప్తిచేయటానికి చేసే ఏ ప్రయత్నమైనా ఉద్యమమే. రాజకీయాలతో సంబంధంకలదే ఉద్యమంగా భావించటం పొరపాటు.

జాతీయ సాహిత్య పరిషత్తు నీరసంగా ఏమీలేదు. చాలాచురుకుగా కార్యక్రమాలు సాగుతున్నాయి. రాష్ట్రం మొత్తంమీద నలభై ఏడు శాఖలు పనిచేస్తున్నాయి. అమలాపురం, కాకినాడ, రాజమండ్రిలలో ఉన్నాయిగదా! రంగారెడ్డి జిల్లాలో అన్నిటికంటె ఎక్కువ శాఖలున్నాయి. కార్యక్రమం విస్తృతి అనేది కృషిమీద ఆధారపడి వుంటుంది. చాలాశాఖలు సంవత్సరానికి నాలుగైదు పుస్తకాలుకూడా ప్రచురిస్తున్నాయి.

సాహిత్యసంస్థల మనుగడ గురించి అంటే... సాహిత్యం వ్యక్తి ప్రతిభతో ముడిపడి వుంటుంది. సమిష్టిగా కృషి జరిగినంతకాలం ఎట్టి సాహిత్యసంస్థయైనా చక్కగా సాగుతుంది. కానీ, వ్యక్తి కేంద్రమైపోయిన చోట పరస్పర సమన్వయంలేక చీలికలు వస్తాయి. అప్పుడు సంస్థలు నాశనమవుతాయి.

ఈ యాంత్రిక యుగంలో జీవితంలో నిజమైన ఊరట కలిగించేది, సరియైన ప్రేరణ పెంచేది సాహిత్యమే అయినప్పటికీ – ఈ బ్రతుకు పోరాటంలో సామాన్య మానవుడికి సాహిత్య వ్యాసంగానికి సమయం వెచ్చించటానికి అవకాశం తక్కువగా వుంది. అయితే సాహిత్యంయొక్క అవసరాన్ని గుర్తుచేయకలిగినంత మేరకు ప్రతివాడూ సమయం వెచ్చించటానికి సంసిద్ధుడవుతాడు.

మామిడికుదురు (కోనసీమ)లో వై. రాంబాబుగారు "రజని" సంస్థ స్థాపించి కథాసదస్సులు, గోష్ఠులు నిర్వహిస్తున్నారు. యువరచయితలకి సూచనలిచ్చి తరగతులు నిర్వహిస్తున్నారు. "పుట్టుకతోనే ఎవరూ రచయిత కాలేరు. అభ్యాసం ఉండాలి. ప్రోత్సాహం ఉండాలి." అందుకోసమే రచయితల, జర్నలిస్టుల నికేతనంగా "రజని"ని స్థాపించామని రాంబాబు (గాంధీ) గారు ముఖాముఖీగా వివరించారు.



# అనుబంధం - 3

**ఆధార గ్రంథపట్టిక :**


1 అబ్బూరి సంస్మరణ - సంపాదకుడు : అబ్బూరి గోపాలకృష్ణ

2 ఆంధ్రప్రదేశ్ దర్శిని (1987) - విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్

3 ఆంధ్ర రచయితలు - ప్రథమ భాగము (1973)
- మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

4 ఆంధ్ర సంస్థానములు - సాహిత్యపోషణము (1987)
- తూమాటి దొణప్ప

5 ఉద్యమ దర్శనము (1990) - ముదిగొండ శివప్రసాద్

6 కేళావళి (కవితాసంపుటి) 1982
- మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

7 కోకిల (కవితాసంపుటి) - శంకర శ్రీరామారావు

8 గౌతమీగాథలు - ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

9 తెలుగు కవితావికాశం (1882) - కె. రామమోహనరాయ్

10 తెలుగు వైతాళికులు II (1977) - ఆం. ప్ర. సాహిత్య అకాడమి

11 తెలుగు సాహిత్యంలో కల్లోల క్షీణదశాబ్దాలు (1988) - ఆనంతం

12 నవ్యాంధ్ర సాహిత్యవీధులు ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగములు
కురుగంటి సీతారామభట్టాచార్యులు, పిల్లలమర్రి వేంకటహనుమంతరావు

13 భీమేశ్వర పురాణము (1958) - శ్రీనాథుడు

14 మణిమంజూష (కవితాసంపుటి) 1918 - సం. పూ. భా.

15 మహతి (1972) — యువభారతి

16 మారేపల్లి రామచంద్రశాస్త్రి కవితాసమీక్ష (1987) — ద్వా. నా. శాస్త్రి

17 యాభై సంవత్సరాల జ్ఞాపకాలు (1981)
— దేవులపల్లి రామానుజరావు

18 వాఙ్మయలహరి (1982) — ద్వా. నా. శాస్త్రి

19 వీరేశలింగం రచనలు — స్వీయచరిత్రము (1987)
కందుకూరి వీరేశలింగము పంతులు (విశాలాంధ్ర ప్రచురణ)

20 సారస్వత వ్యాసములు 2, 5, సంపుటములు
— ఆం. ప్ర. సాహిత్య అకాడమి

21 సాహిత్య లహరి — ద్వితీయతరంగం (1984)
— ఎఱ్ఱనపీఠం, ఒంగోలు

22 శ్రీఖండము (కవితాసంపుటి) 1968
— మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

23 శ్రీనాథ కవితా సమీక్ష (1959) — చిలుకూరి పాపయ్యశాస్త్రి

24 శ్రీనాథ భారతి (1985) — శ్రీనాథ పీఠము, గుంటూరు

25 సమదర్శనం (కవితాసంపుటి) — సి. నారాయణరెడ్డి

26 సాహిత్యసమితి వ్యాసావళి (1967) — తిరుపతి సాహిత్య సమితి

27 హైదరాబాదు నగర తెలుగుభాషా సాహిత్య వికాస చరిత్ర (1985)
— ఓగేటి అచ్యుతరామశాస్త్రి

## ఆంగ్ల గ్రంథాలు :

1 Andhra Pradesh District Gazetteers (1979)
Dr. N. Rameshan

2 'A Good Friend .... ....' (1982)
– Book-fair Souvenir, Rajahmundry

## ప్రత్యేక సంచికలు :

1 ఆంధ్ర కేసరి యువజనసమితి రజతోత్సవ సంచిక

2 ఆంధ్ర జ్యోతి రజతోత్సవ సంచిక

3 ఆంధ్ర ప్రదేశ్ అవతరణ దినోత్సవ ప్రత్యేక సంచిక (1976)

4 ఆంధ్ర సారస్వత పరిషత్తు రజతోత్సవ సంచిక

5 ఆంధ్ర సాహిత్య పరిషత్తు రజతోత్సవ సంచిక

6 ఉషశ్రీ షష్టిపూర్తి సన్మాన సంచిక

7 'కేసరి' – ప్రకాశం పంతులుగారి 3వ జయంతి సంచిక

8 చైతన్య దీపిక – సాంస్కృతీ సమాఖ్య దశాబ్ది ప్రత్యేకసంచిక

9 ప్రపంచ తెలుగు మహాసభలు – ప్రత్యేక సంచిక (1981)

10 ముళ్ళపూడి తిమ్మరాజుగారి 63వ జన్మదినోత్సవ విశేష సంచిక

11 వర్ధమాన సమాజం (నెల్లూరు) ప్లాటినం జూబిలీ సంచిక

12 శ్రీ కోనసీమ భానోజీ రామర్సు కళాశాల (అమలాపురం) రజతో త్సవ సంచిక

13 శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల స్వర్ణోత్సవ సంచిక

పత్రికలు :

1 ప్రబుద్ధాంధ్ర
2 భారతి
3 అభ్యుదయ
4 అరుణతార
5 కిన్నెర
6 స్రవంతి
7 సమాలోచన
8 సమదర్శిని (భీమవరం)
9 సమాచారం (రాజమండ్రి)
10 ఆంధ్రజ్యోతి దిన, వారపత్రికలు
11 ఆంధ్ర ప్రభ దినపత్రికలు
12 ఆంధ్ర భూమి ,,
13 ఈనాడు ,,
14 ఉదయం ,,
15 కోస్తావాణి (రాజమండ్రి)

